48వ పూజాపుష్పము

## శ్రీరామ కథా సుధాలహరి

# అయోధ్యా కాండము

## రెండవ భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలలో)





దుర్గా ప్రసాద్

ప్రథమ ముద్రణము : 500 ప్రతులు

సర్వస్వామ్యములు: రచయితవి

వసంతము - చైత్రము
విక్రమనామ సంవత్సరము

2000 - ఏప్రియల్

మూల్యము రు. 30-00

ముద్రణము :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2

---

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞానభవనము, బ్యాంకుస్ట్రీటు,
హైదరాబాదు-500 001
అన్ని బ్రాంచీలలో లభ్యమగును

పి. దుర్గారావు, యం.ఓ.యల్., తెలుగు పండిట్ (రిటైర్డ్
అడవిదేవులపల్లి గ్రామం (పోస్టు) 508 207
(వయా మిర్యాలగూడ, నల్లగొండజిల్లా.



## సమర్పణ:

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్॥

పుష్పాంజలులతో.

# వి న య వా క్య ము

శ్రీమద్రామాయణము మహాకావ్యము. సంస్కృత భాషలో రచింపబడినది. రచించినది శ్రీ వాల్మీకులవారు. ఐదు వేల సంవత్సరముల క్రిందట వ్రాయబడినదని పెద్దలు జెప్పుదురు.

శ్రీమద్రామాయణమును భారతీయ భాషలలో ప్రపంచ భాషలలో ఎందఱో మహానుభావులు ననువదించిరి. ఆంధ్ర భాషలో గూడ గద్య పద్య గీతికా రూపాలలో ఎందఱో మహాకవులు గానముజేసిరి.

శ్రీమద్రాయణము భారతీయ సాహిత్యమునకును సంస్కృతికిని మూలము. ప్రతీక. రామాయణ కావ్యములోని నాయకుడైన శ్రీరామ చంద్రుడు భారతీయులకు పరమదైవము, పరబ్రహ్మ స్వరూపము. ఋషి తుల్యుడు. ఆదర్శ మానవుడు.

తమ పుట్టిన బిడ్డలకు తెలుగుదేశములో శ్రీరాముని పేరు పెట్టుకుందురు. రామ మందిరము లేని గ్రామము తెలుగుదేశములో లేదని చెప్పవచ్చును. అట్టి శ్రీరామ చరిత్రమును తెలుగులో, తేలిక భాషలో, సామాన్యులు పాడుకొనుటకు వీలుగా గీతికా రూపమున వ్రాయుటకు బూనుకొంటిని.

వృత్తిచేత ఉపాధ్యాయుడ నైనప్పటికినీ, సంస్కృత భాషా పరిజ్ఞానము స్వల్పమైనప్పటికినీ, శ్రీరామునిపై గల భక్తి భావముచేతను, శ్రీమద్రామాయణమునందు గల ప్రీతిచేతను ఇట్టి మహత్కార్యమునకు బూనుకొంటిని. శ్రీరామచంద్రుడే నా చేత యీ కార్యమును జేయించుచుండెనని నా భావన.

ముందుగా సుందరకాండమును, తరువాత బాలకాండమును ప్రచురించితిని. ప్రస్తుతము అయోధ్యకాండమును రెండు భాగములుగా విభజించి మొదటి భాగమును ప్రచురించితిని. రెండవభాగమును ప్రస్తుతము ప్రచురించుచున్నాను.

మిగిలిన రామాయణ కాండములనుగూడ ముద్రింపవలెనని నా యాకాంక్ష. నా కోరిక సఫలముజేయవలెనని పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్రుని వేడుకొనుచున్నాను.

ఈ గ్రంథములోని విశేషములు :

1. శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి, తేలిక భాషలో బాలుర కర్థమగు రీతిలో పాడుకొనుటకు వీలుగా రచించుటకు యత్నించితిని.

2. గీతికలుగా వ్రాయుటవలన స్వేచ్ఛానువాదమని భావింపవచ్చును. చేర్పులు, మార్పులు లేకుండా మూలము ననుసరించి వ్రాయబడినది.

3. 119 సర్గలలోనున్న అయోధ్యకాండను దాదాపు 2500చరణములలో పూర్తిచేయబడినది. రెండు భాగములుగా విభజింపబడినది.

4, ఇందలి ఛందస్సు చతురస్రగతి. మధ్యాంతరమున యతిగాని ప్రాసగాని యుంపబడినది. పాడుకొనుటకు వీలుగా పాదాంతమున గురువునుంపబడినది. నాలుగేసి పాదములు మూడు లేక రెండు ఒక గీతికగా గుది గ్రుచ్చబడినది.

5. ఏ సర్గమున కాసర్గ విపదీయబడి, విషయసూచిక జేర్చబడినది.

6. మూలమునందలి రెండు మూడు శ్లోకములను ఒక గీతికగా గూర్చబడినది.

7. మున్యాశ్రమములో మహర్షి వాల్మీకి దగ్గఱ నేర్చుకొని వీధి గాయకులుగా గానము జేసిన లవకుశులే నా కాదర్శము.

ఈ గ్రంథ రచనయందు భాషలో, భావనలో, అచ్చులో కథాగమన పుష్టిలో ఎన్నియో దోషములుండవచ్చును. సహృదయులు దెలియ జేసిన సరిదిద్దుకొందును.

గీతికా రచనలోగాని, ప్రచురించుటలోగాని ఎట్టి యాటంకములు గలుగనందులకు శ్రీరామచంద్రునకు నా నమోవాకములు. తక్కిన రామాయణకాండలను గూడ యిదే రీతిగా ప్రచురింపవలెనన నా యాకాంక్ష.

శ్రీ వాల్మీకులవారు శ్రీమద్రామాయణ కావ్యమును రచించి ముద్దుగా కుశలవులచే పాడించిరి. అదే విధముగా విద్యార్థులుగూడ యీ రామాయణమును ముద్దుగా పఠించి గానముచేసి సంగీత సాహిత్యములను సంపాదించుకొనవలెనని నా కోరిక.

శ్రీ రామాయణ గ్రంథము భారతీయులకు పూజనీయమైనది. అది కావ్యము. అట్టి గ్రంథముయొక్క ఆత్మీయతను వాల్మీకులవారి కవితా హృదయమును రామాయణములోని మహోజ్జ్వలములైన పాత్రలను స్పృశించుటయే గాక, రామాయణములోని శిఖరాయమానమైన సుందర కాండ, బాలకాండ అయోధ్యకాండలను ప్రచురింపగలుగుట నా పూర్వ పుణ్య సుకృతమని భావించుచున్నాను. సహృదయులకు నమస్కారములు.

—రచయిత

---

## కృతజ్ఞతలు

ఆర్ష విజ్ఞానట్రస్టు, హైదరాబాదువారు ప్రచురించిన రామాయణ గ్రంథము నా యీ యయోధ్యాకాండము గీతికా రచనకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

అదే విధముగా ఆ గ్రంథమును టీకా తాత్పర్య సహితముగా వ్యాఖ్యానించిన ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా వినయపూర్వక నమోవాకములు.

---

# విషయ సూచిక

## అయోధ్యకాండము-రెండవ భాగము

67. మునులు రాజులేని రాజ్యము అరాజకమని జెప్పి, ఎవరినైనా రాజును జేయమని వసిష్ఠుని బ్రార్థించుట

68. వసిష్ఠుని యనుమతిపై దూతలైదుగురును కేకయ దేశమునకు బోవుట

69. భరతుడు భయంకరమగు దుస్స్వప్నమును గాంచితినని మిత్రులకు జెప్పుట

70. మంత్రులు భరతునకు వసిష్ఠుని సందేశమును వినిపించుట-భరతుడు శత్రుఘ్న సమేతుడై అయోధ్యకు బయలుదేరుట

71. భరతుడు మంత్రులతో అయోధ్యకు బయలుదేరుట - వివిధ ప్రదేశములను దాటుట-సైన్యమును మెల్లగా రమ్మని తాను ముందుగా అయోధ్యకు బోవుట-కళావిహీనమైన అయోధ్యను గాంచుచు రాజ భవనమును బ్రవేశించుట

72. భరతునకు కైకేయీ గృహమునకు బోవుట-తండ్రి స్వర్గస్థుడయ్యె ననియు, రాముడు వనికి బోయెననియు కైక భరతునికి దెలుపుట

73. భరతుడు తల్లిని తీవ్రముగా గోపించుట

74. భరతుడు తల్లిని తీవ్రముగా నిందించుట

75. కౌసల్యయెదుట భరతుడు శపథము జేయుట

76. దశరథమహారాజు దహన సంస్కారము

77. అస్థిసంచయన కార్యక్రమము-భరత శత్రుఘ్నులు విలపించుట-వసిష్ఠ సుమంత్రులు వారిని యోదార్చుట

78. శత్రుఘ్నుని కోపము - కుబ్జను బట్టి యీడ్చుట - భరతుడు వారించుట

79. మంత్రులు మున్నగువారు భరతుని రాజ్యము స్వీకరింపుమని కోరుట-రాముడే రాజ్యాధికారియని భరతుడు బలుకుట

80. అయోధ్యనుండి గంగాతీరము వఱకు సుఖకరమగు రాజమార్గమును నిర్మించుట

81. ప్రాతఃకాలమున మంగళవాద్యములువిని భరతుడు దుఃఖించుట-వసిష్ఠుడు సభకువచ్చి మంత్రులను బిలువనంపుట

82. రాజ్యాభిషిక్తుడవుగమ్మని వసిష్ఠుడు భరతుని గోరుట - భరతుడు అంగీకపకుండుట-శ్రీరాముని గొని తెచ్చుటకై బయలుదేరుడని భరతుడు అందఱికీ ఆజ్ఞాపించుట

83. భరతుని వనగమనము - శృంగిబేర పురమున యా రాత్రి నివసించుట

84. భరతుడు సైన్యముతో గంగానదీ తీరమును జేరుట - గుహుని యాతిధ్యము

85. గుహ భరత సంవాదము-భరతుని శోకము

86. గుహుడు లక్ష్మణుని సుస్వభావమును, విలాపమును వర్ణించుట

87. భరతుడు రామునిగూర్చి ప్రశ్నలడుగుట - గుహుడు బదులు బలుకుట

88. రాముని కుశశయ్యనుగాంచి భరతుడు రోదించుట తానును జటావల్కలముల ధరించి వనమునందు నివసింపగోరుట

89. భరతుడు సేనతో గంగనుదాటి భరద్వాజాశ్రమమునకు జేరికొనుట

90. భరద్వాజ ఋషిని భరతుడు గలిసికొనుట

91. సేనా సమేతుండగు భరతునకు భరద్వాజుడు ఆతిధ్యమిచ్చుట

92. భరతుడు భరద్వాజునికడ సెలవు గైకొని సేనాసమేతుడై చిత్ర కూటమునకు బయలుదేరుట

93. భరతుడు సైన్యముతో చిత్రకూటమునకు బోవుట

94. శ్రీరాముడు సీతకు చిత్రకూట పర్వత శోభను జూపించుట

95. శ్రీరాముడు సీతకు మందాకినీ నదీ శోభను వర్ణించి తెలుపుట

96. భరతుడు సాలవృక్షమునెక్కి భరతుని సేనను జూచి కోపించుట

97. శ్రీరాముడు భరతుని సద్భావనమును గొనియాడి లక్ష్మణుని శాంత పఱచుట

98. భరతుడు రామాశ్రమమును వెదుకుట-కనుగొనుట

99. భరతుడు శత్రుఘ్నాదులతో కలిసి రామాశ్రమమునకు బోవుట

100 శ్రీరామచంద్రుడు భరతుని కుశలమడుగుచు రాజనీతిని యుప దేశించుట

101. భరతుడు రాముని రాజ్యము స్వీకరింపుమని కోరుట- రాముదంగీక రింపకుండుట

102. రాముని రాజ్యము గ్రహింపుమని భరతుడు పట్టుబట్టుట - తండ్రి మరణము నెఱిగించుట

103. రామాదుల విలాపము-తండ్రికి జలతర్పణము లిచ్చుట

104. రామలక్ష్మణులు తమ తల్లులను గలిసికొనుట

105. భరతుడు రాముని రాజ్యము స్వకరింపుమని కోరుట-జీవిత మని త్యమని రాముడు భరతునకు వేదాంతమును ఉపదేశించుట

106. భరతుడు మఱల రాముడు అయోధ్యకువచ్చి రాజ్యమును గ్రహింపు మని కోరుట

107. శ్రీరాముడు భరతుని వోదార్చి యయోధ్యకు వెళ్ళుమని యాదే శించుట

విషయసూచిక సమాప్తము

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళా నందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణీ! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిత!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నతహిమ గిరి శిఖరము లొప్పి శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!

# శ్రీ రామ కథా సుధా లహరి

## నివేదన

శ్రీరామాయణ పుణ్యగథను జనచిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధుర భావముల మల్లెమాలగా నలరింపన్!
శ్రీగణేశ్వరుని జిన్మయభక్తిని జిత్తము బొంగగ స్మరియింతున్!
శ్రీభారతి గిరిజామ తల్లులను సిద్ధిని గోరుచు బ్రార్థింతున్!

ఆదికవులు శ్రీవాల్మీకుల కిదె యలరి జేయుదును వందనముల్!
పూర్వకవులకును బుణ్యమతులకును బూర్ణభక్తి నే నర్చింతున్!
రామ కథను వ్రాసిన ఘనులకు నిదె రమ్య నమస్కృతు లర్పింతున్!
సీతారాముల భజించువారిని జేరికొలుతు నే నడుగడుగున్!

ఆసేతుహిమాచల పర్యంతంబును నలరెడి భారతదేశమునా!
భారతీయులకు బరమాదర్శము భవ్యరామ సీతాకథయే!
వారి మార్గమే యాధర్మము మఱి వారి చరిత దిగ్దర్శనమూ!
వారు నడిచినా మధుర మార్గమే వన్నెదెచ్చు జీవనధర్మం!

ముందుగ సుందర కాండను వ్రాసితి మోదమలరగా గీతికలన్!
బాలకాండమును బూర్తిచేసితిని వన్నెలు జిన్నెలు జిందగనూ!
చిన్ని మాటలను జిఱుత బాలురకు తీయని తీయని రాగములన్!
తెలియ జేయగను బూనుకుంటినీ తేనె లొలికెడీ గీతికలన్!

రామాయణమది మహాసముద్రము రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేట తెలుగులో మహాత్ములెందఱొ తెలియగ వ్రాసిరి విశదముగా!
సకల వాస్త్రములు వినవేలా? మఱి సర్వగ్రంథముల శ్రమయేలా?
రామాయణమది విన్నజాలు! ఇది రాజమార్గమగు జీవనమున్!

అందులకే నే నఖిల దేవతల యారాధనలను జేసితినీ!
పదముల నిమ్మని భావము లిమ్మని భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవమగు నిందిరారమణు నిహవరమిచ్చెడి రఘుపతినీ!
భక్తిభావమున శిరమును మోడ్చితి భావమునందున విలువమనీ!

ఎట్టి పుణ్యమును జేసితినో మఱి యెట్టి సుకర్మలు జేసితినో!
గట్టిగ యా శ్రీరాముని చరితము బట్టువడెను నా మనసునకున్!
మధురాక్షరములు మధురపదములై మంజుల గీతముగా వరుసన్!
లయతాళములను నృత్యము చేసెను లలితరాగ మధురోక్తులతోన్!

అల వాల్మీకులు వ్రాసినదానిని యా శ్రీరాముని సభయందున్!
వీధిగాయకులుగా కుశలవులును విమలగానమును జేసినదీ!
ఆ పాటను నే దెనుగున వాడితి నమరగానమును జేయంగన్!
తెలుగు బాసలో తేటతెనుగులో దెలుగు బాలకులు బాడుటకున్!

కఠిన పదములకు దూరముగా నే కఠిన భావముల జొరనీకన్!
బాలకులగు నా కుశీలవులనే భవ్యాదర్శముగా గొనుచున్!
శ్రీరాముని మహనీయ చరితమును జేయగ బూనితి గేయముగా!
బాలురు వృద్ధులు బాడుకొనుటకై భవ్యరాగలయ తాళములన్!

భారతదేశమునం దణువణువును భవ్యరామ శుభచరితంబున్!
పాడుకొనును శ్రీరామరామ యని భవ్యరాగలయ తాళములన్!
గాలికదలికల వినిపించును నా కమ్మని రాముని నిస్వనముల్!
అట్టి కథను నే రచింప బూనితి ఎట్టిసుకృతినో యీ జన్మన్!

సుందరకాండను బ్రచురించితినీ సురుచిరమగు నీ చందమునన్
బాలకాండనూ బ్రచురించితినీ బాలకులందఱు బాడుకొనన్!
అయోధ్యకాండను బ్రచురించితినీ యలరుచు బ్రస్తుత సమయమునన్
మిగిలిన కాండలనన్నియు బాడగ సాగిలబడి సీతాపతినీ
గోరుచుంటి యాయువు నారోగ్యము గూర్మిభావనాశక్తియునూ!

శ్రీకరమగు శ్రీరాము కథను నే శ్రీలు చిందగను లిఖియింపన్!
పూనుకొంటి నో దేవతలారా పూర్ణమైన కరుణను జూపి!
చిక్కని మక్కువ సురచిర భాషను చక్కని భావము లందించి!
అందుకొనగ నే సనదృశ కీర్తిని యా శ్రీరాముని జేరుకొనన్!

సిద్ధివినాయక! చిత్తము రంజిల శిల్పి వోలె నా మదియందున్!
శ్రీరామాయణ చిత్రమందిరము జేయుచుంటి భక్తిన్ రక్తిన్!
ఒక్కొక్క చరణము నందియిమ్ము నే మక్కువ తోడను నిర్మింతున్!
మధురాక్షరములు మధురభావములు మానసంబు జిందులు ద్రొక్కన్!

కన్నతల్లివని కలల యందునను గాంచుదుకద! భారతి! వాణీ!
అంధకారమును దొలగజేసి న న్నాదరింపు వీణాపాణీ!
హృదయకమలమున నడుగిడి దయతో హృదివెన్నెలను గావించి!
కావ్యకన్యకను గమనీయముగా కాంచన కుసుమము గావింపు!

ముందుగ సుందరకాండను వ్రాసితి మోదములరగా గీతికలన్!
బాలకాండమును బూర్తి జేసితిని ప్రకటించితి గీతికలందున్
అయోధ్యకాండను వ్రాసితినిప్పుడు నలరుచు ప్రకటించుచు నుంటిన్
చిన్నిగీతికల జిలుత బాలురకు తీయని తీయని రాగములన్!

మిగిలిన నాలుగు కాండలగూడను మెత్తని మధురాక్షరములలో
తెలుగు భాషలో వ్రాయబూనితిని తీయగ బాడగ బాలకులున్!
కోరుచుంటి నాయువు నారోగ్యము కూర్మి భావనా శక్తియునూ
సాగిలబడి నే మ్రొక్కుచుంటినీ చక్కని సీతారాములకునూ!

★ ★ ★

# శ్రీ రామ కథా సుధా లహరి

## అయోధ్యకాండము - రెండవ భాగము

### యాబది యైదవ సర్గము

(శ్రీరామ సీతా లక్ష్మణులు భరద్వాజ ముని యనుమతి గైకొని చిత్ర కూటమునకు బోవుట)

శ్రీ శుభకరులగు రామ లక్ష్మణులు శివకరమగు రాత్రిని గడిపీ!
అటు పిమ్మట ఋషి భరద్వాజులకు అభివందనముల గావించీ!
చిత్ర కూటగిరి యందు వసింపగ శీఘ్రము పయనము గావింపన్
మునియు వారలకు స్వస్త్యయనంబును మోదముననను దీవెన లిచ్చెన్! 1

పయనమైన శ్రీరామ లక్ష్మణుల బన్నుగ ప్రీతిని తండ్రి వలెన్!
కొంత దూరమటు సాగనంపగా గూర్మి నడిచె వారల వెంటన్!
మహాతేజుడగు భరద్వాజ ముని మమత మనస్సున బొంగారన్
సత్య పరాక్రముడైన రాముతో సరసముగా నిటులను బలికెన్! 2

రఘుకుల తేజులు రామలక్ష్మణులు రమ్యముగా వినుడీ పలుకుల్
గంగాయమునా సంగమ స్థలమును రంగుగ జేరిన యాపిదపన్!
పశ్చిమ ముఖమున బ్రవహించెడి యా పరమ పుణ్య యమునానదినీ!
అనుసరించి మున్ముందుకు బోవుడు నందమైన ప్రకృతి గనుచున్! 3

శీఘ్రముగా బ్రవహించు యమునను చిత్తము భక్తిని బొంగారన్!
నదీ తీర్థమును సేవింతురు నట నానాపూజల ఋషి మునులన్
తీర్థరాజమును గాంచి మునులచే దీవెనలను బొందిన పిదపన్
తెప్పనొకటి నిర్మించి దాటుడో దివ్యమైన యమునా నదినీ! 4

కాళిందీ నది దాటిన పిమ్మట కనిపించును నట చిత్రముగా!
శ్యామం బనియెడి పేరు గలిగినా విమలమైన న్యగ్రోధంబున్
సిద్ధులచే సేవింప బడినదీ స్థిరమగు భక్తిని సేవించీ!
మంగళప్రదమగు వరముల బొందును మానిని సీతయు నర్చనలన్! 5

ఆ వృక్షము కడ వసింప వచ్చున నట నుండియు ముందుకు బోవన్!
పలాస బదరీ వృక్షంబులతో బలు రకముల డొంకలు, పొదలున్!
సహజ ప్రకృతిని విలసిల్లిన యా చారు రమ్య వన వృక్షములున్
నీలవర్ణమగు గానన మగపడు నింగినంటు శాఖలతోడన్! 6

చిత్రకూటమును జేరు మార్గమది జేరుడు యా దారిని వేగన్!
అందమైనదీ! యతి సుఖకరమును విందుగూర్చు నా ప్రకృతియున్!
ముని పలుకగ శ్రీరామచంద్రుడును మోదముతో అటులే యనుచున్
నమస్కరించుచు నానతి గైకొనె నర్మిలి వినయము బొంగారన్! 7

భరద్వాజముని మఱలిన బిమ్మట మధుర భాష నా సోదరులున్
ముని యాదరమును ప్రేమభావమును ముదముగ ప్రస్తుతి జేయుచునూ!
మనస్వినులు నగు రామలక్ష్మణులు మానసమున బొంగారుచునూ!
సీతతోని కాళిందీ నదిని జేరిరి గాంచిరి ఋషిమునులన్! 8

తీర్థరాజమును భక్తి తోడుతను దివ్య పూజలను గావించి!
అట ఋషి మునులను నర్చన జేసి! యాలోచన నింపుగ జేసి!
ఎదురు గడ్డలను వట్టివ్రేళ్ళతో నింపుగ బంధన గావించి!
తృణ సముదాయము బఱచి దానినొక తెప్పగ జేసిరి త్వరిత గతిన్! 9

అటుపిమ్మట నా వీర్యవంతుడును నా సుమిత్ర తనయుండు నటన్!
పచ్చని రెమ్మల సుఖ మాసనమును బరగజేసె జనకజ కొఱకున్!
దశరథాత్మజుడు రాముడు సీతను దగ తన కర మూతగనిచ్చి!
తెప్పపైకి నెక్కించెను సిగ్గులు దీరుగ నొలుకగ ప్రియతమనూ! 10

సీత దెచ్చినా యాభరణములను చిత్రాంబరముల నొక మూటన్!
చిన్న గునపమును పుటికము నుంచిరి సీత ప్రక్క బహు పదిలముగా
ధీరులైన యా దశరథాత్మజులు దీరుగ తా మధిరోహించి
యత్నపూర్వకముగ నడిపిరి తెప్పను యమునను దాటిరి సుఖలీలన్! 11

నది దాటుచు జనకజ ప్రార్థించెను మది భక్తిని ఓ కాళిందీ!
వందన మిదే! నా భర్త వ్రతంబును తుదము పూర్తియు జేసికొని

మళ్ళీ యయోధ్యకు వచ్చునట్లుగా మానుగ జేయుము నా కోర్కెన్!
వేయిగోవులను సురాఘటంబుల విమలభావమున నర్పింతున్!' 12

ఈ విధి జానకి ప్రార్థన జేయుచు నింపుగ కాళిందీ నదినీ!
తెప్పపైని దేలుచు దక్షిణదిశ జేరెను నాహ్లాదము జిందన్!
ఈ విధముగ శ్రీరామ లక్ష్మణులు నింపుగ వైదేహిని గూడి!
కాళిందిని దాటిరి సుఖకరముగ కమ్మని ప్రకృతి గాంచుచునూ! 13

నదిని దాటి శ్రీరామలక్ష్మణులు రమ్యమైన తీరము వెంటన్!
పయనమ్ము జేసి ప్రకృతి శోభలను బన్నుగ గాంచిరి మదిబొంగన్!
అచట గాంచిరొక వట వృక్షంబును నలరెడి పచ్చని యాకులతో
చల్లని నీడను నిచ్చెడి తల్లిని మెల్లని గాలుల శ్యామంబున్! 14

వట వృక్షంబును జేరి జనకజయు వలనొప్పగ యటు ప్రార్థించెన్!
మహా వృక్షమా! యంజలి గొనుమా! మానుగ నా పతి వ్రతదీక్షన్!
పూర్తి జేసికొనుగాక! యయోధ్యకు బూనిక యేతెంచును గాతన్!
కౌసల్యా దేవిని సుమిత్రనూ గాంచెద గాకను నే మఱలన్!
అనుచు ప్రదక్షిణ మాచరించెనూ యా మఱ్ఱికి వైదేహియునూ! 15

అమృతమూర్తియగు సీతాదేవిని యా మఱ్ఱిని బ్రార్థించుటయున్!
గాంచి రాము డా లక్ష్మణు తోడను కమ్మని బలుకుల నిటు లనియెన్!
లక్ష్మణ! మన మిక పయనింతము వే లలిత జనకజను దీసికొని!
అగ్రభాగమున నడువుము! నేనును నలరి వత్తు నడుచుచు వెనుకన్! 16

భరతానుజ విను! దారిమధ్యమున ధరణీసుత కోరెడి కోర్కెన్!
పత్ర పుష్పముల ఫలముల గోరునో! చిత్రమైన వన వస్తువులన్!
వేగము నిచ్చి బహూకరింపుము వింతయైన యా వస్తువులన్!
గాంచి సంతసము నొందును జనకజ కమ్మని ప్రకృతి వింతలకున్! 17

రామలక్ష్మణుల మధ్య నడచుచును రమణి సీత యటు శోభించెన్!
రెండేనుగులకు మధ్య నడిచెడి మహానాగ వధువును బోలెన్!

చూడని తరువుల పొదలను జానకి సుందరమగు బూ దీవెలనూ!
చూచి రాము బ్రశ్నించుచుండెనూ చోద్యమైన యా వింతలనూ! 18

అడిగిన వెంటనె సీత లక్ష్మణుని యలరెడి పుష్ప సుగుచ్ఛములన్
తెచ్చి యిచ్చి సీతకు సేవకునిగ తీరుగ భక్తి విధేయతలన్!
మెచ్చికోలు బొందుచు దన తల్లిగ అచ్చముగా మది గాంచుచునూ!
తల్లి సుమిత్రాదేవిగ దలచును దరణీసుత నా లక్ష్మణుడున్! 19

జలజల బారెడి యలల తెరలతో గలగల లాడెడి పక్షులతో!
ఇసుక తిన్నెలను గూడిన యమునను నింపుగ గాంచీ ముదమొందెన్!
సోదరులగు నా రామలక్ష్మణులు సొంపుగ క్రోసెడు బయనించీ!
కందమూలముల వన్య ఫలములను విందుగ భుజియించిరి ప్రీతిన్! 20

ఆ యమునా నది తీరమంతయును నలరె మయూర ధ్వనితోడన్!
వానరములు వారణముల తోడను వన్నెలు జిందుచు నుండె నహో!
రామలక్ష్మణులు సీతాదేవియు రమణీయంబగు బ్రకృతినీ
సంచరించుచును రాత్రిని గడుపగ నంచితముగ నిలిచిరి యొకచోన్! 21

(అయోధ్యకాండములోని 55వ సర్గము సమాప్తము)

* * *

## అయోధ్యకాండము - రెండవ భాగము

### యాబది యాఱవ సర్గము

(చిత్రకూటమున పర్ణశాలను నిర్మించుకొనుట)

తూర్పున సంజల మొలకలు మొలవగ దోరముగా రాముడు లేచీ!
నిదురవోయెడి లక్ష్మణు నప్పుడు నిర్మలమతి నిటు మేల్కొలిపెన్!
సౌమిత్రీ నిదురను వే లెమ్మిక సరస వన్య మృగకోటు లదే
చేయసాగె మధుర ధ్వని రవముల చిత్రముగా వన వీథులలోన్! 1

ప్రస్థానమునకు తగిన సమయ మిది పయన మగుద మిక లే లెమ్మా!
అనుచు ప్రబోధము సేయ రాఘవుడు నా లక్ష్మణుడును వే వేగన్
నిదుర విడిచి తా గనులు దుడిచికొని మోదము ముఖమున విలసిల్లన్
అన్నపాదముల స్పృశించి లేచెను నాదర మొప్పగ వినయమునన్! 2

అందఱు వేగము యమునా జలముల చంద మొప్ప స్నానము జేసీ
జపార్చనములను బూర్తి జేసికొని జాలము సేయక వేగమునన్!
భరద్వాజముని చెప్పిన రీతిని చిత్రకూట పర్వతమునకున్
పయనమైరి యా మువ్వురు మూర్తులు బన్నుగ జూచుచు వనవీథిన్! 3

సంప్రస్థితమగు కాలము నందున చారునేత్ర సతి జానకితో!
రామచంద్రు డిటు బలికె ప్రీతితో రమ్య ప్రకృతిని గనుగొనుచున్!
సీతా! కనుగొను కింశుక వృక్షము శిశిరము గడిచిన వే వెంటన్!
ఎఱ్ఱని పూవులతో నిండినదీ ఎఱ్ఱని వలువను గట్టినటుల్! 4

భల్లాతక మదె! కనుగొను మబలా! ఫల పుష్పములను వంగినదీ!
నరు లెవ్వరు సేవింపరు వీనిని నవ్వుచున్నటుల గన్పించున్!
ఇట్టి ప్రకృతిని మనము వసింతము ఎట్టి చింత వంతలు లేకన్!
సుఖజీవితమును గడుపవచ్చు నిట సుందరమగు నీ ప్రకృతిలోన్! 5

లక్ష్మణ! కనుగొను దేనె బట్టులను లావగు దరువుల కొమ్మలనూ!
తొట్టెలవలె వ్రేలాడుచున్నవి తోరణముల వలె వనవీధిన్!
దట్టముగా రాలిన పువ్వులతో ధాత్రి గన్పడదు సౌమిత్రీ!
వానకోయిలల. మయూర ధ్వనులును వరుసగ లక్ష్మణ వినిపించున్! 6

ఉన్నత శిఖరంబుల యీ గిరిపై యురుబల మత్తేభంబులునూ!
గుంపులు గుంపులుగా జరించుచును నింపు గులుకు పక్షుల ధ్వనులున్!
సంతసమును గూర్చును సమభూమియు కాంతి గూర్చు మన కందళచున్!
బహుళ పుష్ప ఫల శోభిత మీ గిరి బహుళ వృక్ష సంశోభితమున్!
ఇట నివసింతము మన మిక లక్ష్మణ! పటు ప్రకృతి యాశీస్సులతోన్! 7

కాలి నడకతో పయనించుచునూ కమ్మని ప్రకృతి దృశ్యములన్!
గాంచుచు సీతారామ లక్ష్మణులు గడు నందము నగు నా గిరికిన్!
మనోహరంబును బుణ్య ప్రదమును మహనీయులు నివసించెడిదియున్
చిత్రకూట పర్వతమును జేరిరి శ్రీ విభవంబుల సమగూర్చున్! 8

ఆ పర్వతమున ననేక జాతుల నతిరు పక్షి సంఘము లుండెన్!
కందమూలములు గమ్మని ఫలములు నందమైన పూవుల పొదలున్!
తీయని యుదకము గలగల పారెడి యేరుల లూగగ సెలయేటుల్!
గాంచి రాము డిటు బలికె ననుజుతో కమ్మని మాటల ముత్యములన్! 9

మనోజ్ఞమగు నీ గిరి విను! లక్ష్మణ! మనోహరంబగు వృక్షములున్!
కంద మూల ఫలములు లభించు నిట నందమైన పూవుల పొదలున్!
మనసున కింపును గూర్చుచున్నదీ మహనీయంబగు ప్రకృతితోన్!
ఇట నివసింపగ వచ్చు ననుచు నే నిమ్ముగ దలతును సౌమిత్రీ! 10

మహాత్ములగు ముని లిచట నుండిరీ మహితాత్ములు నీ గిరిపైనీ!
వాసము జేయుద మిచట లక్ష్మణా! వన్నెలు జిందెడి ప్రకృతిలోన్!
ఈ విధమున మనమున దలంచుచును నింపుగ వారలు వినయమునన్
వాల్మీకాశ్రమ స్థలమును జేరిరి వలనొప్పగ మ్రొక్కిరి ఋషికిన్! 11

ధర్మవేత్తయగు వాల్మీకులు వే దర్శనీయులగు సోదరులన్!
ఆదరమున స్వాగతము నొసంగుచు నాహ్వానించెను దన కుటిలన్!
మహాబాహువగు లక్ష్మణాగ్రజుడు మఱి తన కథనంతయు ఋషికిన్
యథారీతిగా దెలిపి యనుజుతో యథాన్యాయముగ నిటు పలికెన్! 12

లక్ష్మణ! విను మొక పర్ణశాలనూ లలితరీతి నిర్మించుదమూ!
ఎండిన వాసములను సమకూర్పుము! పండిన యాకుల తీవెలనూ!
నివాసమొక్కటి యేర్పరుము సఖ! నిర్మలమగు నీ గిరియందున్
ఏకాంతంబగు ప్రదేశమందున ఎవరులేని విజనము నందున్! 13

రాముని మాటలు విని సౌమిత్రియు రమ్యరీతి వాసంబులతో!
పండిన యాకుల వీవెల తోడను బర్ణశాల నట నిర్మించెన్!
చాపలతో నావరణముజేసీ చక్కటి వసతులు గల్పించెన్!
ఋష్యాశ్రమమును బోలు బర్ణకుటి రూఢిగ నిర్మించెను నచటన్! 14

సావధాన చిత్తముతో నిలిచిన సౌమిత్రిని గని మోదముతో
రామచంద్రు డిటు బలికెను దీయగ రమ్యాక్షరముల వాక్యములన్!
చిరకాలము జీవింపగ గోరెడి శీలవంతులగు వారలకున్!
వాస్తుదేవతను శాంతి జేయవలె వలనొప్పగ కర్తవ్యంబున్! 15

లేడి మాంసమున బూజసేయవలె వడి యొక లేడిని గొనితెమ్మా!
శాస్త్రవిహితమగు వాక్యం బిది గద! శాస్త్రము దప్పగరాదు గదా!
శాస్త్రమె ధర్మము; ధర్మమె శాస్త్రము! సర్వులు బాటింతురు దీనిన్!
నీకు దెలియు నీ శాస్త్రము ధర్మము నెఱవేర్పుము గ ర్తవ్యంబున్! 16

రాముని మాటలు విని లక్ష్మణుడును రయమున జేయగ కార్యమునూ!
మఱల బలికె రాముడు లక్ష్మణుతో మధురాక్షరములు దొలుకాడన్!
'లేడి మాంసమును' నుడికింపుము వే వడి బూజింతము బర్ణకుటిన్!
స్థిరవారము మఱి స్థిరముహూర్తమును సిద్ధము మఱి యీనాడు సుమా! 17

అంతట సౌమిత్రియు దా లేడిని చెంత యగ్నిని జ్వలియించి!
అగ్నియందు బడవేసి మాంసమును నలరుచు బక్వముజేసి మఱిన్!
సిద్ధమాయెనని బలికి యన్నతో శీఘ్రము బూజను సేయగనూ!
తొందరవెట్టెను వాస్తుపూజకై జిందుచు భక్తి ప్రపత్తులనూ! 18

గుణవంతుడు మఱి జప్యకోవిదుడు గులదీపకు డా రాఘవుడున్!
స్నాన సంధ్యలను బూర్తిజేసికొని సరగున సంయమ వంతుండై
వాస్తు పూజ సమయమున జరుపదగు వర మంత్రంబుల బఠియించెన్!
దేవతలకు మఱి పూజలు జేసెను దీక్షతోని బలు లర్పించెన్! 19

పవిత్రుడై శ్రీ రామచంద్రు డట పర్ణశాలలో జేరగనే
అమిత తేజుడగు రాముని మనసున నాహ్లాదము దొణికిస లాడెన్!
విశ్వదేవతలు రుద్రుని విష్ణుని విమలమైన పూజలుజేసి!
వాస్తు శాంతికై జపహోమములను వరుసగ జేసెను నియమములన్! 20

ఆశ్రమమందున నుండతగిన యా యందమైన వేదికను మఱిన్!
చైత్యాంబులు మఱి యగ్ని గృహంబులు స్థిరముగ నిలిపెను నచటచటన్!
లక్ష్మణు డే విధి యాశ్రమంబునూ అతితరీతి సింగారింపన్!
ఋష్యాశ్రమమును బోలె నిలిచెనట ఋషి మునులును మోదమునందన్!

వనమునందు లభియించు ఫలములను వన్నెల పూవుల మాలికలన్!
కందమూలములు బక్వ మాంసములు అందమైన జిగురా కులతోన్!
సెలయేఋల దీయని జలములతో జిఋదర్భల సమిధల కుశలన్!
జప ధాన్యములను భూత తృప్తిని జాగృతి వైదిక మంత్రములన్!
అధ్యయనములను జేసి పర్ణకుటి నలరుచు జేరి ప్రమోదమునన్!
ఆ సీతారాములు లక్ష్మణుడును నఖిల భూతములు ముదమందన్! 22

ప్రకృతిమాత యొడి చంటిబిడ్డ వలె ఫలవృక్షంబుల మధ్యమునన్!
పూదీవెలు జుట్టలముకొన్నదియు బొలుపుగ సుగంధ పూరితమున్!

చిత్రకూటమున వెలిసె పర్ణకుటి సీతారాములు లక్ష్మణుడున్!
అందు ప్రవేశించిరి నివసింపగ ఆనందము భువి పొంగారన్! 23

అనేక నానా మృగ పక్షుల గని ఆనందంబును బొందుచునూ!
విచిత్ర పుష్ప స్తబక ద్రుమములను విమలాహ్లాదము నొందుచునూ!
పక్షుల పలుకులు మృగముల మాటలు ప్రకృతిమాత చల్లని దయతో
చిత్రకూట వనమందు వసించిరి సీతారాములు లక్ష్మణుడున్! 24

గల గల ప్రవహించెడి ధారలతో జలజల పొంగెడి తరగలతో
మందాకిని నదివోలె పరిమళము మధుర పవిత్రత గూర్చునదీ!
మాల్యవతీ నది యట ప్రవహించును మధుర వీచికలు వీచుచునూ!
అట్టి నదీ తీరమున వసించుచు ఆ సీతారాములు మదిలో
పురము విడిచినా దుఃఖము మఱచిరి పొలుపుగ గాంచుచు ప్రకృతినీ! 25

(అయోధ్యా కాండలో ఏబది యాఱవ సర్గము సమాప్తము)

* * *

## అయోధ్యాకాండము - రెండవ భాగము

### యాబది యేడవ సర్గము

[సుమంత్రుడు అయోధ్యకు మరలి వచ్చుట]

గంగనుదాటి రామచంద్రుడట దక్షిణ తీరము జేరగనూ!
గుహుడా సుమంత్రుతో బహు విధముల గూడి స్నేహమున భాషించీ!
దుఃఖముతో దన గృహమున కరిగెను దూరుచు దైవపు కట్టడికిన్!
విధినిర్ణయమును దాటలేమనుచు వేమరు మనసున దలచుచునూ! 1

గుహు డాతని సహచరు లందటునూ గూర్మి తెలిసికొని రటనుండీ!
సీతారాములు లక్ష్మణుండునూ జేరుట మున్యాశ్రమమునకున్
చిత్రకూటమును జేరుట వినిరీ శ్రీకరముగ నట పర్ణకుటిన్!
వాసము జేయుట యంతయు వినిరీ పథికులు చెప్పిన వార్తలచేన్! 2

ఆ సుమంత్రుడును శ్రీరామాజ్ఞను నౌదల దాలిచి వేగముగా
గుఱ్ఱములను రథమునకును గట్టి కుములుచు మనసున దుఃఖముతో
అయోధ్య నగరమునకు నేతెంచెను నదవులు కొండలు దాటుచునూ!
గ్రామములను నగరములను దాటుచు గడు వేగముగా బయనించెన్! 3

మూడవ దినమున సాయంకాలము మోదశూన్యమగు నయోధ్యనూ!
కన్నుల జూచెను సుమంత్రు డంతట కనుల బాష్పములు రాల్చుచునూ!
పాడువడిన యా నగరము గాంచి పటుతర హృదయా వేదనతో
ఇటుల దలచె దన మానసమందున బటుతర వేదన దొలుకాడన్! 4

గజాశ్వ రథములు ప్రజలను గూడుక కడు ప్రతాపులగు రాజులచే!
నిండి యుండెడి నగర మీ గతిని నిర్జనమయ్యెను జోద్యముగా!
రామ విరహమున రమ్య నగర మిటు రాపిడి దుఃఖము శోకముచే
దగ్ధమాయె ననిపించుచున్నదీ తగ యీ రీతిని యుండుటకున్! 5

సుమంత్రు డీ విధి తాలోచించుచు సురుచిరమగు ధన యరదముతో!
నగరములోనికి బ్రవేశించెనూ వగచుచు శిరమును వాల్చుకొనీ!
సుమంత్రు గనుగొని నగర ప్రజాళియు శుభకరు రాముని గనుగొనగా
రథమును చేగము జుట్టు ముట్టిరీ రాము డెచ్చటని యడుగుచునూ! 6

సుమంత్రు డంతట కడు వేదనతో స్రుక్కిన గొంతున నిటువలికెన్!
గంగాతీరము నందు రామునికి గరుణను వీడ్కొలుసు దెలిపీ!
ఆ మహాత్మునీ యాజ్ఞను గైకొని నలరి యిటుల తిరిగొచ్చితినీ!
అటుల సుమంత్రుడు వలుక బ్రజాళియు హతాశులై యిటు లనుకొనిరీ! 7

అయ్యో! యెంతటి కార్యము జరిగెను; హావిధి! యెంతటి క్రూరుడవూ!
రామునితో నెడబాటు జేసితివి రహి మే మెటు జీవింతు మికన్?
దావ యజ్ఞ వైవాహికములనూ ధార్మిక కార్యము లందుననూ
రాముని జూడము ! రాముని జూడము ! రహి మన కెన్నడు గనబడడూ!

ఏది ప్రియము మఱి యెద్ది సుఖంబగు? నీ ప్రజాళికని యరయుచునూ!
తండ్రి వలెను పాలించువాడు మన తండ్రి యనగ వచ్చును రామున్!
అనుచు బలుకు నా ప్రజాళివేదన యార్ద్రతతో నా సుమంత్రుడున్!
వినుచుబోయె స్త్రీ పురుషుల రోదన వీధుల వెంబడి యచటచటన్! 10

ముఖము వాల్చుకొని సుమంత్రు డంతట మోమితరులు గనకుండునటుల్
రాజమార్గమున దశరథు గృహమును రహి జనె వేగము నరదముపై!
అరదము డిగి యా సుమంత్రుడంతట నటు ద్వారంబులు దాటుచునూ!
ఏడవ ద్వారము కడకు వచ్చెనూ వింపుగ రాజును గాంచుటకై! 11

రాముడులేనీ రథమును గాంచీ రహి యంతఃపుర కాంతలునూ!
పెద్దపెట్టునను రోదన జేసిరి ప్రియమగు రాముని దలచుకొనీ!
కంటిధారలను నేలను దడుపుచు గలకల నేలను దొరలుచునూ!
ఒకరి నొకరు మఱి కౌగలించుకొని యోరిమి కోల్పోయిరి వారున్! 12

రామునితో బోయిన సుమంత్రు డిటు రాముడు లేకుండగ వచ్చెన్!
ఏమి చెప్పునో సమాధానమును నే రీతిని కౌసల్యకునూ!

వలదన్నను వని కేగెను రాముడు వని కేగిన పిమ్మట గూడన్!
కౌసల్యాసతి బ్రతికి యున్నదీ కష్టము జీవించుట యటులన్!' 13

రాము శోకమున దశరథ రాణులు రహి బలికెడి యా బలుకులనూ!
మెల్లగ బలికెడి మాటల వినెనూ యల్లన జెవులకు ములుకులుగా!
దశరథు కాంతల బలుకులు వినుచును ధైర్యవంతు డా సుమంత్రుడున్!
శోకముతో జ్వలియించుచున్న యా శోక గృహము లోపల జొచ్చెన్! 14

అష్టము ద్వారమునందు జేరెనూ యా సుమంత్రుడును గష్టముగా!
పుత్ర శోకమున గుందుచున్న యా భూపతి దశరథు గనుగొనియెన్!
సుమంత్రు డంతట రాజును జేరీ సురుచిరముగ వందనములతో!
రాము డంపినా సందేశంబును రహి వినిపించెను శోకముతో! 15

రాము డంపినా సందేశము విని రహి దశరథుడును మౌనముతో
కలత జెంది మఱి మూర్ఛనొందెనూ కటిక నేలపై బడిపోయెన్!
మూర్ఛనందినా రాజును గని యా ముదిత లందఱును నేడ్చుచునూ!
క్షితిపై బడినా రాజు నెత్తిరీ చేతులపై నతి దీనముగా! 16

నేలపడిన యా రాజును గాంచీ నెలత కౌసల్య సుమిత్రయున్
లేవనెత్తి కూర్చొనగ జేసిరీ భావమునందున యతిభక్తిన్!
కౌసల్యాసతి కలత నొందుచును కలకల బాష్పములను రాల్చి
విభునితోని యిటు పలికె వెమ్మదిగ విమలాక్షరముల తోడుతనూ! 17

మహారాజ! భువి నెవ్వరు జేయని మహాకార్యమును జేసిన యా
రాముని దూతగ సుమంత్రు డొచ్చెను రయమున కాననముల నుండీ!
అట్టి దూతతో బలుకవేమి మఱి యాదరింపవుగ ప్రేమ దయన్!
శోకమందు నినుమంత సహాయము జూడరు, చేయరు లోకమునన్! 18

చేయగ రానీ పనిని జేసితివి సిగ్గెందుల కిక మహరాజా!
మాట నిలుపుకొను బుణ్యము దక్కెను మఱి కృతార్థుడవు నైతివిగా!
కైకేయికి మఱి భయపడు చుంటివా! కైకలేదు రాజా! యిచటన్!
రాముని గూరిచి మాటలాడుమా! రమ్య శీలుడగు సుమంత్రుతో! 19

దుఃఖము దోడుత కౌసల్యా సతి దురపిల్లుచు దగ్గుత్తికతో
విభునితోడ నటు బలికి రోదనను వేగ వడెను ధాత్రీ తలమున్!
మూర్ఛను బొందిన భర్తను గాంచీ మోహమునందిన నతిని గనీ!
అంతఃపుర యా కాంత లందఱును వింతగ యేడ్చిరి యెలుగెత్తీ! 20

ఆ యంతఃపుర నిషాద మంతయు నలుముకొనెను దిశలన్నియునూ!
ఆ రోదన విని బాలురు వృద్ధులు నఖిల జనాళియు రోదించెన్!
పట్టణమంతయు వ్యాకుల మయ్యెను బిట్టుగ రోదన ధ్వనితోడన్!
చెట్టుపుట్టలును, మృగములు, పక్షులు గట్టిగ మోములు నెత్తికొనీ! 21

(అయోధ్యాకాండమునందు 57వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము-రెండవ భాగము

## యాబది యెనిమిదవ సర్గము

(దశరథరాజుకు సుమంత్రుడు రామలక్ష్మణుల సందేశమును వినిపించుట)

కొంత సేపటికి రాజు కోలుకొని తూరిమి సంజ్ఞను దా బొందీ!
రాముని వృత్తాంతమును వినుటకై రమ్మనె సూతుని దాపునకున్!
అంత సుమంత్రుడు నంజలితోడను నా రాముని స్మరియించుచునూ!
దుఃఖ శోకముల మునిగియున్న యా శూరుని దాపునకును జనియెన్! 1

మండుచున్న హృదయము గలవాడును మదపుటేనుగువలె నిట్టూర్పుల్
జబ్బువడిన కుంజరమునకును వలె జాలి గలుగజేసెడి వాడున్!
అట్టి రాజు నొద్దకు జని సూతుడు నంతరంగమున దుఃఖముతోన్
వచ్చిన సూతుని జూచి దశరథుడు వలవల యేడ్చుచు నిటు వలికెన్! 2

ధర్మాత్ముడు మన రామచంద్రుడే తరు మూలంబుల నివసించున్?
ఎట శయనించును? ఏమి దినును? మఱి యేరీతిని దినములు గడుపున్?
కష్టములను జవి చూడలేదు గద! కమ్మని సుఖముల దేలె గదా!
కఠిక నేల నెటు ననాథునికి వలె కాఱడవుల శయనించు సఖా? 3

రథ గజ తురగ పదాతి సైన్యములు రహి వెంటను వారులు దీర్పన్!
నడిచెడివాడుగదా! కా ఱడవిని నడుచు నిపుడు దా వొంటరిగా?
సీతారాములు లక్ష్మణు తోడను జేరి రెటుల గా నడవులకున్?
క్రూర మృగములును, గృష్ణ సర్పములు గూడి యుండుగద వనమందున్? 4

సుమంత్ర తెలుపుము! రాజకుమారులు సుందరి సీతను గూడికొనీ!
రథము నుండి దిగి వనవీధులకును రయమున బోయిరి యెటు లెటులన్?
వనముల నందు గాలిడిన కుమారుల వలనొప్పగ కాంచితివి గదా!
అందమైన యశ్వనీ కుమారులు మందరగిరినీ జేరినటుల్!
ధన్యుడ వైతివి నీవు బాల్యసఖ! దగ నదృష్టవంతుడ వీవున్! 5

వనమునకు జేరిన పిమ్మట దెలుపుము వలనొప్పగ శ్రీరాఘవుడున్!
ఏమని బలికెను? లక్ష్మణు డేమనె? యేమని పలికెను మైథిలియున్?
రాముడెచట గూర్చుండె? బరుండెనొ? రాము డేమి భక్షించె నొకో? 6

ఆవిషయములను వినుచుందును నే నతిభక్తిని మది దొలుకాడన్!
సాధు సంగమమునందు యయాతిగ సరసరీతి నే జీవింతున్
రాజిటు ప్రశ్నింపగ నా సూతుడు రమ్య రీతి రాజేంద్రునకున్
గద్గద స్వరమున పలికె నిట్టులను కమనీయంబగు బలుకులతోన్! 7

మహారాజ! రాముడు ధర్మాత్ముడు ధర్మమె రాముడు నిజము సుమా!
అంజలి ఘటించి శిరమును వంచి నలరి పలికె నాతో నిటులన్! 8

మహాత్ముడగు నా తండ్రికి దెలుపుము మది మాలిన్యము లేకుండన్!
శిరసా వందన మాదరించెనని శీలవంత! దెలుపుము ప్రీతిన్
అంతఃపురమున యందఱికిని నా యభివందనములు దెలుపు మికన్
ఎట్టిభేదములు లేక క్షేమమును గట్టిగ కోరుచు నుండెననీ! 9

తల్లియైన కౌసల్యాదేవికి తగు నభివందనముల దెలిపి!
కుశలంబును దా గోరుచుంటినని గూర్మి దెల్పుమని నిటు పలికెన్! 10

"ఏమరిపాటును జెంద వలదనుచు నిక నీ విధమున దా వలికెన్!
తల్లికి నీ విధి దెలుపు మనుచునూ దగ వినయాక్షరములు వెడలన్!' 11

ధర్మ నిరతవై ధర్మకార్యముల దగ నిరతము జేయుచు నుండి
పతికుపచారంబులను సలుపుచును సతి ధర్మము గాపాడుకొనూ!
పట్టపు రాణిని యను గర్వముచే గట్టుదప్పి వర్తింపకుమా!
సవతుల నందఱ సరసముగా గను సద్గుణవతిగా గీర్తింపన్! 12

రాజున కనుకూలముగా చేయుము రమణిని కైకను నయ మొప్పన్!
కుమారుడై నను భరతుని జూడుము గూర్మి రాజుగా నీ వెపుడున్!
రాజుల కర్తమె ప్రధాన విషయము రహి వాంఛింతురు సంపదలన్!
రాజధర్మమును స్మరింపు మెపుడును రమ్య ధర్మముల మరువకుమా! 13

భరతుని కుశలము నడిగినట్లుగా భవ్యాశీర్వచనము దోడన్
ఈరీతిని దా తెలియ జెప్పుమవె నింపుగ మధురాక్షరములతోన్!
తల్లులందఱిని సరిగా జూడుము దగ న్యాయము వర్తింపగనూ!
మనసునందు మాలిన్యము లేకను మాధుర్యము విర జిమ్ముచునూ! 14

యౌవరాజ్యమును బొందిన పిమ్మట యువరాజవు రాజ్యంబునకున్!
తండ్రిగారి యనుమతిని రాజ్యమును దగ బాలింపుము క్షేమముగా!
రాజును నిర్బంధింపకుమా! నీ రమ్య శీలమున యడుగడుగున్!
అతని యాజ్ఞయే నీ యాజ్ఞకు వలె ననుసరించి బాలింపు ధరన్! 15

రాముడిట్లు పలికెను నా తోడుత రహి కన్నీటివి దొలుకుచునూ!
పుత్ర ప్రేమగల తనదు తల్లినీ పూర్ణ స్నేహమున గను మనుచున్!
పలుకుచునే కన్నీటి నొలికెనూ కలత నలత నొందుచు మదిలో!
శ్రీరాముడు దలవాల్చి మౌనమున జింత నొందె తల్లిని దలచీ! 16

లక్ష్మణుండు గోపముతో పలికెను లావుగ నిట్టూర్పులు విడిచీ!
ఏ యపరాధము జేసినాడనుచు నీ రాముల యడవికి బంపెన్?
కైకేయీ శాసనము బలిమిదే కఠిన కార్యమిల జేయబడెన్!
రాజిటు జేసిన పనికై మే మిటు రహి కష్టంబుల గూడితిమీ! 17

ఏ కారణమున రామచంద్రునీ యిలు వెడలగ వని యంపిననూ!
రాజు జేసినా పాప కార్యమిది రహి క్షమింప దగినది కాదూ!
నేను రాజు నను నహంభావమున నీతి మాలినా కార్యమునన్!
కారణమేమియు గనిపింపదు గద! కలచి జూచినను నింతైనన్! 18

బుద్ధిమాంద్యమున జేసినట్టి పని సిద్ధము శాస్త్ర నిరుద్ధమ్మునూ!
రాముని యడవికి బంపుట జగతిని రహి దుఃఖము గలిగించునదీ!
దశరథరాజును దండ్రిగ దలపను ధర్మము తప్పిన వానిగనూ!
ప్రభువైనను మఱి బంధువైననూ భ్రాతయైన యీ రాఘవుడే! 19

సర్వలోక ప్రియుడైన రామునీ సర్వలోక హిత రతుడైనా
అట్టి రామునీ వనికి బంపితివి యనురాగము నెవరికి యుండున్?

ధర్మాత్ముండును ధార్మికుండు నగు దర్శనీయుడగు శ్రీరామున్
వనికి బంపి నీ వందల చేతను వరునగ వగ పగ నందితివి! 20

ప్రజలందఱితో పగ దెచ్చుకొనీ బన్నుగ రాజా! నీ వెటులన్
రాజుగ నుందువు? రమ్యరీతినీ రాజ్యము బాలించెద వెటులన్?
అని వలుకుచు నా లక్ష్మణుం డపుడు నమిత కోపమున నేత్రములన్!
అరుణారుణములు జేసి ముఖంబును నటు నిటు ద్రిప్పెను దీవ్రముగా! 21

సీత మాత్ర మటు దుఃఖితురాలై చింతవంత నిట్టూర్చుచునూ!
మాటలు రాకను మౌన ముద్రచే మతి యతి చంచల మగు వృత్తిన్
పూర్వమెన్నమను గష్టము లెఱుగని పూర్ణ చంద్రముఖి ధరణిసుతా!
కంటి ధారలను నొలికెను నింతియ! కాంత బలుక లే దొక్కటియున్! 22

తిరుగు ముఖముతో ప్రయాణ మగు నను దీరని దృష్టిని బరికించీ!
సీతాసతి రాముని ముఖమును గని చింతను గన్నీటిని రాల్చెన్!
రాముడు గన్నీళ్ళను నంజలితో రహి నను జూచుచు నిలువబడెన్!
రాజు రథము నను జూచుచు సీతయు రహి నచ్చోటనె నిలువబడెన్! 23

(అయోధ్యా కాండమునందు 58వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## యాబది తొమ్మిదవ సర్గము

(శ్రీరామ వియోగమున–జడచేతనముల దురవస్థ-సుమంత్రుడు దెలుపుట–
దశరథుడు విలపించుట)

సూత సుమంత్రుడు జెప్పిన మాటలు సురుచిరముగ విని దశరథుడున్!
మిగిలిన విషయము నంత జెప్పుమనె మిత్రుడు నగు నా సూతునితో!
ఆ మాటలు విని సుమంత్రు డంతట యశ్రుధారలను వ్యాకులతన్!
రాముని సందేశమును దెలిపెనూ రమ్యాక్షర సందోహమునన్! 1

రాజా! దశరథ! నార చీరలను రామలక్ష్మణులు ధరియించి!
జటలు గట్టుకొని గంగను దాటీ యటు ప్రయాగ వైపుకు జనిరీ!
రాముని రక్షించుచును లక్ష్మణుడు రహి ముందుగ తా నడువగనూ!
వారిని గని నే నవశుండనునై వగచుచు నయోధ్య కొచ్చితినీ! 2

రాము దరణ్యమునకును బోవగా రాజా! వెనుకకు మఱలితినీ!
ఉష్ణాశ్రువులను నొలికి యశ్వములు నూపిరి గట్టిగ యొదులుచునూ!
ముందుకు నడుచుట నిరాకరించెను జిందుచు ధూళిని గిట్టలతో!
ఎటులో దుఃఖము నాపుకొనుచు నే పటుతర బగ్గములను బట్టి! 3

అంజలితో నా రాజ పుత్రులకు నలరి నమస్కృతులను జేసీ
రథమునెక్కి నే ప్రయాణ మైతిని రహి దుఃఖంబును నాపుకొనీ!
మఱల బిలుచు నేమో రాముడు నని మదిలో దలచుచు నే నచటన్
గుహునితోడ న్నేమూడు దినము లట గూర్మియుంటి యాశల తోడన్! 4

మహారాజ! నీ రాజ్యము నందున రమ్య వనస్పతులును గూడన్!
రాముని విరహముచే వాడినవీ రహి జెడె శోభలను వీడీ!
నదులలోని నీరము వేడెక్కెను గదులుట మానె దరంగములన్!
వనములు, ఉపవనములును వాడినవి వావిరి కాంతి విహీనములై! 5

ప్రాణులన్నియును గదలక యున్నవి పడియున్నవి నట వ్యాళములున్!
రాముని శోకముచే దీనముగా రమ్యాకృతి మానెను వనిలో!
ఎచట జూచినను శోకము మౌనము నెచట గాంచినను గన్నీరే!
పక్షులు గూడను బలుకుట మానెను బన్నుగ రాముని విరహముచే! 6

మహారాజ! విను బద్మ సరస్సులు మాలిన్యముతో గలుషంబై
పద్మములన్నియు వాడిపోయినవి పత్రములును గనబడవుగదా!
పక్షులు, మీనములును సరస్సునను బడియున్నవి యణగుచు నీటన్!
సరసుల సౌందర్యములు మానె మఱి సరసత మానెను వనవీధిన్! 7

నీట బుట్టు దామరలు కలువలును నేలను బుట్టెడి మల్లియలున్
ఫలపుష్పంబుల వాసన తగ్గెను బన్నుగ రాముని విరహమునన్!
నరశ్రేష్ఠ! విను జనశూన్యములై నర్మిలి యుపవన వీధులునూ
పక్షుల గలకల ధ్వని వినిపింపదు బన్నుగ తుమ్మెద భ్రమోతలునూ! 8

అయోధ్య జేరిన నన్ను జూచి జను లభివందనములు జేయరుగా!
రాముడు లేడని మాటిమాటికిని రహి నిట్టూర్పుల తోడుతనూ!
కన్నీటిని కడవలను నింపుచును గడు వేదనలను శ్రీరామున్
దలచెడి ప్రజలను గాంచి నాదు మది తరిగి పోయినది ప్రయ్యలుగా! 9

రాముడు లేనీ రథమును జూచీ రయమున వేదన జిందుచునూ!
రాజమార్గమున జను లందఱుసూ రహి జెడి చెందిరి శోకమునన్!
ప్రాసాదంబుల నుండి జూచు యా పడతులు రాముని గనలేకన్!
హాహాకారంబులను జేసిరీ యాకాశంబును నంటుకొనన్! 10

ఆర్తనాదమును జేయుచు మగువలు నమలనేత్రముల గన్నీటన్!
అస్పష్టముగా జూచుచు నుండిరి యంధకారమును వ్యాపింపన్;
శత్రులు మిత్రులును దాసీలును సమముగ రాముని విరహమునన్
రోదన జేయుచు నుండిరి చూడగ భేద మేమియును లేకుండన్! 11

సందడిలేనీ మనుజులు కలదీ సంతోషంబును లేనిదియున్,
ఆర్తనాదమున వాడిపోయినది యంతట నిరాశ గూడినదీ!

నిట్టూర్పులతో గూడినదీ మఱి నిరానందమును గూడినదీ!
పుత్రుని బాసిన కౌసల్యకువలె స్ఫూర్తిని బాసిన యయోధ్యయున్
గనబడుచున్నది నాదు గన్నులకు కళలను బాసిన చంద్రునిగా! 12

సూతుని మాటలు విని దశరథుడును శోకముతో డగ్గుత్తికతో
మాటలు రాకను దోట్రుబడుచునూ మఱి దైన్యముతో నిట్లనియెన్!
దుష్టులైన నా బంధుజనులు మఱి దుష్టాలోచన గలవారున్
కైకేయిని ప్రేరేపణ జేయగ కాలు జారితిని విధి వశతన్! 13

వృద్ధులతో నే సంప్రదింపకను పెద్దల యానతి గైకొనకన్!
స్త్రీ మాటలు విని తొందర బాటున చేటున మునిగితి నే నిటులన్!
ఈ విధి జరుగగ విధి నిర్ణయమని యీ విధి నే మది దలచెదనూ!
కులము నంతటిని నశింప జేయగ కూరిమి యీ పని జరిగినదీ! 14

సుమంత్ర! ఉపకారము నే జేసిన శూరుడు రాముని జేర్పు ననున్!
తొందర బెట్టుచు నున్నవి యసువులు జిందగ నున్నవి త్వరలోనన్!
నా యాజ్ఞలు మఱిచెల్లు బాటయిన నా రాముని వే గొనితెమ్మా!
ముహూర్తకాలము జీవింపను సుమ! ముదమున రాముడు లేకుండన్! 15

మహా బాహుడగు రాముడు బోయెను బహు దూరంబని దలచినచో
అరదముపై వే నను గొనిపొమ్మా! నా రాముని దర్శించుటకై
సుందరుడగు నా రామచంద్రునీ చూడనిదే నే బ్రతుకనుగా
సీతారాముల గాంచినప్పుడే జీవింతును నీ ధరపైనీ 16

మణికుండలముల ధరించు వాడును మధుర భాషలును గలవాడున్!
అట్టి రామునీ చూడకున్నచో నిట్టె నేను మరణించెదనూ!
ఇట్టి దీనదశ నున్న నేను నా పట్టి రాము గనకుండనిచో
ఇంతకంటె దుఃఖము నే మున్నది వింతగాదు నే మరణింపన్! 17

హా! రామా! రామానుజ హాహా! హా భూపుత్రీ! తపస్వినీ!
అనాధునికి వలె బోవుచుంటిసీ యా సంగతి తెలియదు మీకున్!
ఈ రీతిని యా దశరథేశ్వరుడు నిమ్మగ శోకమునను మునిగి!
పలుకసాగె నిటు బలవరించుచును బలు విధముల తనలో దానున్! 18

కౌసల్యా విను! శోక సంభ్రమున కలత నలత నే మునిగితినీ!
రామశోకమే వైశాల్యంబును తమణి సీత శోకముగాంచన్!
ఆవలి యొడ్డుకు వ్యాపించినదీ యంతులేనిదీ శోకంబున్!
నిట్టూర్పులు మఱి సుడులు దరగలుగ నిలిచెను శోక సముద్రమునన్! 19

కన్నీళ్ళనియెడి నురుగుల తోడను గదులు చుండె జలములు వేగన్!
కదులుచున్న కరములు మీనంబుల కరణి దోచుచుండెను సఖియా!
ఆక్రందితమగు మహాస్వనములే యంతులేని ధ్వని యని దలతున్!
చిమ్మబడిన కేశములే నాచుగ నిమ్ముగ నే మది దలతు సఖీ! 20

కైకేయీ బడబాగ్నిగ దలతును గారణ మది నా యశ్రువులే!
కడు వేగమునకు గారణమైనది కాంత మాటవిని లొంగుటచే!
కుబ్జవాక్యములు మహాగ్రహములై కుతల మంత కదిలించినవీ!
క్రూరమైన కైకేయి వచనములు గూల్చివేసె నా జీవములన్! 21

శోక సంభ్రమును దాటలేను సఖి శూరుని రాముని గనలేకన్!
అంతులేని యీ కర్మఫలంబును వింతయైన యీ విధివ్రాతన్
సీతారాముల గన్నుల జూడని జీవిత మెందుకు? జీవములన్
వదులుచుంటినీ! ప్రియసఖియా విను! వసుధను నే వదులుచునుంటిన్! 23

రామ లక్ష్మణుల సీతాదేవిని రహి నే జూడక యుండుటనూ!
గొప్ప దురదృష్టంబని నే దలచెద ఘోష వినెడి వా రెవ రిచటన్?
అనుచు బలుకుచును మహాయశుండగు నా దశరథుండును శోకముతో!
మూర్ఛజెంది శయనముపై బడియెను ముదిత లందఱును రోదింపన్! 23

దశరథేశ్వరుడు రాముని కొరకై దగ దీనత్వము స్పందింపన్!
పూర్వము కంటెను నధిక శోకమున భూ విభు డప్పుడు స్పందింపన్!
మూర్ఛిల్లగ గని కౌసల్యా సతి నార్చుచు మాటలు దడబడగా
పతిని గాంచి బహు కలతను బొందీ భర్తృ పాదముల జేరి త్వరన్!

(అయోధ్యా కాండమునందు 59 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## అఱువదియవ సర్గము

(కౌసల్యాదేవి విలపించుట - సుమంత్రుడామెను ఓదార్చుట)

అటుపిమ్మట నా కౌసల్యాసతి చటుల భూత మెదో బట్టినటుల్!
మాటిమాటికిని ధరణిని బొరలుచు మఱల బలికె సారథితోడన్!
నను గొని పొమ్మా! రామలక్ష్మణులు నయముగ యున్నా చోటికిని!
క్షణమాత్రము జీవింపగ జాలను జాగు సేయకుము సుమంత్రుడా! 1

రథమును వే మఱలింపుము! సూతా! రయమున యడవికి గొనిపొమ్మా!
అట్లుగాక గొనిపోవక బోయిన యా యమ క్షయమునకును బోదున్!
అంజలి తోడను నా సుమంత్రుడును నా కౌసల్యను నోదార్చి
తొట్రుబాటుబడు కంఠముతోనన తోరముగా గరుణాక్షరముల్! 2

శోక మోహములు త్యజించు మమ్మా! శూరుడు రాముడు వనవీధిన్!
ఏ కష్టంబులు లేక వసించును నింపుగ ప్రకృతి యొడి యందున్!
ధర్మజ్ఞుడు లక్ష్మణుడు ధీరతను దాపున యుండెను రామునకున్!
పాదసేవ జేయుచును రామునకు పరలోకము దా పొందుటకై! 3

విజనమైన వనమందు సీతయును విమల గృహమునం దుండి నటుల్!
రాముని పైననె మనసును నిలిపి రహియున్నది విశ్వాసముతో!
దీనత్వము నేమాత్రమైననూ కానరాదు జానకి యందున్!
వనవాసము కలవాటు బడినటుల వైదేహియునూ కనిపించున్! 4

నగరోద్యానములందు సీత మఱి నయముగ క్రీడల గడిపినదో!
అట్టి విధమునను నిర్జన వనముల నతివ చరించుచు నున్నదిగా!
చెట్లు దీవెలకు నీరువోయుచును మిట్ట పల్లముల దాటుచునూ!
బాలిక వలె క్రీడించుచున్నదీ భయమన్నది యించుక లేకన్! 5

రాముని పైననె మనసు నిలిపినది రాముని పైనే జీవితమూ!
ఆధారముగా జేసికొన్నదీ యతివ సీత సర్వస్వమునూ!
రాముడు లేనీ యయోధ్యగూడను రమణికి వనముగ కనిపించున్!
రాముడున్నచో వనములు నైతము రమణి కయోధ్యగ కనిపించున్! 6

రమణి సీత వనముల యందున్నను రమ్య కోసలను నున్నటులే!
భావించుచు బ్రశ్నించు రామునీ భరతానుజుడగు లక్ష్మణునీ!
గ్రామములను నగరముల నదుల మఱి కమనీయంబగు వృక్షములన్!
ప్రశ్నించుచు బహు కుతూహలంబుగ బన్నుగ తెలియుచు నున్నదిగా! 7

కైకను గూరిచి యేమో యన్నది కరుణ భావమున జనకజయున్
పలికిన పలుకది జ్ఞప్తిని లేదూ! బహు నెమ్మదిగా వినిపించెన్!
నాలుక చివరకు వచ్చిన పలుకుల నయముగ నాపుచు సుమంత్రుడున్
కౌసల్యకు నానందము గూర్చుచు కమ్మని వచనము లిటు పలికెన్! 8

వనమునందు బయనముచే గానీ వాత వేగమునచే గానీ!
సీత బడలికను బొందలేదు మఱి శ్రీకాంతియు దరుగగ లేదూ!
పద్మ సదృశంబైన కాంతి గల పడతి సీతముఖ కాంతియునూ!
తరుగలేదు! నించుక యైనను మఱి చెరగలేదు కమనీయతయున్! 9

లత్తుక ధరింపకున్నను మఱియును రక్త కాంతులను జిందుచునూ!
రమణి సీత పాదములటులున్నవి రమ్యకాంతులను జిమ్ముచునూ!
అందెల మ్రోతలు ఘల్లు ఘల్లు మని అతివ సీత నడిచెడి వేళన్
ఆడుకొనుచు నున్నది జానకి యని యనిపించుచు నున్నది మాతా! 10

రాముడు రక్షకుడా సీతకు మఱి రహి లక్ష్మణుడును దరి నుండన్
సింహ వ్యాఘ్రముల జూచి భయపడదు జింత నొందదిసుమంతయినా!
వారిని గూరిచి, రాజును గూరిచి వరుసగ మనలను గూరిచియూ
విచారింప బనిలేదు నీ చరిత వేల యుగంబులు ధరనుండున్! 11

రామలక్ష్మణులు సీతాదేవియు రమణీయముగా వనవీథిన్!
మునుల మార్గమును ననుసరించుచును మోదముతో నుండినవారై!
వన్య ఫలములను భుజించుచును మఱి వనవీధుల జరియించుచునూ
తండ్రి ప్రతిజ్ఞను బరిపాలించుచు దగ యుండిరి ప్రీతిని దృప్తిన్! 12

సుయుక్తవాదియు నగు సుమంత్రుడును సురుచిరమగు వాక్యంబులతో!
కౌసల్యను వారించినప్పటికి కడు శోకముతో నా సతియున్!
హా! పుత్రా! హా రాఘవ! రామా! హా రామానుజ! హా సీతా!
అనుచు విలాపముచే నలచుచును నా సతి రోదించుచు నుండెన్! 13

(అయోధ్యకాండలోని ఆఱువది సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## అఱువది యొకటవ సర్గము

### (కౌసల్యాసతి విలపించుట - పతిని నిందించుట)

ధర్మాత్ముడు మఱి దర్శనీయుడును దగ రాముడు వనికిని బోవన్!
కౌసల్యాసతి కడు శోకముతో గలతను దన పతి కిట్లనియెన్ !
దశరథు డెంతయు సత్యవాది యని తగ యౌదార్య సుచరితుడనీ
మూడు లోకముల యుందగ వచ్చును మోదమలర సత్కీర్తియనూ! 1

మూడు లోకముల కీర్తియంతయును మోహనుడగు మన శ్రీరామున్
అడవికి బంపుటచే నశించినది యనుచు నేను భావించెదనూ!
ఎంత కీర్తి నీ కున్ననుగానీ కాంత సీతతో నీ కొమరుడున్
వనవాసము జేయుచు క్లేశములను వరుస నెటుల సహియించెదరూ? 2

సుందరి సుకుమారియునగు జానకి సుఖముల దేలుచు నుండినదీ!
అట్టి తరుణి శీతోష్ణ బాధలను నెట్లు సహించును నడవులలో?
భక్ష్య సూపములు భుజించు జానకి భవ్యాంతఃపురముల యందున్
నివ్వరి ధాన్యము నెట్లు భుజించును అవ్వ! నీ మనసు నెటులొప్పెన్? 3

మంగళకరమగు మధుర గీతములు మగువ సీత వినుచుండెడిదీ!
క్రూర మృగముల భయంకరధ్వని కూర్మి సీత యెటు వినగలదూ?
మహేంద్ర ధ్వజ సంకాశుడు రాముడు మహా బాహువులు గలవాడున్
పరిఘ సమానంబైన బాహువును బన్నుగ తలగడగా జేర్చి
ఎచట నిదుర బోవుచు నున్నాడో! యెట్టి దుర్విధియు సమకూడెన్! 4

పద్మవర్ణ కేశాంతము గలదియును పద్మనిశ్వాసము గలదియునూ !
పుష్కరేక్షణము గల శ్రీరాముని పూర్ణ వదనమును నే గందున్?
శ్రీరాముని నే జూడకున్ననూ చిదుపలు గాదుగ నాదు హృదీ!
వజ్ర సారమున జేసినట్టిదీ యొనరగ సందేహము లేదూ! 5

కరుణారహితుడవై కుమారులను గడు దూరముగా నంపితివి!
కృపణులుగా వని దిరుగుచుండినను క్రూర కర్మమని దలపవుగా!
రాజ్యకోశముల భరతు డిచ్చునని రహి నే నూహింపగ లేనూ!
పంచాదశ వర్షమున రాముడును నంచితముగ దిరి గొచ్చిననూ! 6

శ్రాద్ధమందు కొందఱు దమ బంధుల శ్రద్ధగ పరిదృప్తుల జేసీ!
తదుపరి ద్విజులకు బోజన క్రియలను దగ జేతురు బరితృప్తులుగన్!
ఆ విధముగ యాహూతులైన యా యమృతతుల్యులగు బ్రాహ్మణులున్!
అంటరు ముట్టరు నా బోజనముల యమృతంబు లొడ్డించిననూ! 7

ముందు భుజింపగ బ్రాహ్మణులైనను ముదము బొంద రాహూతులునూ!
బుద్ధిమంతులగు ద్విజులు భుజింపరు బొసగ దలతు రవమానముగన్
శృంగభేదమును వృషభ మదెట్టు లనంగీకారము దెలిసెడినో!
అటులే యితరులు భుజింప తదుపరి యాద్విజులును భుజియింపరుగా! 8

ప్రభూ వినుము! శ్రేష్ఠుండు జ్యేష్ఠుడును భ్రాతయు దనదు కనీయసుడున్!
అనుభవించినా ధాత్రిని యావిధి యనుభవింపకుండును గాదా?
ఇతర మృగంబులు ముట్టిన మాంసము నింపుగ తిన దా బెబ్బులియున్!
అటులే రాముడు నిరాకరించును నా భరతుని రాజరికమునూ! 9

హవిస్సు నాజ్యము బురోడాశములు నా యూపస్తంభము గుశలున్!
మఱల యజ్ఞమున నుపయోగింపరు మహనీయులునగు బుత్విజులున్!
అట్లే రాముడు భరతుని రాజ్యము నభిలషింపడుగ చేకొనగన్!
సార విహీనంబైన సురకువలె సౌమ్యత లేనీ మైత్రివలెన్! 10

అభిమానముగల రామచంద్రు డీ యవమానము భరియింపడుగా!
కోపించిన మందర పర్వతమును గూలద్రోయు జీల్చును వింటిన్!
తండ్రివనుచు నిను బితృ భక్తినీ! దగ రాముడు జూచుచునుండెన్!
చంద్ర సూర్య గ్రహముఱతో నిండిన యింద్రదలోకమును భేదించున్; 11

నీ మాటను జవదాటుటలేదూ నీతిమంతుడగు రాముండున్!
వందలకొలదీ శైలంబులతో వ్యాప్తమైన భూమండలమున్!

ప్రక్షోభింపగ జేయగలడు నూ ప్రళయంబును జేయగ జాలున్!
తండ్రిమాట బాపించువాడు గద! దగ శ్రీరాముడు నీ యాజ్ఞన్! 12

తోక బట్టుకొన వ్యాఘ్రము పైపడు దూరము జేయును బాణములన్!
అట్లే రాముడు సహింవ డింతయు యవమానంబును సహింపుచున్!
లోకము లన్నియు గలిసి వచ్చినను వికలత జెందడు రాముండున్!
ధర్మవిముఖమగు లోకమునందున ధర్మంబును దా నిలబెట్టున్! 13

మహా వీర్యుడును, మహా భుజుండును మన రాముడు దన బాణములన్!
సకల భూతముల బ్రళయము జేయును సముద్రముల గాల్చును వేగన్!
సింహబలుడు వృషభాక్షుడు రాముని జింత లేక మత్స్యము రీతిన్!
తండ్రివైన నీ వే యిటు స్వయముగ దగ నశింప జేసితివి గదా! 14

ధర్మనిరతుడగు బుత్రుని రాముని దరలనంపితివి కాననలకున్!
శాస్త్ర బోధితంబగు నీతిఃయ యిది? సనాతమంబగు ధర్మంబా?
స్త్రీకి మొదటిగతి భర్త, రెండవది స్థిరముగకన్న కుమారుండున్!
మూడవగతి మఱి జ్ఞాతు లయ్యెదరు నడకువ నాల్గవ గతిలేదూ! 15

మొదటి గతివి నీవును లేనట్లే; పిదప రాముడును వనిజేరెన్!
అడవికి నే బోజాలక పోతిని యైతిని గతిలేని దానన్!
రాష్ట్రంబును రాజ్యంబును నీచే రహి నశింపబడినవి రాజా!
మంత్రుల నశింపజేసితి వింకను మానుగ బ్రజాళి నంతటినీ! 16

నిన్ను నీవె స్వయముగ నాశంబును బన్నుగ యొనర్చి కొంటివికన్!
నన్ను నాకొమరు రామచంద్రునీ నశింప జేసితివీ గాదా!
నీదు కుమారుడు భరతుండును మఱి నీదు భార్యయగు కైకేయీ!
ఆనందముతో నున్నవారు సుమ! యందఱ దుఃఖమునను ముంచీ! 18

దారుణ శబ్దములను గూడిన యా ధర్మపత్ని వాక్యముల వినీ!
దుఃఖముచే బహు గలత నందుచును దురపిల్లుచు నా దశరథుడున్!
మూర్ఛనందుచును దెప్పరిల్లుచును స్మరించుచును జేసిన దప్పున్!
శోకసంద్రమున మునుగుచు దేలుచు శోచనీయమగు దశనుండెన్!

అయోధ్యాకాండ యందలి 61వ సర్గము సమాప్తము

# అయోధ్యాకాండము – రెండవ భాగము

## ఆఱువది రెండవ సర్గము

(దశరథ మహారాజు కౌసల్యను చేతులుమోడ్చి ఊరడించుట-
కౌసల్య భర్త పాదములపైబడి క్షమింప వేడుట)

శోక వేగమున కౌసల్యాసతి వికల పరుష వాక్యములు వినీ!
దశరథుడంతట దుఃఖించుచునూ దగ యాలోచించెను మదిలో!
ఆ రీతిని యోచించి దశరథుడు యవశతచే మూర్ఛను జెందీ!
చాలసేపటికి తేరుకొనియె మఱి వ్రాలిన నేత్రములను దెఱచీ! 1

మూర్ఛదేరి జూచెను కౌసల్యను ముదితను శ్రీరాముని మాతన్!
మఱల రాజు జింతాకులుడయ్యెను మనసు వ్యాకులత నొందంగన్!
దశరథుడా విధి యాలోచింపగ తగ పూర్వము నజ్ఞానముచేన్
శబ్దవేధిచే జంపిన మునికథ చయ్యన మది జ్ఞప్తికి వచ్చెన్! 2

తను జేసిన యా పాపకర్మమును దగ శోకంబును జిందగనూ!
రాము శోకమున గందుచు రాజును రహి పరితాపము జెందుచునూ!
వణికి బోవుచును దశరథేశ్వరుడు వంచి ముఖంబును దన సతినీ!
అంజలితో గౌసల్యను జూచుచు నదలుచు గరుణాక్షరములతోన్! 3

కౌసల్యా విను! నా వాక్యములను గరుణ రసాంజలి వట్టితినీ!
అందఱియెడ బ్రేమను గనబఱచెదు నలరి నన్ను బ్రేమను గనుమా!
ఎన్నడు గఠినముగా వర్తింపవు నెన్నడు బలుకవు బరుషములన్!
నన్ను బ్రేమతో మన్నింతువుగద! నన్నుతింతు వెప్పుడు నన్నున్! 4

ధర్మదృష్టిగల స్త్రీలకు దైవము దగ పతియే గద కౌసల్యా!
గుణుడైనను మఱి యవగుణుడైనను గూరిమి దైవముగా దలచున్!
ధర్మములన్నియు దెలిసిన దానవు దఱచిన దానవు శాస్త్రములన్!
మంచిచెడ్డలును, పెద్దచిన్నలను, నంచిత భావము లన్నియునూ! 5

ఎంత దుఃఖమున నున్నను గూడను కాంత! నన్ను నిందింపకుమా!
నిండిన వేదన నున్న నన్నిటుల రెండుగ జీల్పకు మాటలతోన్!

కఠినములగు వాక్యములు బలికినను గలత నలత బొందింపకుమా!
చేసిన తప్పును మఱల బలికి నను జింత వంతలను ముంపకుమా! 6
దీనుడైన దశరథువాక్యము విని దీనవదన కౌసల్యయునూ!
నవమేఘము వర్షించినట్లుగా నాతి యొలికె దుఃఖాశ్రువులన్!
ఏడ్చుచున్నదై కౌసల్యాసతి నెలమి దశరథుని యంజలినీ
పద్మము వలె తన శిరమందుంచుక తగ వల్కెను కరుణాక్షరముల్! 7
ధరణీతలమున బడి వందనములు దగ జేయుచునుంటిని నాథా!
నను ప్రార్థించుటచే నే నిజముగ విను! మృత్యువు నే నందితినీ!
క్షమింపరానీ యపరాధంబును సరగున జేసితి క్షమింపుమా!
అనుచు బలుకుచును కౌసల్యాసతి యంజలితో నిటులను పలికెన్! 8
ధీమంతుడును శ్లాఘనీయుడును ధీరుడైన తన పతిచేతన్!
ప్రతిమాలింపక జేయునట్టి సతి బన్నుగ యిహపర లోకములన్!
చెడును గదా! మఱి ధర్మము లన్నియు దెలియును; మఱి తెలియును నీవున్
సత్యసంధుడవు! ధర్మవిదుడవని సర్వము దెలియును మహరాజా! 9
పుత్రశోకమున గుందుచు నే నతి కుటిల వాక్యముల బలికితినీ!
ఏమేమో వచనముల బలికితిని యెంచి చూడకుము ధరణీశా!
శోకము ధైర్యము నశింప జేయును; శోకము శాస్త్రజ్ఞానంబున్!
శోకము సర్వము నశింపజేయును శోకసమము శత్రువులేదూ! 10
శత్రు హస్తమున కొట్టిన దెబ్బను సహింపవచ్చును యోరిమితో!
ఎట్టి చిన్ని శోకంబునైననూ కష్టము సహింపరా దెపుడున్!
ధర్మ విదులు, శాస్త్రజ్ఞులు సహితము దగ ఋషిమునులును సహితంబున్
శోకముచే మోహమును బొందెదరు శూరులు సహితము ధరణీశా! 11
ఈ విధముగ కౌసల్య శుభంబును నింపుగ బలుకుచు నుండగనూ!
సూర్యకిరణములు మందము లాయెను నూఱిగ చీకటి వ్యాపించెన్!
ఈ విధముగ కౌసల్యాసతిచే యనునయింపబడి దశరథుడున్!
శోకము నందున మునుగుచు దేలుచు శుభమగు నిద్రకు వశుడాయెన్! 12
ఐదు దినము లాయెను రాముడు జని యడవులకును మఱి నీ యాజ్ఞన్!
పంచవర్షముల వలె నా కున్నది పన్నుగ పరితాపము జేతన్!
నదీ జలములను వృద్ధి బొందినటు నయముగ సాగర జలము లటుల్!
రాముని మనసున దలచిన కొలదిని రహి శోకము నుప్పొంగెడిసీ! 13

(అయోధ్యా కాండములోని 62వ సర్గము సమాప్తము)

# అయోధ్యాకాండము — రెండవ భాగము

## అఱువది మూడవ సర్గము

### (దశరథుడు కౌసల్యకు మునికుమారుని చంపిన వృత్తాంతమును వినిపించుట)

అటుపిమ్మట నా దశరథేశ్వరుడు నా మోహమునను దేరుకొనీ
చింతించుచు యోచింపగ సాగెను జిరకాలపు విషయంబులనూ!
రామలక్ష్మణుల నడవికి బంపుట భ్రమలో జిక్కుచు దశరథుడున్!
రాహువు గప్పిన రవిబింబము వలె రమ్యత నంతయు గోల్పోయెన్! 1

రాముడు గానకు బోయిన పిమ్మట రహి దా జేసిన దుష్కృతముల్!
జ్ఞప్తికి రాగా గౌసల్యకు దా జెప్పగ దొడగెను వివరించీ!
రాముడు వెళ్ళిన యాఱవ రోజున రాత్రియందు రెండవ ఝామున్
చేసిన పాపము మనసున మెదిలెను చిరకాలపు వ్రణ బాధవలెన్! 2

పుత్రశోకమున బీడితుడగు నా పురుషోత్తముడగు దశరథుడున్!
పుత్రశోకయగు గౌసల్యకు దా బూనిక దోడను నిటులనియెన్!
కల్యాణీ విను! శుభాశుభములను గడగి నరుడు జేయుచును-డున్!
ఎట్టి కర్మలను జేయుచుండునో అట్టి ఫలములను దాబొందున్! 3

మంచి చెడ్డలను దెలిసి జేయవలె నంచితముగ ప్రారంభమునన్!
ఫలదోషములను మదిని గ్రహింపడొ బన్నుగ మూఢుం డనబడునూ!
అందమైన మోదుగు బూవులగని చందమైన మామిడి చెట్టున్
నఱికివేసి మఱి ఫలితము గాంచీ బన్నుగ దుఃఖించును బిదపన్! 4

ఫలవిషయంబున యోచన సేయక బరుగులెత్తు గర్మల వెంటన్
కింశుక వృక్షము బెంచినట్లుగా గీడు దలచి మది దుఃఖించున్!
మామిడి తోటను నఱిక వేసితిని మఱి మోదుగులను బెంచితినీ!
ఫలాగమంబున రాము వని బంపి విలాపమును జేయుచు నుంటిన్! 5

శబ్దవేధి రణధీరుడవంచు భువి జనులందఱు నను గీర్తింపన్!
కౌమారుడనై యుండగ జేసితి కాంతా! నేనీ దుష్కృతినీ!
తెలియక విషమును దినిన బాలకుడు విలయము బొందిన యట్టులనే
స్వయంకృతంబగు నపరాధముచే సరగున యీ వేదన వచ్చెన్! 6

పలాశ వృక్షము జూచి మెచ్చుచును ఫలము జూచి చింతను బొందున్!
నరునిరీతి నే శబ్దవేధి ఫల మరయక పోతిని మూఢుడనై!
కౌసల్యా! నాటికి వివాహమును గదగి జేసికొనలేదు సుమా!
మది నుత్సాహము బెంచునట్టిదీ మఱి వర్షాకాలము వచ్చెన్ 7

ధాత్రి రసములను నన్ని గ్రహించీ ధరణిని వేడిని కుమిలించీ!
భానుడు దక్షిణ వీధికి వెడలెను భన్య మేఘముల సృజియించీ!
ఉష్ణము జగతిని జల్లారినదీ యుఱుములు మెఱుపులతో గూడి!
నీలిమేఘములు గగన భాగమున నిగనిగ లాడుచు బరువెత్తెన్! 8

సృష్టి యంతయును జల్లదనముచే గష్టమంత తొలగిన యట్టుల్
చక్రవాకములు మయూరంబులును వక్రముగా బరుగులు దీపెన్! 9

తడిసిన రెక్కల పైభాగములను దడిచి స్నానమును జేసినటుల్
రివ్వున ఱక్కులు సవ్వడి జేయుచు బువ్వుల వలె గన్పించుచునూ!
గాలికి మఱి వర్షమునకు గదిలెడి తూలు దరులపై కెగయుచునూ!
వ్రాలుచు నెగురుచు నగ్రభాగముల దూలుచు నుయ్యేల లూగుచునూ! 10

కురిసిన జలమును, గుంభవృష్టిగా గురిసెడి జలమును సంభ్రమముగా
అచటి పర్వతము దోయరాశిగా నగుపించెను నా గన్నులకున్!
వర్షధార లలి నిర్మలమైనను గిరిధాతువులను గూడికొనీ!
పాండు రారుణములగు వర్ణంబుల బ్రవహించెను గిరి స్రోతస్సుల్! 11

గిరివాగులు స్వచ్ఛంబు లైననూ వర్ష తోయముల గలియుచునూ!
అరుణకాంతులను జిమ్ముచు ధరగల యలరి దారి దప్పుచు నుండెన్!
అందమైన యా వర్షకాలమున యాట వేటకై యాసక్తిన్!
రథమునెక్కి నే బయలు దేరితిని రహి సరయూనది యొడ్డునకున్! 12

ఆ ప్రదేశమున నజితేంద్రియునిగ నలరుచు దోచిన విధముననూ!
రాత్రి సమయమున నీరు ద్రావుటకు రహి వచ్చెడి వన మృగములనూ!
మహిషముగానీ, గజమునుగానీ మఱి యే మృగ వ్యాళమునైనన్!
చంపదలచి యేకాంతదేశమున నింపుగ ధనుస్సుతో నుంటిన్! 13

నదీ తీరమున బొంచి యుంటి నే నాదము విని సత్వరిత గతిన్!
వన్య మృగము నొక క్రూర మృగంబును వరుసగ జంపితి బాణములన్!
అటు పిమ్మట నా యర్ధరాత్రమున యంతులేని చీకటి యందున్!
ఏనుగు ఘీంకారమువలె శబ్దము వినవచ్చెను నా వీనులకున్!
నీరు నింపబడు గుంభమనుచు నే నేరగ నైతిని యజ్ఞతచేన్ 14

అంతట గజమును గొట్టదలచి నే చెంతనున్న నా శరరములచే
శబ్దధ్వని గుఱిచూచి వదిలితిని శబ్దవేధి లక్ష్యము తోడన్!
సర్పంబును బోలెడి బాణంబును సరగున వదలగ వెన్వెంటన్!
'అయ్యో' అయ్యో! యను నార్తధ్వని సస్పష్టంబుగ నే వింటిన్! 15

బాణము దగులగ బరువుగ వినబడె బాధను దపియించెడి వలుకుల్!
తపసు జేయు నాపై యెవరేసిరొ తామసమున యీ శస్త్రమునూ!
రాత్రివేళ యీ నిర్జన నదికిని రహి జలములకై వచ్చితినీ!
ఎవరుగొట్టితో బాణముతో నను నెవరికి జేసితి నపకృతినీ? 16

హింసను విడి నే వన్యవస్తువుల నింపుగ గడుపుచు నుంటినిగా!
ఆయుధమున మరణము విధించుటకు నసలు కారణం బేమగునో
జటాభారమును నారచీరలను జారుగంధ ఫల మూలములన్!
జీవించెడు నను జంపగ దలచిన స్థిర సంకల్పుడు నెవ్వడొకో! 17

ఆత డెవ్వడో కాని వ్యర్థమగు ననర్థ కార్యము జేసెనుగా!
లోకు లెవ్వరును మెచ్చుకొనరుగా లోక మెంచు గురు ద్రోహముగా!
నా మరణంబున నే జింతింపను నన్ను గన్న తలిదండ్రులకై
జింత నొందుచుంటిని వారల నే జిరకాలము బోషించితినీ! 18

అంధులైన నా తల్లిదండ్రులను నతి వృద్ధులు నగు నే వారిన్!
చిరకాలము బోషించుచుంటినీ జేరి సర్వమును ద్యజియించి!
ముష్వరమును మే మొకే బాణమున రివ్వున జంపగ బడితిమి హా!
మనో నిగ్రహము లేని మూఢు డిటు మానుగ జేసెను ననర్థమున్! 19

కరుణ వాక్యములు విని నా మనసున గలత తోని వ్యథ జెందుచునూ!
కరమునందుగల శర చాపంబులు జారి బడెను వసుధాస్థలిపై!
వినిపించెడి యాముని విలాపములు వేదన జెందెను హృదయంబున్!
సంభ్రాంతంబగు జిత్తము దోడుత చైతన్యము నే గోల్పోతిన్! 20

దీనత్వముచే దరిగిపోయి నే దిశలను జూచుచు నుంటి నటన్!
కొంత సేపటికి దెప్పరిల్లి నే చెంత జేరితిని మునిసుతునీ! 21

బాణముజేతను గొట్టబడిన యా భవ్య దపస్విని గనుగొంటిన్!
నేలపైని తొరలాడుచు జేసెడి విలాపముల నన్నియు నింటిన్!
పాంసు పరాగములను నిండిన యా పవిత్రమూర్తిని గనుగొంటిన్!
జటాభారమది బెదిరియుండె మఱి జాగృతి గోల్పోవుచు నుండెన్! 22

భయబడుచును మఱి భవ్యతేజమున భారమైన చూపుల చేతన్!
గాల్చివేయునటు జూచుచు నను గని కటువాక్యంబుల నిటు లనియెన్
రాజా! నే నా తలిదండ్రులకై రహి నీరము గొను సమయమునన్!
గొట్టితివే! మఱి యే యపకారము నిట్టెజేసితిని తెలుపుమయా ? 23

ఒక్క బాణమున నన్ను గొట్టితివి! వరుసను నా తలి దండ్రులనూ!
అంధులు మఱి యను గ్రుడ్డి వారలును అందును నశక్తు లగు వారిన్!
ముష్వర శరమున గొట్టినావు గద మోదమునందుము నిక మీదన్!
శరలాఘవమును జూపించితివీ శబ్దవేధి లక్ష్యము దోడన్! 24

దుర్బలు లంధులు నా దలిదండ్రులు దురపిల్లుచు నుందురు నాకై!
జలము దెత్తునను నాశను గూడి! గలత నొందుదురు దప్పికతో!
నే నీ విధముగ నేల బడినటుల నిజము దెలియదుగ జనకునికిన్!
తపస్సునకు శాస్త్రజ్ఞానమునకు దగిన పొత్తు లేదని దలతున్! 25

ఈ విషయము దెలిసినను జనకునికి నేమి జేయగల డాతండున్!
దుర్బలుండు మఱి నడువగ జాలడు దుఃఖాశ్రువులను నొలుకు మఱిన్!
ప్రక్కనున్న వృక్షమును నఱుకు దఱి ప్రక్కనున్న వేఱొక దరువున్
దాని నెటుల రక్షింపజాలదో తగ నాతం దట్లే యుండున్! 26

తండ్రి కోపమది జ్వలింప కుండనె దగజేయుము నా జనకునికిన్!
విషయమంతయును వివరింపుము వే వినయముతో నతి నమ్రతతోన్!
రాజా! సౌమ్మి కాలిబాటనూ రహి బోదువు మాపర్ణకుటిన్!
నా జనకుని బ్రతిమాలికొనుము! మఱి నయముగ శాపంబును గొనవూ! 27

బాణ శల్యమును నూడ బెఱకుమా! పటుతర బాధయు శాంతింపన్!
వజ్రతుల్య స్పర్శలతో బ్రాణము లొనరగ యార్చుచు నున్నదిగా!
బాణశల్య ముండిన వఱకును నా ప్రాణములుండును నా మేనన్!
నూటబెఱికి నను ముక్తుని జేయుము జాడ దెలుపు నా జనకునికిన్! 28

కౌసల్యా విను! అట్టి సమయమున గలత నొందితిని తీవ్రముగా!
శల్యము దీసిన బ్రాణము బోవును శల్యము దీయక యుండినచో!
ప్రాణముబోవక బాధను బొందుదు బటుతర వేదన గూడికొని!
అట్టి చింతతో సతమతమైతిని యంతులేని హృది స్పందనలన్! 29

దీనత్వంబున నున్న నన్ను గని ధీర మనస్కుడు మునిసతుడున్!
నా మనసున దొరలెడి భావముగని నర్మిలి ప్రేమను గ్రహించెన్!
అవయవములు మెలికలు దిరుగగనూ! నతి బాధను దా బొందుచునూ!
దొరలుచు నేలను మరణోన్ముఖుడై దోతముగా నిటులను పలికెన్! 30

ధైర్యముచే శోకమును నణచి నే స్థిరచిత్తుండను నగుచుంటిన్!
బ్రహ్మ హత్య పాపము జేసితినని బహుభీతిని మది బొందకుమా!
నే బ్రాహ్మణుడను గాను సుమా విను! నీరసింపకుము వసుధేశా!
వైశ్యునకును మఱి శూద్ర స్త్రీకిని యొనరగ నే జన్మించితిని! 31

అటుల బలికి యా ముని కుమారుడును నలసట జెందుచు శరీరమున్!
ముడుచు కొనుచు మఱి దొరలిపోవుచును మోము నెత్తి పై జూచుచునూ!
చైతన్యము గోల్పోవుచు నుండెను వెత జెందుటయును క్షీణించెన్
బాణంబును నే లాగివేసితిని బన్నగ నా ముని కొమరుండున్!
కనులనెత్తి నావైపు జూచుచును గరుణతోని ప్రాణము లొదిలెన్! 32

కౌసల్యా! విను! మునికుమారునకు గడు తీవ్రమునగు బాణమునన్!
గలిగిన గాయముచే దపించి వే గడునిట్టూర్పులు విడుచుచునూ!
సరయూనది నీటిని దడిసిన యా సాధుపురుషునీ గనుగొనుచున్!
మదిలో దుఃఖము బొంగిపొరలెనూ మానుగ గిరి ప్రోతస్సువలెన్! 33

(అయోధ్యకాండములోని 63వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము-రెండవ భాగము

## అఱువది నాల్గవ సర్గము

(దశరథుడు మునిశాప వృత్తాంతమును కౌసల్యకు వినిపించుట — దశరథుని అస్తమయము)

ధర్మాత్ముడు నా దశరథేశ్వరుడు దగ విలపించుచు దనసతికి!
సాటిలేని యా ముని కుమారు గథ సాంగముగా నిటు వినిపించెన్!
అజ్ఞానముచే చేసిన పాపము నాకులమయ్యెను నింద్రియముల్
చేసిన బాపము దీరుబెట్టు అని జింతించితి నే మదియందున్!

అంతట నే నా ఘటము నిండుగా నతి బవిత్రమగు నీరములన్!
మునిబుత్రుడు దెలిపిన మార్గమునను మున్యాశ్రమమును జేరితినీ!
అచట జూచితిని దుర్బలు లంధుల నతివృద్ధులు నగు దంపతులన్!
ముని కుమారునీ తల్లిదండ్రులను ముదుసలులను బహు నశక్తులన్! 2

ఱెక్కలు విరిగిన పక్షుల వలెనూ పిక్కటిల్లు వారల గంటిన్!
తమ కుమారునీ తలచుకొనుచునూ తల్లడిల్లు వారల గంటిన్!
ఏ పరిశ్రమయు లేనివారినీ యే యాశలు గలుగని వారిన్!
మత్కృత యపరాధమున కుమారుని సత్కృతులను గోల్పోయిన వారిన్! 3

అనాథులకు వలె నున్నవారినీ యాత్మ సంయమము గలవారిన్
ఉత్సాహము మది లేని వారినీ యున్నతమగు గుణములవారిన్!
ముని కుమారునీ తల్లిదండ్రులను మున్యాశ్రమమును నే గంటిన్
శోకముజేతను దల్లడిల్లితిని వ్యాకులమైనా హృదయముతో! 4

అదివఱకే నే జేసిన బాపము నతలకుతలమును జేయంగన్!
ఏమి జరుగునో యని భావించుచు నింపగు నాశ్రమమును జేరన్!
ముదుసలులను దుర్బలుల జూడగనె మోరనెత్తి దుఃఖించితినీ!
ఎంత బాపమును జేసితినా యని శాంతిలేక దుఃఖించితినీ! 5

మత్పద శబ్దము విని యా మౌనియు మదిలో మమతలు బెల్లుబకన్!
పుత్రా! యెందుల కీ యాలస్యము బూర్ణ కలశమును నిటుదెమ్మా!
దప్పికతో మేమున్న వారలము దరిజేరుము! వే మా కడకున్!
నీ తల్లియు నుత్కంఠితమైనది నీ వాలస్యము సేయంగన్! 6

తల్లిచేత లేదా నా జేతను దగ యపరాధము గలిగినచో
క్షమింపుమయ్యా! వేడుచుంటిసీ శాంతిగొనుము నీ మదియందున్!
తపసివి గద! సద్గుణవంతుడవును దరుగని భక్తియు గలదుగదా!
మా యపరాధము మనసున దలపకు! మనసున జింతను రేపకుమా! 7

ఆగతులమగు ముదుసలులకు నీవే యరసిజూచెడి గతివిగదా!
కనులులేని యీ యంధజీవులకు గనులును నీవే గద పుత్రా!
ప్రాణములును నీపై యాధారము బడియున్నవి నిశ్చయము సుమా!
ఎందువలన మాటాడకుంటివో యేమి కారణము దెలియదుగా! 8

అంతట నే ముని జూచి భయపడుచు యడలుచు నస్పష్టము గాగన్!
కలిసిపోయినా మాటలతోడను గలతను నీ విధి బలికితినీ!
మనసు నంతటిని గూడకట్టుకొని మనో బలంబును గూర్చుకొని
వృద్ధుడైన యా మునీశ్వరునకును శ్రద్ధను గరుణాక్షరములతోన్! 9

సజ్జన సంఘము నిందించెడి యొక దుర్జన కర్మము జేసితినీ!
చేతులార నే దెచ్చుకుంటిసీ చేటును దుఃఖము మునిచంద్రా!
ఇక్ష్వాకుండను దశరథరాజును యీ ధరిత్రి నేలెడి వాడన్
ఓ మహాత్మ! నీ సుతుడను గాను యోసరిలితి దురదృష్టముచే! 10

భగవంతుడ; నే విల్లంబులతో బన్నుగ సరయూ యొడ్డునకున్
వచ్చితి వేగము గ్రూర మృగములను వధియింపగ నే మది వేడ్కన్!
అంతట నే నట వింటిని మునివర! చెంత జలములను నింపుచునూ!
కుంభధ్వని విని గజమనుచును నే గొట్టితి శరమున భ్రమచేతన్! 11

అంతట నేనటు జని గాంచితినీ యవని బడిన యొక ముని సుతునీ!
శరము దగిలి ప్రాణములను వదిలిన పరమ పుణ్యుడగు నీ పుత్రున్!

భగవంతుడ నే శబ్దవేధితో బన్నుగ గజమును జంపగనూ!
బాణము వేయగ నీ కుమారునకు బరగ తగిలి ప్రాణము లొదిలెన్! 12

బాధబడెడి యాతని నే జేరీ బన్నుగ యాతని సమ్మతినీ!
మర్మస్థానమున నుండి బాణమును కర్మ గతిని నే లాగితినీ!
శరమును లాగిన పిమ్మట నాతడు బరితపించుచును మీ కొఱకై
అంధులు నా తల్లిదండ్రులనుచునూ! నచటనె ప్రాణములను నొదిలెన్! 13

అజ్ఞానము, దొందర బాటులచే తొరముగా నీ పని జరిగెన్!
పూజ్యుడ! నే నిక యేమి జెయవలె బూరింపుము దదుపరి పనియున్!
హా కౌసల్యా! యా దుర్వార్తను యటుల దెలిపితిని ముని వరుకున్! 14

దుర్వార్తను నే దెలిపిన పిమ్మట దుఃఖము గోపము మదియందున్!
ప్రజ్వలింపగా వేదన నందెను బాధయు గ్రోధము బెనుకొనగా!
మహాతేజుడగు నాముని వెంటనె మహాక్రోధ సర్పితుడగుచున్!
అంజలితో నట నిలిచియున్న నను యడలుచు నిట్టూర్పుల వలికెన్! 15

రాజా! నీ విటుజేసిన జేటును రహి స్వయముగ తెలుపకయున్నన్!
నీతల చిదుపలు జిదుప లయ్యెడిది నిజముగ నా శాపము జేతన్!
క్షత్రియుడెవ్వని దెలిపి చంపినను క్షాత్ర ధర్మమును దా మెఱచీ!
వానప్రస్థుని జంపినచో మఱి వ్యర్థముగా జన దది వానిన్!
దహించి వేయును గల్మష మతనిని దావానలముగ జ్వలియించీ!
దివిజేంద్రుడును ననుభవించునూ! దివిజాసనమును గోల్పోవున్! 16

తపసున నుండిన మౌనిని గానీ, తపసి బ్రహ్మచారిని గానీ!
బాణము వేసీ ప్రాణము దీయుట బరగ మహాపాపం బదియున్!
తెలియకజేసితి గాన బ్రతికితివి చేటు దప్పినది రాజేంద్రా!
అటులగానిచో నీవేమిటి నీ వంశమె నశియించెడిది సుమా! 17

రాజా! మమ్మును గొని పొమ్మచటకు రయముగ సరయూ యొడ్డునకున్!
రక్తసిక్తమై యున్న కుమారుని రహి స్పృహ గోల్పోయిన వానిన్!

అట్టి సుపుత్రుని జూడగోరెదము నిట్టె ప్రాణముల విడిచెదమూ!
పలికి రటుల నా ముని దంపతులును బహు దుఃఖముతో నా తోడన్! 18

అంతట నే నా బహు దుఃఖితులను నా ప్రదేశమును గొనిపోతిన్!
పుత్రుని స్పృశించునట్లు జేసితిని యాత్రంబున ముని దంపతులన్!
తపశ్శాలురగు వారిరువురునూ దమ బుత్రుని స్పృశియించుచునూ!
మృత దేహంబున బడి రోదించిరి యతి దీనత ముని యిటు పలికెన్! 19

వత్సా! నాతో బలుక వేమిటికి వలనొప్పగ యభివందనమున్!
జేయవేమి? నేలనుబడి యుంటివి? జింతను గోపించితివేమో!
నే నిష్టుడ గాకున్న నట్లయిన నీ తల్లిని ప్రేమను గనుమా!
ఆలింగనమును జేయవేమి నను నలరి బలుకు బ్రియ వాక్యములన్! 20

వేకువ జామున వేద పనసలను విమల గాత్రమున జదివెదవూ!
విమల కంఠమును విందును నే నిక నమలహృదయమున దినదినమున్?
ప్రాతస్సంధ్యలను బూర్తి జేసికొని సరగున యగ్నిని బూజించీ!
ప్రక్కన కూర్చొని పలుభాషణలను బల్లవింప జేయును నింకన్? 21

అకర్మణ్యుండనగు నను బూజించుచు నతిథి దేవతలకును బోలెన్!
కందమూలఫలముల గొని వచ్చుచు గారవమున దినిపించు నికన్?
అంధురాలు, వృద్ధయు, దపస్వినియు యమిత ప్రేమ నీపై గలదీ!
అట్టి నీదు దల్లిని బోషింపుదు? నంధుడగద! యెటు రక్షింతున్? 22

యమక్షయము బోబోకు కుమారా! మమతను మాపై నేటికినీ!
రేపు వచ్చెదము మేమును నీతో నేటి కాగుమా ప్రియపుత్రా!
నీవు లేకపోవుటచే వే మతి నిరవధికంబగు దుఃఖముతో
దీనులమై యుంటిమిగద పుత్రా! కానరాని వారము గాదా! 23

యమసదనమునకు మేమును వత్తుము యముని నేను బ్రార్థించెదను!
'తలిదండ్రుల బోషించు నటులగా దగ యనుమతి నితనికి నిమ్మా'
అని నే పలుకుదు నా ధర్మాత్ముడు నభయ దక్షిణను నాకిచ్చున్!
నాస్థితి జూచీ జాలిని జెందును నయముగ నా మొర నాలించున్! 24

ఏ పాపంబును లేనివాడవును నెట్టి దుష్కృతియు లేకుండన్!
ఈ పాపాత్ముడు జంపినాడు గద! నిలపై జంతువుకు వలె నిన్నున్!
ఆయుధములచే యుద్ధముజేసీ యనిలో మరణించెడి వారున్!
ఏ లోకమునకు బోవుదురో మఱి యా లోకంబులకును జనుమా! 25

సంగ్రామముననూ వెనుకకు మఱలని సాటిలేని శూరులవలెనూ
నిహతులైన వారలగతి బొందుము నిశ్చలమగు నున్నత గతులన్!
సగరుడు, శైబ్యుడు దిలీపుండునూ జనమేజయుడును నహుషుడునూ!
ఏ గతి బొందిరొ యట్టి సద్గతుల నింపుగ బొందుము ప్రియపుత్రా!

సాధువులకు స్వాధ్యాయ పరులకును సంయమీంద్రులకు నెట్టి గతుల్!
భూదానము జేసిన వారలకును బొలుపుగ నా యహితాగ్నికినీ!
గోసహస్రమును దానము జేసిన కూరిమి గంగా పుణ్యనదిన్!
దేహత్యాగము జేసిన వారును దివ్యమైన యే సద్గతులన్!
పొందుదురో మఱి నీవును బొందుము బూర్ణమైన యుత్తమ గతులన్! 27

మన కులమందున బుట్టిన వారికి మఱి రావుగదా దుర్గతులున్!
నిను జంపిన దుర్మతికి గలుగుసుమ! నీచమైన చెడుగతి గలుగున్!
ఈవిధి యాముని పరిపరి విధముల యేడ్చెను బహు బరితాపమునన్!
తదుపరి భార్యాసహితుండైన ముని తన సుతునకు యుదక క్రియలన్
జేయ మొదలిడెను నమితాసక్తిని చింతావ్యాకుల శోకమునన్! 28

ధర్మవేత్తయగు మునిపుత్త్రిండును దర్శనీయమగు రూపముతో
దేవేంద్రునితో స్వర్గమునకు జనె దివిజులు బూవులు గురిపింపన్!
ఇంద్రసహితుడై జనుటకు ముందుగ సాంద్రహృదిని తలిదండ్రులనూ!
క్షణకాలము నోదార్చి యిటులనెను సారస మధుర సువాక్యములన్! 29

మీ పరిచర్యలు జేయుట వలననె మేలిమి యీస్థితి నందితినీ!
మీరుగూడ రాగలరు నా కడకు మిగుల పుణ్యఫల సుకృతిచే!
అనుచు బలికి యా మౌని కుమారుడు నా విమానమును దా నెక్కి
స్వర్గంబునకును దా బయనించెను స్వర్గవాసులట ముదమందన్! 30

జల తర్పణములు బూర్తి జేసికొని కలత నలతలను దేరుకొనీ!
అంజలితో నిలిచిన నా తోడను నాముని వలికెను గోపముతో!
పుత్రహీనునిగ జేసితి గద మము బురుషవర్య! యిది జేయు మికన్!
నన్నుగూడ జంపుము! జింతింపను! నాస్తి వ్యథా మరణం బన్నన్! 31

శుచియగు నా పుత్రుని జంపితివీ శోచనీయమగు నజ్ఞతతోన్!
సుదుఃఖమను నతి దారుణ శాపము శూరుడ! గైకొను మిచ్చెదనూ!
ఏ విధమున నే బుత్రశోకమున యేగుచుంటినో స్వర్గమునూ!
నీపును నట్లే పుత్రశోకమున నీల్గుము బహు బరితాపమునన్! 32

ఏనుగనుచు జంపితివి కుమారుని యే పాపము జేయనివానిన్!
అజ్ఞానముచే జేసితి గావున యంటదు బాపము దోషంబున్!
అయినను నాశాపము దహించునూ నతి దారుణముగ నిన్నెపుడున్!
పుత్రశోకమున మరణింతువు సుమ! పుడమిని లేనీ దుఃఖముతో! 33

మునిదంపతు లీ విధి శపించినను మోదుకొనుచు దమ హృదయములన్!
తమ దేహములను జితిపై నుంచీ తగ జేరిరి స్వర్గంబునకున్!
కౌసల్యా! విను! శబ్దవేధిచే కాలగతిని యజ్ఞానముచే
చేసిన పాపము గుర్తుకొచ్చినది చిత్రము వలె నీ సమయమునన్! 34

అపథ్యవస్తువు నలరి భుజింపగ యలరి వ్యాధి వచ్చిన రీతిన్
ఎపుడో జేసిన పాపకర్మ ఫల మిపుడు వచ్చినది యందుకొనన్!
భద్రే! విను! నే బుత్రశోకమున ప్రాణము వీడుటయును నిజమూ!
మునీశ్వరుండపు డిచ్చిన శాపము ముంగిట నే డిపు డొచ్చినదీ! 35

కౌసల్యా విను నాదు గన్నులకు గనిపించుట లే దేమియునూ!
దృష్టి మందగించినది స్పృశింపుము! గష్టముగా నంతయు నుండెన్!
అనుచు బలుకుచును దశరథేశ్వరుడు నడలుచు నేడ్చుచు వివిధగతుల్
కౌసల్యా సతితోని కరుణతో గద్గద స్వరమున నిటువలికెన్! 36

నే జేసిన పని రామచంద్రునకు నీతిదప్పినది యని తెలియున్!
నాకు దగిన యట్లేయున్నది సుమ! నా వర్తనలకు దగినటులన్!

రామునకే దగు నా విషయంబున రాముడు జేసిన కార్యంబున్!
మారు జెప్పకను వనమున కేగెను మాటాడక మౌనము తోడన్! 87

ఎవ్వడైన నిజపుత్రుని జగతిని నొవ్వజేసి వని బంపెడినా?
ఎవ్వడైన వని బంప జనకుని నొవ్వగ బలుకక యుండెడినా?
ఒక్కసారి రాముడు స్పృశించినను చిక్కని శక్తిని గాంచినచో!
కోరిక దీరును కౌసల్యా విను! గోర్కె యేది మది లేదు సుమా!
మరణించిన తదుపరి బంధువులను మరల జూడ బోజాలరుగా! 58

కనుల కేమియును గానరాదుగా! గటిక చీకటియె నా యెదుటన్!
జ్ఞాపకశక్తియు బోవుచున్నదీ! జాగృతి నశియించుచు నుండెన్!
యమదూతలు నరుగో! నట నిలిపిరి! యమక్షయమునకును గొనిపోవన్!
తొందర బెట్టుచు నున్నవా రదిగో! చిందర వందర జేయుచునూ! 39

ధర్మజ్ఞుండగు రామచంద్రుడే దగ నా యంతిమ సమయమునన్!
దూరమాయెగా దుఃఖవిషయ మిది మారిపోయె సర్వస్వంబున్!
సాటిలేని యా మేటి కుమారుడు సాన్నిధ్యంబున లేకుండన్!
స్వల్పోదకముల గొలను నెండినటు మల్పుచుండె నా ప్రాణములన్! 40

బదునైదవ వర్షమున జూచెదరు బన్నుగ రాముని శ్రీముఖమున్!
దేవత లగుదురు జూచువారు సఖి! భువి మానవులును గారుగదా!
పద్మపత్రముల వంటి నేత్రములు బన్నుగ చక్కని కనుబొమలున్!
చిక్కని బలువరసయును నాసికయు చక్కగ ముఖమును గలరామున్!
ధన్యాత్ములు గాంచెదరు రాముని తగ వని దిరిగొచ్చిన బిదపన్! 41

శరత్కాల చంద్రుని కిరణములను సహజ వికాసము నొందినదీ!
పద్మ సుగంధము గల నా రాముని బన్నుగ జూతురు ధన్యాత్ముల్!
వనవాసంబును బూర్తి జేసికొని వచ్చిన రాము నయోధ్యప్రజల్
శుక్రుని బొడిచిన యటుల గాంచెదరు శుభకరముగ యానందమునన్! 42

చిత్త మోహమున హృదయ మంతయును శక్తిలేక క్రుంగుచు నుండెన్!
దాపుకొచ్చినను శబ్ద స్పర్శలను దర్శింపగ లేకుంటినిగా!

చిత్తనాశమున యింద్రియములును క్షీణించినవి గదే సఖియా!
క్షీణస్నేహ దీపమువలె జీవము జితికి బోవుచున్నది చెలియా! 43

నదీవేనమున గట్టలు దెగినటు నా హృది తెగిపోవుచునుండెన్!
పుత్ర వియోగము జేత రాపిడుచు స్ఫూర్తి దప్పి బోవుచునుండెన్!
అలలు దెరలుగా సుడులు సుడులుగా నాకసమంతయు లేచుచునూ
చైతన్యంబును వీడుచుంటి సఖి! జాగృతి గొల్పోవుచు నుంటిన్! 44

హా! రాఘవ! హాహా! శ్రీరామా హా! పితృప్రియ! రఘురామా!
ఏ కాఱడవుల దిరుగుచుంటివో! యెట నుంటివొ గిరి లోయలలో!
హా కౌసల్యా! హా సుమిత్ర హా! హా! కులనాశిని కైకేయీ!
అస్తమించు చుంటివి నే నిప్పుడు నశువుల గోల్పోవుచు నుంటిన్! 45

ఈ విధమున కౌసల్య సమిత్రల నింపుగ రాముని దలచుచునూ!
విలపించుచు దా ప్రాణము లొదిలెను విలపింపగ యా రాణులునూ!
అంతఃపుర మది ప్రతిధ్వనించెను కాంతల శోకము వికలముగా!
దిక్కులన్నియును దీనములాయెను దిశలు బిక్కు బిక్కను చుండెన్! 46

ప్రియపుత్రుడు శ్రీరామచంద్రునీ ప్రేమమీర మది దలచుచునూ!
వియోగబాధను సహింపవేరక వేదన మది జ్వలియింపగనూ!
అర్ధరాత్రి గడిచిన పిమ్మట మఱి యధిక దుఃఖమున ప్రాణములన్!
వదిలె నంత యాదశరథేశ్వరుడు వసుధాస్థలి రోదింపగనూ!

(అయోధ్యాకాండమునందు 64వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## అఱువది యైదవ సర్గము

(ప్రాతఃకాలమున వందిజనులు స్తోత్రము జేయుట—
రాజు మరణించుట దెలిసి రాణులు రోదించుట)

ఈవిధి విలపించుచు నా రాజును నిమ్మగ మౌనము దాల్చుటయున్!
నిదుర వట్టెనని కౌసల్యాసతి మదిని దలచి లేపగలేదూ!
పుత్రశోకమున నామెయు నలసియు సోలియుండె మానస మందున్ !
శయనముపై శయనించె నిదురతో సఖియ సుమిత్రయు సిదురించెన్! 1

రాత్రి గడిచి తెలతెల వారగనే రహి వందులు స్తుతి బాఠకులున్!
మంగళ వాక్యములను గీతములను మహిమాన్వితమగు స్తోత్రములన్!
మధురముగా గానము జేయుచునూ మాధుర్యములగు వాద్యములన్!
రాజభవనమును జేరి స్తుతించిరి రఘువంశంబును గీర్తనలన్! 2

ఉదాత్త స్వరమున బలుకబడిన యా యున్నతమగు నా స్తోత్రములన్!
ప్రాసాదము నంతయును ధ్వనించెను బన్నుగ సప్త స్వరములతో!
దశరథేశ్వరుని వీర కృత్యములు దగ వీరోచిత మగు గాథల్!
చప్పటులను జఱచుచు బాడిరి యా చతుర వంది మాగధు లంతన్! 3

రాజగృహంబున బక్షులన్నియును రహి మేల్కొనియెను నా ధ్వనికిన్!
పంజరములలో బక్షు లన్నియును బన్నుగ రొద జేయగ దొడగెన్!
పలుకబడిన యా పుణ్య శబ్దములు దివ్యమైన వీణాధ్వనులున్!
పాడబడిన యా మధుర గేయములు బరగ రాజభవనము నిండెన్! 4

ప్రతిదినమును వలె సేవకు లొచ్చిరి పన్నుగ శుచి యాచారపరుల్!
దశరథేశ్వరుని సేవించుటకై దగ స్త్రీలును గంచుకు లంతన్!
హరిచందనముల గూడిన యుదకము నమల స్వర్ణ ఘటముల తోడన్
స్నానము జేయింపగను దెచ్చిరీ సరయూనది తోయంబులనూ! 5

మంగళకరమగు శుభ ద్రవ్యములను మహనీయములగు బదార్థముల్!
వస్త్ర భూషణాదుల వే దెచ్చిరి వయ్యారముగా గన్యకలున్!
తెచ్చిన వస్తువులన్ని చిత్రముగ నచ్చముగా స్వచ్ఛత మెఱయన్
దశరథేశ్వరుని యుపయోగార్థము దగ నర్పింపగ యట నుండన్! 6

పరిజన మంతయు నట్లే నిలిచెను బన్నుగ శంకించుచు మదిలో!
రాజునకేదో యైన దటంచును రహి మదిలో దిగులందుచునూ!
అధికారముగల స్త్రీలు గొందఱట యలరి శయనమును దరిజేరి!
మధుర మంజులంబగు స్వనములతో మహరాజును మేల్కొలిపిరిగా! 7

వినయ నయములను నుచిత రీతినీ యవయము వర్తిల్లెడి స్త్రీలున్!
రాజును స్పృశించి తెలియలేకనూ రహినుండిరి బొమ్మల వోలెన్!
అంత గొంద ఱది గ్రహింపగలిగిరి వింతగ వణకుచు దమలోనన్!
రాజు ప్రాణముల కేదొ వచ్చెనని రాజును దమలో లేడనుచున్!
నీటి ప్రవాహము కెదురు నిలిచినా నిగుడు తృణములకు వలె నయిరీ! 8

అంతవఱకు మది సందేహించుచు కాంతలు మది నే మనుకొనిరో!
ఆ సందేహము నత్యం బాయెను నా పాపము నిశ్చిత మయ్యెన్!
పుత్రశోకమున నిదురను బోయిన పాలతులు కౌసల సుమిత్రయున్
కాల సమన్వితులైన వారి వలె గదలక నిదురను నుండి రటన్! 9

శోకము చేతను కౌసల్యాసతి సోయగ మంతయు గోల్పోయెన్
తిమిరా వృతమగు నక్షత్రము వలె దీరుగ కన్పింపక యుండెన్!
రాజుప్రక్కనుండిన కౌసల్యయు రహి నుండిన యా సుమిత్రయున్!
శోకాశ్రువులను గళవళ బడుచును సోలుచు నుండిరి దడబడుచున్! 10

నిదురించెడి యా రాణుల గాంచీ నీరనుడగు రాజును జూచీ
నిదురలోనె మరణించె రాజనుచు మదిని దలచి రా సేవకులున్!
అంతట యంతఃపుర స్త్రీలందఱు నాడు యేనుగుల వలె వారున్
బిగ్గఱగా గొంతెత్తి యేడ్చిరీ పేరు పేరువా బిలుచుచునూ! 11

ఆక్రందన ధ్వని విని లేచి రపును నా కౌసల్యయు సుమిత్రయున్!
ఆ దశరథ రాజునుగాంచుచునూ హతాశులై 'నాథా!' యనుచున్
అఱచుచు బిగ్గఱ నాక్రోశించుచు నడలుచు గన్నీ రొలుకుచునూ!
శిరసు మోదికొని నేలపై పడిరి శ్రీకాంతులు ముఖశ్రీ దొలగన్! 12

నేలదొరలు నా కౌసల్యాసతి నిండు ధూళిపై గప్పగనూ!
నేలపడిన నక్షత్రమునకు వలె నిండు శోభ దప్పినదాయెన్!
దశరథుడా విధి మృతిని బొందగా ధరణి పడిన కౌసల్యయునూ!
చంపబడిన యేనుగు వధువును వలె గంపిత జనులును గాంచి రటన్! 13

రాజు భార్యలందఱు యేడ్చుచునూ రహి దుఃఖముచే బీడితలై
నేలను బడుచును మూర్ఛనందుచును నింగి గాంచి హా! హా! యనుచున్!
ఆగిపోని ఆ స్త్రీల రోదనలు నవిచ్ఛిన్న మగు నటు లుండెన్!
ప్రతిధ్వనుల నిండిన యా గృహమును బ్రతిధ్వనుల నధికము జేసెన్! 14

దశరథేశ్వరుడు మరణింపగనే దరలి పోయె నానందంబున్!
పరిజనులందఱు భయ భ్రాంతులై పరితాపంబున మునిగి రటన్!
నలుమూలలు నేడ్పులు విని పెంచెడి యలతను మునిగిరి బంధుజనుల్!
ఎటుజూచిన దైన్యము విషాదమును బటుతరముగ గాన్పించెడిని! 15

యశశ్శాలియగు దశరథేశ్వరుడు యమక్షయంబును బయనింపన్!
భార్యలందఱులును జుట్టు ముట్టుచును బహువిధముల రోదింపుచునూ!
జాలిగలుగునట్లుగ విలపించుచు సరస గుణములను నెన్నుచునూ!
ఒకరి జేతు లొకరును బట్టుకొని నొరుగుచు ననాథలకు వోలెన్! 16

(అయోధ్యకాండములోని 65వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## అరువది యాఱవ సర్గము

(కౌసల్యాదేవి విలాపము—కైకేయిని నిందించుట— మరణించిన రాజును తైలద్రోణితో నుంచుట)

శాంతించిన యా మహాగ్నికిని వలె సంద్రము వలె నుదకము లేనీ!
హతప్రభుడగు నా యాదిత్యునివలె యంత మొందినా పతి గాంచీ!
ఆ కౌసల్యాసతి భర్తృ శిరస్సును నడలుచు నొడితో నుంచుకొనీ
పరిపరి విధముల శోకించుచు మది బన్నగ కైకకు నిట్లనియెన్! 1

నృశంసురాలా! దుష్టచారిణీ! నిండెను గద! మదిలో గోర్కెల్!
రాజులేడు; నిక రాజ్యము నేలుము! రమ్యసుఖములను దేలుచునూ!
రాముడు జనియెను వనభూములకును రహి భర్తయు స్వర్గము నేగెన్!
గుంపునుండి విడివడిన దానివలె గూర్మిబ్రతుక నాశయు లేదూ! 2

ధర్మదేవతను గాల దన్నినా కఠినురాలు గైకేయి వలెన్!
పతిని వదిలి జీవింప గలుగునా పడతి జగతిలో నెవరైనా?
లుబ్ధుడు దను జేసిన బాపంబును లోలత గమనింపడుగ ధరన్!
కుబ్జ నిమిత్తము గైక వలన యీ గురుతర కష్టము వచ్చిబడెన్! 3

రాము డరణ్యము సీతను గూడక రహి నేగె ననుచు వార్తవినీ!
నావలె మిధిలాధిపుడు జనకుడును నలత జెందు బరితాపమునన్!
రాజుగతింపగ యనాథ నైతిని యాశ్రయింప తే రెవ్వరునూ!
ఈసంగతి రామునకు దెలియదూ యీ విధి యెటు నే సహియింతున్! 4

దీనురాలు దుఃఖితయగు జానకి దురపిల్లుచు నుండును వనిలో!
భయంకరమునగు దృశ్యములను గని బాధనందు గానవములలో!
మృగ ఖగుల గఠినములగు నఱపుల మిగుల వినుచు మది భయపడుచుండున్!
రాముని జెంతకు జేరుచుండు గద రమణి జనకసుత భయభీతిన్! 5

అల్పపుత్రుడును సతి వృద్ధుంలును ఆ జనకుడు బహు శోకముతో
సీతను గూరిచి జింతించుచు మది జీవితమును ద్యజియించు గదా!
ఇపుడె నేను మరణమును బొందెదను నిల వేల్పగు నగ్నిని దూకి!
భర్తృ శరీరము దోడ నేనునూ భవ్య స్వర్గమును బొందెదనూ! ౬

దీనురాలు కౌసల్య యీవిధిని దిక్కులు మ్రోవగ రోదింపన్!
అంతఃపుర కాంతలు కౌసల్యను నచటినుండి గొనిపోయిరిగా!
వశిష్ఠు నాజ్ఞను నమాత్యులందఱు నా దశరధునీ దేహంబున్!
తైలద్రోణిలో భద్రబఱచిరీ తగిన పనులు చేసిరి వేగన్! 7

అన్ని విషయములు దెలిసిన మంత్రులు సతని కుమారకు లెవ్వరునూ!
దాపున లేనీ సమయమునందున దహింపరాదని దలచుచునూ!
ఆ దేహంబును రక్షించిరి మఱి యచటి తైల ద్రోణిని నుంపన్
అయ్యో! మన రాజ స్తమించెనని యచటి స్త్రీలు నేడ్చిరి చాలన్! 8

నేత్రములను గన్నీరు నింపుచును నింగికి హస్తము లెత్తుచునూ!
తలను మోది కొనుచును స్తనంబులను దడుపుచు ధారల గన్నీటన్
శోకముచే సంతప్త హృదయలై చోద్యముగా విలపించుచునూ
బహువిధములుగా మాట లాడుచును బాధను వ్యక్తము జేయుచునూ! 9

హా! మహారాజ! అయ్యో! అయ్యో! హా! దుఃఖంబున మునిగితిమి!
రాముడు మమ్ముల వదిలి వెళ్లెనూ రమ్యమైన వనభూములకున్!
నీవును మమ్మును విడుచుచుంటివి నిర్దయ తోడను స్వర్గమునూ!
బోవుచుంటివి పుడమి, మము విడిచి పుట్టెడు దుఃఖముతో నుండన్! 10

దుష్టస్వభావము గల కైకేయీ దూరము జేసెను రామునకున్!
భర్తను గూడను దూరము జేసెను బహు క్రూరములగు వరములచే!
భర్తను జంపిన భార్య కైక మఱి భరింపగలుగుదు రెవ్వ రిలన్!
పాముబడగ క్రిం దెటుల వసింతుము బన్నుగ దెలుపుము మహారాజా! 11

మాకును నీకును రక్షకుండయిన మహితాత్ముడు శ్రీరాముండున్!
రాజ్యలక్ష్మినీ విడిచి వెళ్లెనూ రమ్యమైన వన భూములకున్!
రాముడు నీవును లేకపోవుటను రహి దుఃఖాత్ముల మగు మేమున్
కైక దూషణల సహించు టెట్టుల సరసత వసించు టెటుల యికన్! 12

రాముని రాజును విడిచివేసినది రహి సీతను లక్ష్మణు వీరున్!
వదిలివేసినది కైక మఱెవ్వరి వదలక యుండును నిక మీదన్?
అనుచు దశరథుని భార్యలందఱును నడలుచు నేడ్చిరి వేదనతో!
తలను మోదికొని నేలను బొరలిరి ధరణిమాత జాలిని బొందన్! 13

మహాత్ముఁడగు నా దశరథేశ్వరుడు మఱి లేడనుచును నయోధ్యయున్!
చిన్నబోయె నొక చిఱు దీపమువలె వెన్నెల లేనీ రాత్రివలెన్!
భర్తలేని స్త్రీలవలె తన శోభను బన్నుగ గోల్పోయెను గరిమన్
బిక్కు బిక్కు మనుచుండెను నగరము జిక్కువడిన వీరుని వోలెన్! 14

కన్నీటిని జార్చుచు బ్రజలందఱు గలత జెందిరీ వేదనలన్!
కులాంగనల హాహాకారములను గూర్మి నశించెను వారలలో!
దీపములను వెలిగించుట మానిరి దివ్య భవనముల యందుననూ!
వెనుకటి శోభను గోల్పోయెను గద! విమల యయోధ్యా నగరంబున్! 15

దశరథేశ్వరుడు మరణమునందీ దా బోవగ స్వర్గంబువకున్!
రాజు భార్యలందఱును నేడ్చుచును రహిబడి యుండిరి వేదనతో!
భానుడు గూడను గమనము నాపీ పశ్చిమమునకును బయనించెన్!
రాత్రి జరించెడి ప్రాణుల కనుపుగ రాత్రి యుపస్థిత మయ్యెనటన్! 16

పుత్రులు లేకుండగ యారాజును బూర్తి జేయ దహనక్రియలన్!
మంచిది కాదని తైల ద్రోణిలో నంచితముగ నుంచిరి బెద్దల్!
అయోధ్య యంతయు శోక సంద్రమున యట్టె మునిగినటు లుండె నహో!
చీకటిదెరలను జీకు మనుచునూ చిమ్మ జీకటులు వ్యాపించెన్! 17

అట్టి సమయమున అయోధ్య బ్రజలును నంతములేనీ శోకమునన్!
కంఠమందు భాష్పమును నిలుపుకొని కడు వ్యాకులతను నుండిరిగా!
సూర్యుడులేనీ యాకాశమువలె సుందరత్వమును గోల్పోయెన్!
తారాచంద్రులు లేని రాత్రివలె దరిగెను నయోధ్య బురి సొగసుల్! 18

(అయోధ్యాకాండములోని-66వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము—రెండవ భాగము

## అఱువది యేడవ సర్గము

(మునులు రాజులేని రాజ్యము నరాజకమని జెప్పి, ఎవ్వరినైనా రాజును జేయమని వసిష్ఠుని బ్రార్థించుట)

ఆక్రందన నానంద హీనమై యా యయోధ్య బ్రజ లందఱునూ!
ఎటులో గడిపిరి నాటిరాత్రి మఱి పటు వ్యాకులతను దీనతనూ!
రాత్రి గడిచి సూర్యోదయమాయెను రాజు నేర్పఱచు బ్రాహ్మణులున్!
కలిసి వచ్చిరీ సభకందఱునూ కలకల స్వనముల వినిపింపన్! 1

మార్కండేయుడు, వామదేవుడును మౌద్గల్యుడు మఱి కాశ్యపుడున్,
కాత్యాయనుడును, గౌతముండునూ, గడు మహాయశుడు జాబాలీ!
అను బ్రాహ్మణులును, నితర మంత్రులును నాచార్యుండగు వసిష్ఠతోన్!
విషయమునంతయు జర్చలు జరిపిరి వేఱువేఱుగా విశదముగాన్! 2

పుత్ర శోకమున రాజు గతించెను రాత్రి గడిచె వత్సరముగనూ!
మహారాజు స్వర్గమునకు బోయెను మఱి రాముడు వని బోయెగదా!
మహాతేజుడగు లక్ష్మణ వీరుడు మహాత్ముడగు రాముని తోడన్!
కలిసి పోయెగద! కానదవులకును కమ్మని సేవలు సేయంగన్! 3

భరతుడు మఱి శత్రుఘ్ను లిద్దఱును వీరపరాక్రమ విక్రములూ!
కేకయ దేశమునందు నుండిరీ కేకయ రాజుల గృహమందున్!
ఇక్ష్వాకులలో నెవనినైన నిపు డింపుగ రాజుగ జేయవలెన్!
రాజులేనిచో నశించిపోవును రాజ్యము, రాష్ట్రము, సంపదలున్! 4

రాజులేని రాజ్యమున మేఘుడును రహి వర్షింపడు వర్షములన్!
మెఱుపులు మెఱయక యఱుములు లేకను మిన్నకుండు బర్జన్యుండున్!
రాజులేని యా దేశమునందున రంజిల విత్తులు జల్లరుగా
పుత్రుడుగానీ, భార్యగాని మఱి పూనిక మాటల వినబోరూ! 5

రాజులేని యారాజ్యము నందున రమ్య సంపదలు దక్కవుగా!
భార్యకూడ దక్కదు, సత్యమునకు బస్నుగ దావుండదు జగతిన్!
సభలు సమావేశములును జరుపరు సంతోషముతో గూడికొనీ
ఆలయముల నిర్మింప రచట మఱి యందమైన యుద్యానములన్! 6

రాజులేని యాదేశము నందున రమ్య శీలములు గల ద్విజులున్!
యజ్ఞయాగములు జేయక యుందురు యాజ్ఞలేక వర్తిల్లుదురూ!
ధనవంతులునగు బ్రాహ్మణు లచ్చట దగ జేయుచు బహు యాగములున్!
తగిన దక్షిణలు నివ్వక యుందురు ధార్మిక తత్త్వము లోపింపన్! 7

రాజులేవి యాదేశము నందున రమ్య నాట్య నట నర్తకులున్
ఉత్సవముల పాల్గొనక యుండెదరు నుల్లాసంబుల దేలుచునూ!
న్యాయ స్థానములు మూసివేయుదురు న్యాయము జరుగదు సభలందున్!
కథాప్రియులకును ఆశాభంగము గవితకు గలుగును నిక్కటులున్! 8

రాజులేని యాదేశము నందున రమ్య స్వర్ణమణి భూషలతోన్!
క్రీడించుటకై బోరు గన్యకలు గ్రీడోద్యాన వనంబులకున్!
యువతీయువకులు వాహనంబులను రవలు జేయుచురు వేగముగా!
బరుగులు దీయరు నరణ్యంబులను బారవశ్యమున బ్రకృతి గనన్ 9

రాజులేని యా దేశము నందున రమణీయములగు భవనములన్
తలుపులు దెఱచీ నిదురను బోవరు తగ భయమందుదు రెల్లపుడున్
షష్ఠి హాయనంబుల యేనుగులును గష్టము లేకను గంటలతో
రాజమార్గముల సంచరింపవూ! రమ్య శోభలను గూర్పవుగా! 10

రాజులేని యా దేశమునందున రాచవిద్య లట నగబడవూ!
ఖడ్గ విద్యలును ధనుర్విద్యలును గనిపింపవు నెట వెదికిననూ!
వర్తకంబు వాణిజ్యము జరుగదు వలస బోవుదురు జనులెల్లన్!
ప్రయాణములు క్షేమముగా జరుగవు బలు రకముల గష్టములొదవున్! 11

రాజులేని యాదేశము నందున రహి యుండదు జనక్షేమంబున్!
శత్రువులను నెదిరింవగ జాలరు శాత్రవులకు జే జిక్కెదరూ!

రమ్యాలంకారముల గూడికొని తథాశ్వ గజముల పైనెక్కి
ప్రయాణంబునకు భయపడు చుందురు బన్నుగ యుత్సవముల యందున్!

రాజులేని యా దేశమునందున రహి పండితులును, విశారదుల్
శాస్త్ర చర్చలను జరుపగ జాలరు జారు మహోన్నత వేదికలన్!
వినయ పూర్వకముగ దేవ బూజలును వివిధార్చనలును దక్షిణలున్!
మధుర భక్ష్యములు బుష్ప మాలికలు మమత దీర నర్పింపరుగా! 13

రాజులేని యాదేశము నందున రాజ బుత్రు లుల్లాసమునన్!
చందనాగురువులను ధరియింపరు యందములను దొలికించుచునూ!
వసంత ఋతువున వృక్షము లటులను వన్నెలు జిన్నెలు జిందుచునూ
ప్రకాశింపరుగ పరువము తోడుత భ్రాంతి జింతలను బొగులుదురూ! 14

రమ్యోదకములు లేని నదికివలె రాజులేని యా రాష్ట్రమునూ!
తృణములు లేనీ వనము వంటిదది దోరముగా నా రాజ్యంబున్!
ధ్వజమువంటి వాడగు దశరథుడును నిజముగ స్వర్గమునకు నేగెన్!
రాముడు గూడను మనలను వదిలీ రమ్య వనంబులకును నేగెన్! 15

రాజులేని రాజ్యమున సర్వమును రహి యరాజకముగా శోచన్
బలవంతునిదే రాజ్యమన్నటుల బన్నుగ న్యాయము వర్థిల్లున్!
ఒకరినొకరు బీడించుచు దినెదరు నొకరి నొకరు మత్స్యముల వలెన్
రాజులేక రాష్ట్రము వర్థిల్లదు రాజు నొకని నిక జేయవలెన్! 16

స్వేచ్ఛా వర్తనులగు నాస్తికులును స్థిర నియమములను గలవారై!
రాజదండనను సన్మార్గంబున రహి వర్తింతురు సజ్జనులై!
దృష్టి శరీరము నెటు రక్షించునొ దూరము జేయునొ యాపదలన్!
సత్య ధర్మముల పోషణమునకును సరియగు మార్గము రాజుగదా! 17

రాజే సత్యము; రాజే ధర్మము! రాజే కులవంతుల కులమున్!
రాజేతల్లియు, రాజే దండ్రియు రాజే రక్షకుడగు వాడున్!
కావున రాజే చరిత్రచేతను, గమనీయంబగు యశస్సుచేన్!
యమ కుబేర యింద్రాదల మించియు నతిశయించి యుండును ధాత్రిన్!

ఇది ధర్మం బిది యధర్మ మనుచను నింపుగ విభజింపక యున్నన్!
అంధకారమై లోక ముండెడిది యాసృష్టియె జరుగక పోవున్!
మహారాజు నున్నంతవఱకు విను! మాన్యుడ! జవదాటగ లేదూ!
ఒడ్డుదాటనీ సంద్రంబును వలె నోడబడి యుంటిమి నీమాటన్! 19

ఓ ద్విజ వర్యుడ! వశిష్ఠదేవుడ! యోరిమి బరిశీలింపుము నంతన్!
రాజులేని యీ రాజ్య మంతయును రహి యరణ్యముగ నైపోవున్!
ఉత్తమ స్వభావ శీలుని నొకనిని యురువిక్రము నీ యయోధ్యకున్!
రాజ్యమునకు వేనభిషిక్తునిగా రహిజేయుము ధర ముదమందన్! 20

(అయోధ్యాకాండమునందలి 67వ సర్గము సమాప్తము)

*  *  *

## అయోధ్యాకాండము – రెండవ భాగము

### అఱువది యెనిమిదవ సర్గము

(వసిష్ఠుని యానతిపై దూత లైదుగురును కేకయదేశమునకు బోవుట)

వారి వచనముల విని వసిష్ఠుడును వరుసగ మిత్రామాత్యులతోన్!
సమస్తమగు ద్విజ వర్యులదోడను సవినయంబుగ నిటు వలికెన్!
భరతుడు శత్రుఘ్నునితో గూడను బహుసుఖముగ మామల యొద్దన్!
నున్నవారు మఱి వారి దెచ్చుటకు జెన్నుగ వేగము బోవలయున్! 1

వేగముగా బరుగెత్త గలుగు నా విలసిత హయముల బయనించి!
రాజకుమారుల దెండిచటికి వే రయమున బట్టము గట్టుదమూ!
దశరథుడే రాజ్యంబు నిచ్చెనూ దగ భరతుడు బాలింపగనూ!
పని యేమున్నది యోచింపగ నిక బరీక్షింప నిక ఇనిలేదూ! 2

నీవు జెప్పినటు దూతలు బోదురు నిఖిలము జరుగును నీమాటన్!
అనుచు నచటి వా రందఱు వలుకగ నా వసిష్ఠుడును నిటు లనియెన్!
సిద్ధార్థా! విజయా! జంతుడా! శ్రీకర యశోక! నందనుడా!
నామాటలు విని మీ రందఱునూ! నయముగ వర్తింపుడు భక్తిన్! 3

భరతకుమారా! పురోహితుండును బన్నుగ మంత్రులు నందఱునూ!
నీ క్షేమంబును గోరుచుండిరి నీరాకను వీక్షించుచునూ!
ఎదురు జూచుచున్నారు సుమూ! యిక గదిలి రమ్ము! శీఘ్రము మాతోన్!

రాముడు వనమును బోయినట్లుగా రహి రాజును దివి జనినట్లున్!
తెలుపరాదు సుమ! భరతుని కప్పుడు బలుక రాదు నీ యాపదలన్!
కేకయరాజుకు మన భరతునకు సేకరించి బహు కానికలన్!
పట్టువస్త్రముల, నలంకారముల బహుభూషల గొని పొందటకున్! 5

వసిష్ఠునాజ్ఞను గైకొని దూతలు నొప్పుగ నెక్కిరి యశ్వములన్!
కేకయదేశము బయలుదేరిరీ చీకులేక బహు వేగమునన్!
పశ్చిమాభిముఖులై పయనించిరి పరగ తాలగిరి దాటుచునూ!
మాలినీ నదీ మధుర తోయముల మాధుర్యములను గ్రోలుచునూ! 6

హస్తినాపురము గంగను దాటీ నటు బశ్చిమమును బయనించీ!
కురుజాంగలమును పాంచాలంబును గూర్మి జేరి కొని రా దూతల్!
జలముల నిండిన సరసుల గాంచుచు జాలము లేకను బయనించీ!
శరదండా నది దాటి వేగమున చయ్యన బయనించుచు వారున్! 7

సత్యోపయాచనంబను వృక్షము సరస ప్రదక్షిణ గావించీ!
పూజార్హంబగు దివ్య వృక్షమును బూజలు జేసిరి యామంత్రుల్!
అచటినుండి బయనము గావించీ యా దూతలు గడు శీఘ్రముగా
కులింగ నగరిని ప్రవేశించిరీ కూరిమి విశ్రాంతిని గొనిరీ! 8

అచటినుండి బయనంబును జేసీ యభికాల గ్రామంబునకున్!
అచటి బోధి భవనంబను గొండను నలరి పాఱునది యిక్షుమతిన్
దాటిరి మంత్రులు శరవేగంబున ధన్యులు నగు ద్విజులను గాంచీ
దోసిళ్ళను జలముల ద్రావుచునూ గాని బట్టుచును వేదములన్!

అంతట దూతలు బాహ్లీకంబును జెంత ప్రయాణము గావించీ!
సుదామ పర్వతమును జేరికొనీ సుందర దృశ్యములను గనిరీ!
ఆ ప్రాంతంబున విష్ణు క్షేత్రమును నలరు విపాశా యనునదినీ!
కనుగొని ప్రదక్షిణల గావించిరి వినుతించిరి యా విష్ణువునూ! 10

నదులు, దిగుడుబావులు, జెఱువులునూ నానావిధ పల్వలములనూ!
సింహ వ్యాఘ్ర గజ వన్య మృగములను వరుస గాంచి మది నుబ్బుచునూ!
ప్రభునాజ్ఞను బాలింప వలెననుచు బన్నుగ కడు నుత్సాహమునన్!
దీర్ఘమైన బయనము గావించుచు జేరిరి మంత్రులు గిరివ్రజమున్! 11

పురోహితుడు జేసిన యాజ్ఞలనూ బూర్తి జేయగను నా దూతల్!
రాజకులము రక్షింపగ వారును రయముగ హయముల బయనించీ!
రాత్రియనక పగలనక వచ్చిరీ రమ్యగిరీ నదులను దాటీ!
రాత్రి యగుసరికి జేరికొనిరిగా రమ్యమైన గిరివ్రజపురికిన్!

(అయోధ్యాకాండము అరువది ఎనిమిదవ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## అఱువది తొమ్మిదవ సర్గము

(భరతుడు భయంకరమగు దుస్వప్నమును గాంచితినని మిత్రులకు జెప్పుట)

గిరివ్రజపురమును చేరుకొనిరి యా వరమంత్రులు సంక్షేమముగా!
ముందురాత్రి యా భరత కుమారుడు గందగ దుఃస్వప్నమును గనన్!
తెలతెలవారుచు నున్న సమయమున కలగని ఖేదము నొందుచునూ!
కల నిజమగునని బరితపించుచును గాఢచింతలో దా మునిగెన్! 1

పరితపించు నా భరతుని గాంచీ బాధనొందుచును స్నేహితుల్!
బరితాపంబును మాన్పుట కొఱకై పలు వినోదముల జరిపి రటన్!
వీణా వాద్యములను బ్రయోగించిరి వేడుక నాటకము లాడీ;
హాస్యవచనముల దేలించిరి మఱి నాటల నాడిరి పలువిధముల్! 2

ఆటలునాడిన పాటలు బాడిన యతి సంతోషములగు పలుకుల్!
వింతకథలు మఱి యెన్ని జెప్పినను నింత సంతసము నొందడుగా!
చింతా ముద్రను గూడికొనిన యా శాంతమూర్తి మన భరతునికిన్!
పెదవులపై చిఱునవ్వు రాదు గత! బెద్దగ నిట్టూర్పులు విడుచున్!

మిత్రులంతఱును గూడి భరతునీ యాత్రము తోడుత ప్రశ్నింపన్!
కలత యెందుకని? కారణ మేమని? కమ్మని మాటల బలుకవనీ?
అంత భరతుడును మిత్రులతో ననె ఛింత గలుగుటకు గారణమున్!
దుఃస్వప్నంబును గాంచితి ననుచును దుఃఖముతో నిటులను పలికెన్! 4

మిత్రులార! వినుడో! నే గాంచితి మీరిన జెడుకల గతిరాత్రిన్!
తండ్రి దశరథుడు దల విరబోసుక దపించునటులుగ కనిపించెన్!
పర్వతాగ్రముననుండి బడినటుల భరింపరానీ హ్రదమందున్!
మాటిమాటికిని నవ్వుచున్నటుల మాలిన్యముతో నున్నటులన్! 5

తైలమందు మునుగుచు దేలుచునూ తైలము ద్రాగుచు నున్నటులన్!
తిలలు గలిపినా యన్నము దినుచును దిలలు దోసిలిని బట్టినటుల్!
బంధువులందఱు నేడ్పుల రొదనలను బాధలు నొందుచు నున్నటులన్!
కన్నుమూసినటు దశరథేశ్వరును గాంచితి కల నే గతరాత్రిన్! 6

సాగర మది శుష్కించి నట్లుగా జంద్రుడు నేలను వడినటులున్!
పుడమి చీకటిని నిండినట్లుగా భూమి బ్రద్దలై నట్లుగనూ!
పట్టపుటేనుగు నీల్గినట్లుగా పర్వతంబు బడి నట్టులుగా
అగ్నిహోత్ర మది యారినట్లుగా నంతట ధూమము గ్రమ్మినటుల్! 7

ఇనుమున జేసిన యాసనంబుపై యింపుగ గూర్చుండిన యటుల్!
నల్లని వస్త్రంబులను గప్పుకొని నల్లని బలుకులు బలుకుచునూ!
ఎఱ్ఱని నల్లని ప్రమదలు జూచి యెక సక్కెంబులు బలుకుచునూ
నాదు తండ్రినీ యవమానింపగ చేదు చెడుకలను గాంచితినీ! 8

ఎఱ్ఱని వస్త్రంబులను ధరించీ ఎఱ్ఱని మాల్యము ధరియించీ!
ఖరముపైని దక్షిణదిశ బోవుట గాంచితి ప్రియమగు నా తండ్రిన్!
రక్తవసనయును, వికృతాననయు, రక్కసి యొక్కతె పాశముతో!
లాగుచున్నటుల నాకు గనవడియె అచ్చగ కేకలు వేయుచునూ! 9

భయంకరంబగు స్వప్నము గాంచితి పరివేదన గలుగుచు నుండెన్!
నాకుగాని, మఱి రామున కైనను నాదు తండ్రి కైననుగానీ!
మరణము రావచ్చును నిదినిజమూ! మాన్యులు జెప్పిన బలుకులివీ!
ఖరయుక్తంబగు వాహనంబు గన గలుగును మృత్యువు ద్వరలోనన్! 10

ఆ దుఃస్వప్నము గాంచి నంతనే యలసట నొందితి సఖులారా!
గారవించుటయు లే దందులకే కలిసి మాటలాడుట లేదూ!
కంఠమెండి పోవుచున్నది మది కలత గ్రుంగి పోవుచు నుంటిన్!
ఆనందము నే బొందనట్లుగా ననిపించుచు నున్నది మదిలో! 11

ఈ భయంబునకు గారణ మేమో! నిరువుగ గన్పించుట లేదూ!
భయము గలుగునని మాత్రము నామది బలుకుచు నున్నది సఖులారా!
మందిగించినది కంఠ స్వరమును జాదమంతయును ఒగ్గినదీ!
నాపైనాకే జుగుప్స భావము నాట్యమాడు చున్నది మదిలో!

పూర్వమెన్నడును నిట్టి స్వప్నమును బొందుగ నే గాంచగలేదూ!
భయంకరంబగు దుఃస్వప్నం బది బాధాకరమైనది గూడన్!
తండ్రి దశరథుని గూర్చియె నామది దల్లడిల్లుచున్నది వేగన్!
చింత నుండి పుట్టిన యీ భయమును నంతము కానిది సఖులారా! 12

(అయోధ్యాకాండము 69వ సర్గము సమాప్తము)

* ★ ★

# అయోధ్యకాండము-రెండవ భాగము

## డెబ్బదియవ సర్గము

(మంత్రులు భరతునకు వసిష్టుని సందేశము వినిపించుట - భరతుడు శత్రుఘ్న సమేతుడై అయోధ్యకు బయలుదేరుట)

భరతుడు గాంచిన చెడుకల సఖులకు బన్నుగ వినిపించుచు నుండన్!
అంతలోనె యామంత్రులు వచ్చిరి యయోధ్య నుండియు బయనంబై
రాజగృహంబును బ్రవేశించియును రాజు కేకయను దర్శించీ
యుధాజిత్తునూ దర్శించీ మఱి యధావిధిని సత్కృతులందీ! 1

తదుపరి మంత్రులు గేకయ రాజును మది బొంగారగ సరిమ్రొక్కీ!
భరతుని దోడుత నిట్లని పలికిరి బాధను గనబడ నీయకనూ!
పురోహితుండును మంత్రులందఱును బూర్ణాశిస్సులతో గూడన్!
నీదు కుశలమును గాంక్షించుచునూ! నిను బ్రశ్నించుచు నుండిరిగా! 2

తొందరపని యున్నది నీ తోడను మందగమనమును గాకుండన్!
శీఘ్రముగా బయనించి రావలెను జేయవలయు నొక కార్యంబున్!
ఇవిగో! వెలగల భూషణంబులును నివిగో వెలగల వస్త్రములున్
కేకయ రాజును యుధాజిత్తునకు కీర్తిమీర బహుమతి నిమ్మా! 3

బంధువులను సంప్రీతి జేయు నా భవ్యగుణుడు నా భరతుండున్!
ఆ బహుమతులను నన్ని బుచ్చికొని నలరుచు తాతకు, మామకునూ!
అర్పించియు బహు సంతోషంబున నా దూతల బహుమతి జేసీ!
ఆదరించి యిటులను బశ్నించెను నాతుర గద్గద కంఠముతోన్! 4

తండ్రి దశరథుడు కుశలంబే కద! ధర్మ విదుడు శ్రీరాముండున్!
లక్ష్మణుండు బహు కుశలంబే కద! లాలిత్యంబును నొలుకుచునూ!
పూజ్యురాలు బహు ధర్మనిరతయును పుట్టెడు సుగుణంబుల తల్లీ!
రాముని గన్నా కౌసల్యాసతి రహి కుశలముగద? క్షేమంబున్? 5

సర్వధర్మములు దెలిసినదీ మఱి సకల శాస్త్రములు నెఱిగినదీ!
మధ్యమాంబ మా సుమిత్ర తల్లికి మఱిక్షేమము కుశలంబుగదా!

ఆత్మకామ, చణ్డీ, బహు క్రోధన యల కైకేయియు తల్లియునూ!
ఆరోగ్యముగా నున్నది కద! మఱి యలరుచు నేమని చెప్పినదీ? 6

మహాత్ముడగు నా భరతుడు పలుకగ మహనీయులునగు మంత్రులునూ
వినయము దోడుత భరతుని గాంచీ వినయాక్షరముల నిటు లనిరీ!
ఎవరికుశలమును గోరుచుంటివో! నింపుగ వారలు నందఱునూ!
కుశలము! వేగముగా బయనింపుము! గూర్మి రథముునను గూడికొనీ! 7

ఈవిధి దూతలు దొందర సేయగ తోరముగా నా భరతుండున్!
మాతామహునీ యాన గొనుటకై మఱి మంత్రులతో నట జెప్పి!
తాతను గాంచీ తరగని ప్రేమను దన్మయతను మాటల నాడీ!
చేతులెత్తి వందనము జేసీ చిన్ని మాటలను నిటు లనియెన్! 8

తాతా! వే నే బోయి వచ్చెదను దరుగవు నీ ప్రేమలు నాపై!
దూత లయోధ్యకు బిలుచుచుండిరీ మాతామహ! యిదె! పోయెదనూ!
తండ్రి వద్ద కిదె బోవుచుంటినీ! తరుగని ప్రేమను నను బిలిచెన్!
ఎపుడు రమ్మనిన యపుడు వచ్చెదను నిపుడె మఱల దిరిగొచ్చెదనూ! 9

భరతుని బలుకులు విని తాతయునూ భవ్యానందము నొందుచునూ!
శిరమును మూర్కొని దీవెన లిచ్చుచు శ్రీలు గలుగ నిటులను పలికెన్!
నాయన! భరతా! అయోధ్య కేగుము! అనుమతించితిని దీవెనలన్!
సత్పుత్రుడవోయ్! నా కుమార్తెకును సత్కీర్తివి యగుదువు గాతన్!
నీ తలిదండ్రుల యడిగినటులగా నిర్మల వాక్కుల బల్కు మటన్! 10

పురోహితుండగు వశిష్ఠదేవుని బూజ్యులైన విప్రోత్తములన్!
మహావీరులగు రామలక్ష్మణుల మఱి దెలుపుము! నడిగితి నంచున్!
అనుచు పలికె నా కేకయ రాజును నా భరతునకును సంప్రీతిన్!
గజములు, మృగచర్మములు, ధనంబును కంబళములు బ్రీతిని యిచ్చెన్! 11

ఆదర పూర్వముగా భరతునకును నా తాతయు బ్రీతిని నెచ్చెన్!
రెండువేల బంగారు హారములు నిండుగ గజాశ్వ సైన్యములన్! 12

మఱియు యశ్వపతి భరతున్కి కిచ్చెను మహోన్నతులునగు ననుచరులన్!
ఇష్టులనూ, విశ్వాసపాత్రులను, నింపగు నద్గుణవంతులనూ!
మేనమామయగు యుధాజిత్తుడును మేలిమియగు వారణములనూ!
శీఘ్రముగా బయగెత్తు ఖరములను సిరి సంపదలను బహుళంగిన్!
పెద్ద పులులతో సమానమైనవి పేర్మి కోఱలే యాయుధముల్!
అట్టి శునకముల యుపాయనముగా నా భరతునకు నర్పించెన్! 13

కైకేయీ పుత్రుండగు భరతుండు గానుక లెన్నియు గైకొనినన్!
ఆనందంబును నందలేదు మఱి యా దీవెన లందియు గూడన్!
దూతలు ద్వరితము జేయుటవలనను దూరప్రయాణము చేగూడన్!
దుఃస్వప్నంబును గాంచుట చేతను దూరమాయె నానందంబున్! 14

శ్రీమంతుండగు భరతుడంతటను శీఘ్రము గజాశ్వ రథములతో
రమ్యమైన దన గృహమును దాటి రాజ మార్గమున బయనించెన్!
రాజమార్గమును దాటుచు భరతుడు రమ్యాంతఃపురమును జొచ్చెన్!
మాతామహునీ మేనమామయును మఱి యాశీస్సులను గొనియెన్! 15

శత్రుఘ్నునితో గూడిన భరతుడు స్థిరచిత్తతను రథమెక్కి!
చింతా సంతోషముల గూడికొని వంత నొందుచును బయనించెన్!
వందల కొలదియు విచిత్రరథములు సందడి జేయుచు సైనికులున్!
ఒంటెలు, గోవులు, రథాశ్వ గజములు జంటగ భరతునితో బోయెన్! 16

అపేత శత్రుడు మహాత్ముండునగు నా భరతుడు బహు సేనలతో!
తనతో శత్రుఘ్నుండు వెంట రా తరలె నయోధ్యకు వేగముగా!
ఇంద్రలోకమున నుండి వెడలినా సాంద్రదీప్తుడగు నింద్రు వలెన్!
కేకయ దేశమునుండి వెడలెనూ కైకకుమారుడు భరతుండున్! 17

(అయోధ్యా కాండములోని 76వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## తొబ్బది యొకటవ సర్గము

(భరతుడు మంత్రులతో అయోధ్యకు బయలుదేరుట - వివిధ ప్రదేశము లను దాటుట - సైన్యమును మెల్లగా రమ్మని తాను ముందుగా అయోధ్యకు బోవుట - కళావిహీనమైన అయోధ్యను గాంచుచు - రాజభవనమును ప్రవే శించుట).

శ్రీమంతుండును నగు నా భరతుడు శ్రీకేకయ నగరమునుండీ!
తూర్పు దిక్కునకు బయనము జేసెను దోరముగా బరిజనములతో!
సుదాను నదినీ, హ్లాదిని నదినీ సుందర తీరము గలదియునూ!
పశ్చిమముగ ప్రవహించునదమునూ బన్నుగ శతద్రూ నది దాటెన్! 1

సత్యసంధుడును నగు నా భరతుడు శతద్రూ నది వే దాటుచునూ!
అపర పర్వటము ననుదేశంబును నట శిలావహము నదిదాటీ!
అజ్ఞేయము మఱి శల్యవర్తనము నట ఘన శైలములను దాటీ!
చైత్ర రథవనము ప్రయాణమయ్యెను జేరబోవగా భరతుండున్! 2

సరస్వతీ గంగలను జేరికొని సరస మత్స్య దేశంబునకున్!
ఉత్తరమున బారుండ వనంబును సత్వరమున భరతుడుజొచ్చెన్!
అచటినుండి పర్వతముల నది యగు నా కులింగ నది జేరికొనీ!
యమునానదినీ జేరి సైన్యమును నలరి విశ్రమింపగ జేసెన్! 3

అశ్వంబులపై నీరు జల్లుచును నలసట దీర్చుచు దమి దీరన్!
తామును జలకములాడి యమునలో దగ బయనంబును గావించెన్!
జన సంచారములేని వనములో చారు భద్రమను గజమెక్కి
వాయువు నాకాశమును దాటినటు నావని దాటెను భరతుండున్! 4

ప్రాగ్వటం బనెడి పురమును దాటీ యంశుధానమను ప్రదేశమున్!
జేరుకొనెను భరతుండు వేగమున సిద్ధు లుండు భాగీరథినీ!
గంగను దాటీ కుటికోష్ఠకమును జెంగున యానది దాటుచునూ!
ధర్మవర్ధనంబను గ్రామంబును ధార్మికు డా భరతుడు జేరెన్! 5

తోరణనును నా ప్రదేశమునకును దోశము దక్షిణ దిశనుంచూ!
జంబూప్రస్థము, వరూథ మనియెడి చారుగ్రామమునకును జేరెన్!
రమ్యమైన యా యరణ్యమందున రాత్రి విడిది జేసెను బిదపన్!
ఉజ్జిహానగ ర్యనంబును నురుతర వేగంబున జేరెన్! 6

అచటి సాలప్రియ వృక్షము లందున యలరి కొంత విశ్రాంతిగొనీ!
అతివేగంబున బోవు గుఱ్ఱముల నా రథమునకును గట్టికొనీ!
వెనుక రండనుచు నాజ్ఞాపించుచు వీరుడు నాభరతుం డంతన్!
తాను ముందుగా బయనము చేసెను త్వరిత గతిని తన సారధితో! 7

ఆ నర శ్రేష్ఠుడు భరతుడు చేరెను నల సర్వతీర్థ స్థలమునకున్!
ఉత్తానిక యను నదిని దాటుచును నురుతర మగు నదులనుదాటి!
కుటికానదినీ దాటెను భరతుడు గూర్మి కపీవతి నదిదాటెన్!
ఏకసాల గ్రామమును చేరికొని నిరువుగ దాటెను స్థాణుమతిన్! 8

వినత గ్రామమున గోమతిదాటెను వేగముననను నలసట జెందెన్!
కులింగ నగరము సాలవనముననను గమ్మని విశ్రాంతి గొనియెన్
అచటినుండి భరతుడు బయనించుచు నారాత్రియె నావనిదాటీ!
అరుణోదయ శుభవేళయందు నా యమరతుల్యు డా మనువిభుడూ!
నిర్మించిన యా యయోధ్య నగరము నిండు హృదయమున దర్శించెన్! 9

ఏడు దినము లటు రాత్రిం బవలు నేకధాటిగను బయనించీ!
పురుష శ్రేష్ఠుడగు భరతుడు పలికెను బూనికతో సారథితోడన్!
పుణ్యోద్యానంబులను సారథీ! భూరి యశస్సును గలిగిన యా
అయోధ్యనగరము గనబడుచున్నది నస్పష్టంబగు కాంతులతో! 10

తెల్లని మృత్తికతో విలసిల్లుచు నుల్లము ఝల్లని యనిపించెన్!
ఎందఱెందరో రాజఋషులునూ యీ ధరిత్రి పాలించిరిగా!
ఎందఱెందరో వేదపారగులు జందమైన తమ యాగములన్
ఈభూమిని స్వర్గముగా చేసిరి నిల మనుజాల ధర్మాత్ములుగన్! 11

ఏమిది చిత్రము! పూర్వ మయోధ్యను నింపఁ ధ్వని వినిపించెడిదీ!
కలకల ధ్వనులను గొంతు లీనుచును గలరవమును జెలరేగెడిదీ!
కన్నుల పండువుగా దీపములును గొంతులు జిందుచు నుండెడివీ!
నిశ్శబ్దములగు దరంగములతో నిండు కొనిన దేమో నేడున్! 12

కాముకులను నుద్యానవనంబులు గల కల లాడుచు నుండెడివీ!
పలువిధముల నాటల పాటలతో బరవశమగుచును నుండెడవీ!
ఇదేమి ? యీ ఉద్యానవనంబులు యేడ్చుచున్నటుల దోచెడినీ!
పట్టణ మంతయు నరణ్యమునువలె బాడుపడిన యట్లున్నదిగా! 13

పూర్వము మహరాజులు, ధనాఢ్యులును బొలుపుగ గజాశ్వముల నెక్కి!
వచ్చుచు బోవుచు నుండెడి వారలు హెచ్చుగ నగరము లోపలికిన్!
నేడేమీ? కవిపింపరు వారలు నిర్మానుష్యములై వీధుల్
సందడి యెచటను గనిపిపదుగా జిందదు మనసానందముగా! 14

అదేమి? వనములు నానందముతో నలరి యుండెడివి జనములతో!
రాలిపోయినా యాకుల తోడను రమ్యత గనబడ దించుకయున్!
మార్గ సమీపము నేడ్చుచున్నటుల మౌనముదాల్చిన యటులుండెన్
జనశూన్యములై విపణ వీధులును జైతన్యము గోల్పోయినవీ! 15

సుందరమగు సూర్యోదయమైనను నందములగు మృగ పక్షి ధ్వనుల్!
వినబడవేలనొ యవ్యక్తధ్వనుల్! యానందము గలిగించునవీ!
చందనాగురుల సంపృక్తంబగు సరస గంధములతోగూడీ!
మధుర వాయువులు వీచుటలేదూ! మనసానందము నొందంగన్! 16

భేరీ మృదంగ వీణాధ్వనులును వీర గీతములతో గూడీ!
సూర్యోదయమున వినిపించెడినీ సురుచిరముగ పురమంతయునూ!
ఆగిపోయినవి యెందులకో మఱి యంతట శూన్యంబై తోచున్!
దుశ్శకునంబులు గనబడుచున్నవి దురపిల్లుచు నున్నది మనమున్! 17

సారథి! విను నా మనసెందులకో యూరట జెందక యున్నదిగా
బంధుల కుశలము దుర్లభ మనుచును బాధ గలుగు చున్నది మదిలో!

దుఃఖ హేతువులు గనబడకున్నను దుఃఖము రానున్నట్లుండెన్!
మనసున కంపము గలుగుచున్నదీ మర్మ వేదనలతో గూడన్! 18

శ్రాంత హృదయుడై విషణ్ణ ముఖమున విమలత వీడిన భరతుండున్!
ఇక్ష్వాకులు పాలించిన పురినీ నిమ్మగ భీతిని లోజొచ్చెన్!
అలసిన హయములతో నాతండును నల వైజయంత ద్వారమునన్!
ప్రవేశింప కావలి వారంతట బన్నుగ విజయంబును బలుకన్! 19

మనసు వ్యాకులత జెందిన భరతుడు మధుర వాక్యములు బలుకుచునూ!
తనతో వచ్చిన సారథితోననె తనమదిలో గల విషాదమున్!
కారణమేమియు లేకండగనే కరమున నను బిలిపించిరిగా!
అమంగళము శంకించుచున్నదీ యంతయు శూన్యము ననిపించెన్! 20

సారథి! రాజులు గతించినప్పుడు గలుగు చిహ్నములు నేమేమో
అట్టి చిహ్నములు గనబడుచున్నవి నపశకుంబులతో గూడన్!
నా సచ్చీలము బతసమయి నటుల నా హృదయంబున దోచెడివీ!
బలవంతముగా నశుభం బదియో పైకి వచ్చునటు లనిపించెన్! 21

అయోధ్యయందలి భవనము లన్నియు నందచందములు గనబడవూ!
తలుపులన్నియును దెఱచియున్నవీ దగిన ప్రదీప్తియు లేకుండన్!
బలికర్మలతో శూన్యములైనవి ప్రభాహీనమగు జనములతో
లక్ష్మీ హీనంబగు గృహంబులును లాలిత్యము గన మెచ్చోటన్! 22

పుష్ప మాల్య శోభలు నశించినవి పూర్వానందము గనబడదూ!
అలకబడని ముంగిళ్ళు తోడుతను నంతట శూన్యము గనిపించున్!
దేవ పూజలంతట యాగినవీ దేవాలయముల నంతటనూ!
పుష్పమాల లమ్ముట లేదెచటను పూర్ణ యజ్ఞ గోష్ఠులు లేవూ! 23

వ్యాపారంబులు లేకపోవుటచు వ్యథిత హృదయులై వర్తకులున్!
వెనుకటివలె కన్పించుటలేదూ! వేదనతో గూడిన వారై!
దేవాలయముల చైత్యములందున దీనపక్ష సముదాయంబున్
చింతానిమగ్నులై జనులందఱు వంతను బొందుదు నుండిరిగా! 24

అంత భరతుడును నా యయోధ్యలో నపశకునాదుల మది గనుచున్!
సారథితో నీ విధముగ బలుకుచు బరగ రాజ భవనమును జేరెన్!
ఇంద్రుని పురి యమరావతి దీటుగ యింపులు జిందెడి యయోధ్యయున్!
గృహవీధుల జన శూన్యమగుట గని క్రుంగి కృశించెను భరతుండున్! 25

మహాత్ముడగు నా భరతు దంతటను మదికి నప్రియంబగు వానిన్!
పూర్వమెన్నడును జరగని వానిని బూని జూచుచును దుఃఖముతో!
దైన్యము నిండిన మనస్సుతోడను దగ సంతోష విహీనుండై
తలను వంచుకొని ప్రవేశించెనూ తండ్రి గృహమునకు వే వేగన్! 26

(అయోధ్యాకాండములోని-71వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## డెబ్బదిరెండవ సర్గము

(భరతుడు కైకేయీ గృహమునకు బోవుట—తండ్రి స్వర్గస్థుడయ్యెననియు, రాముడు వనికి బోయెననియు కైక భరతునికి దెలుపుట)

అంతట భరతుడు పితృాలయమున యాతండ్రిని జూడనివాడై!
తల్లిని జూచుటకై యా భరతుడు దరలెను మాతృ గృహంబునకున్!
కేకయ దేశము నుండి వచ్చినా శ్రీకరుడగు భరతుని గాంచి!
సంతసమున దా యెగిరి లేచెనూ స్వర్ణాసనమును గైకేయీ! 1

ధర్మాత్ముడు నా భరతుడు గాంచెను దగ శ్రీ వివర్జితంబైనా
మాతృగృహంబును ప్రవేశించి దా మాతృపాదములకు మ్రొక్కెన్!
తల్లియు భరతుని శిరసును మూర్కొని దగ కౌగిలిలో జేర్చుకొనీ
అంకమునను గూర్చుండ బెట్టుకొని యడుగగ జొచ్చెను కుశలములన్! 2

ఎన్ని రోజులైనది బయనించీ యే విధమున నిటకొచ్చితివీ!
త్వరిత గమనమున మార్గాయాసము దగ గలుగగ లేదుగ నీకున్!
నీదు తాతయును, మేనమామయును నిండు క్షేమమున గలరు గదా!
ప్రవాసమున క్షేమముగా నుంటివ? పన్నుగ తెలుపుము విషయములన్! 3

పార్థివ నందనుడైన భరతునీ బన్నుగ తల్లియు ప్రశ్నింపన్!
భరతుడంతయును దల్లికి దెలిపెను భారము దోడనె వివరముగా!
ఏడు రోజులైనది బయనించీ నిండుగ కేకయ భూపతియున్!
మేనమామయగు యుధాజిత్తునూ మిగుల క్షేమమున నున్నారల్! 4

తాత యిచ్చినా ధనరత్నంబులు దరలి వచ్చుచున్నవి వెనునన్!
పరివారము నలసట జెందుటచే బరగ వచ్చితిని నే ముందున్!
వచ్చిన దూతలు త్వరితము జేయగ వచ్చితి వేగంబున నిటకున్!
అమ్మ! తెలుపుమా! యడిగెద ప్రశ్నలు నాలసింపకను దెలుపు మికన్! 5

హేమభూషితంబగు బర్యంకము విమలత గోల్పోయెను జూడన్!
నుండు పరివారము నానంద హీనముగ బన్నుగ కనిపించెడి నాకున్!
రాజు నీ నివేశమున జందు మఱి రానగుపించుట లేదేలా?
రాజును జూచుటకై నే వచ్చితి రయమున తెలుపుము! నెటనుండెన్! 6

తండ్రిగారి పాదాభివందనము దగజేయగవలె నే నిపుడున్!
రాజును గుఱించి తెలుపుము తల్లీ రాజెటనుండెనొ వేగమునన్!
పెద్దతల్లి కౌసల్యా గృహంబున పేరిమి గలడా? తెలుపు మికన్
మనసు దల్లడిల్లుచు నున్నది గద! మనసేమో యూహించుచునూ!

అన్ని విషయములు దెలిపినదైనను నా కైకయు మోహితురాలై!
రాజ్యలోభమున మందర బోధల రహి భయంకరంబగు దానిన్!
అప్రియ విషయము ప్రియము జెప్పినటు నలరి దెలుప ప్రారంభించెన్!
కాలకూట విషమును నమృతంబుగ కడగి ద్రావ జేయగ దొడగెన్! 8

రాజును, మహాత్ముడగు దేజస్వియు రహి తండ్రియు సత్పురుషుడునూ!
సర్వభూతముల కేది చివఱి గతి సహజముగా నాగతి బొందెన్!
ధర్మాత్ముడు భరతుండు నదియు విని తగ పితృశోకము గూడికొనీ!
బాధను బొందుచు బడెను నేలపై బన్నుగ మోహితుడై వేగన్! 9

మహాబాహువగు నా భరతుండును 'హా! హతోస్మి' యని బలుకుచునూ!
దీనవచనముల బలుకుచు భరతుడు దిశల గాంచి నేలను వడియెన్!
పితృమరణమున గలిగిన దుఃఖము బీడింపగ తన హృదయమునన్
శోక సంద్రమున మునుగుచు భరతుడు శోకించెను బహు విధములుగా! 10

సుందరమగు నా తండ్రి శయనమును నందముగా గనిపించెడిదీ!
శరత్కాలమున చంద్రుని విధమున చారుకాంతులను జిమ్మెడిదీ!
తండ్రిలేని యీ శయనము జూడగ తగ శశిలేని గగనముగా!
ఎండిపోయినా సంద్రము వలెనూ నిండుగ లేకున్నది నేడున్! 11

మహా విక్రముడు నగు నా భరతుడు మాటలు రాకను గద్గదికన్!
వస్త్రముతో దన ముఖము గప్పికొని వలవల కన్నీటిని యొలికెన్!

ఆర్తుడైన యాభరతుడు నేలను నా విధమున బడి యుండంగన్!
లేవనెత్తి కైకయు దన పుత్రుని లీలగ పలికెను నీ రీతిన్! 12

రాజకుమారా! లెమ్ము! లెమ్మికను రహి ధర బడియుండుట దగునా?
సభలయందు సన్మానము నొందెడు సత్పురుషుల కిది తగునయ్యా!
బుద్ధిమంతుడవు, శీలవ్రతుండవు బూర్ణ యజ్ఞ దానములందున్
అధికారముగల వాడవు బుత్రా! నలరుము సూర్యుని వలెను ధరన్! 13

అనేక విధములు నగు శోకంబులు నా భరతుని యావృతమైనన్!
పుడమిని దొరలుచు నేడ్చుచు భరతుడు బూనిక తల్లికి నిటు లనియెన్!
అమ్మా! నే దలచిన మార్గంబున యనేక విధముల యోచనలన్!
రాముని యభిషేకమును జేయునని రమ్య యజ్ఞమును జేయుననీ
సంతోషముతో బయనము జేసితి సర్వము శూన్యం బైనదిగా! 14

ఒకటి దలపగా నొకటైనది గద యిక నే మున్నది? ఎల్లప్పుడున్!
ప్రియహితుడగు నా తండ్రి లేడికను బ్రదిలి పోవుచున్నది మనసున్!
తల్లీ! దెలుపుము దండ్రిగారికిని దగ వచ్చినదో వ్యాధియునూ!
సంస్కారము జేసిన రాజాదులు సత్కృతి బొందిన వారుగదా! 15

కీర్తిమంతుడగు మహారాజునకు వార్త దెలియదుగ వచ్చినటుల్!
దెలిపిన శీఘ్రము వచ్చి నా శిరము దీరుగ మూర్కొనువాడు గదా!
ధూళి గప్పినా నా శరీరమును దుడుచుచు నుండెడి వాడుగదా!
అట్టి సుఖము గలిగించెడి హస్తము నిట్టె మాయమై పోయెగదా! 16

సోదరుడును బంధువు శ్రీరాముడు శూరవరుని దాసుండను నే!
అక్లిష్ట కర్మణుడైన రామునకు నలరి దెలుపు నను శీఘ్రముగా!
ధర్మము దెలిసిన పూజ్యులందఱికి దగ యన్నయె మఱి తండ్రిగదా!
అన్నగారి పాదములను బట్టెద! యతడే గతి గద! నా కింకన్! 17

ధర్మవిదుడు మఱి సత్యసంధుడును ధర్మనిరతుడును దృఢవ్రతుడున్!
సత్యవిక్రముండగు నా జనకుడు సరిగా దెలుపుము! బలికినదీ!

పితృవాక్యముల వినగోరెద నే ప్రియముగ తెలుపుము ఓ జననీ!
అని పలుకగ భరతుడు కైకేయియు నలరుచు బలికెను నీరీతిన్! 18

'హా రామా!' 'హా సీతా!' 'లక్ష్మణ!' యని విలపించుచు నీ తండ్రి!
పరలోకమునకు నేగినాడు గద! పంచత్వంబును బొందుచునూ!
పాశంబులచే కొట్టబడిన యా పన్నుగ మహా గజంబు వలెన్
మృత్యుపాశమున జిక్కి పుడమిపతి యతి వేదనతో నిటు లనియెన్! 19

తిరిగి వచ్చినా సీతారాముల దీరుగ లక్ష్మణు సాహసునిన్!
చూడగలిగినా వారలు ధన్యులు సురుచిరముగ పుణ్యాత్ములునూ!
రెండవ యప్రియ వార్తను దెలుపగ నిండువేదనను భరతుండున్!
దిగులు జెందినా ముఖమున దల్లిని దీరుగ ప్రశ్నించెను నిటులన్!

కౌసల్యా యానందవర్ధనుడు గరుణామయుడగు రాముండున్!
సీతను గూడుక లక్ష్మణుతోడను జేరె నెటకు దెలుపుము తల్లీ!
భరతుం డీ విధి తల్లి నడుగగా తల్లియు పలికెను భరతునితో
ప్రియమును దెలుపుచు నుంటి ననుచు నప్రియము దెలుప బ్రారంభించెన్

రాజ కుమారుండైన రాముడును రమణి జనకజను గూడికొని!
లక్ష్మణుదోడను గానలకేగెను లలిత నారజీరల తోడన్!
ఆమాటలు విని భరతు డంతటను నల వంశోన్నతి నెఱుగుటచే
అధర్మకార్యము చేసెనేమొ యని నటు శంకించుచు బ్రశ్నించెన్!

అమ్మా! రాముడు బ్రాహ్మణ ధనమును నపహరింపగా లేదుగదా!
ఏ ధనికుని యే దరిద్రునైనను నిల హింసింపగ లేదుగదా!
పరదారల వాంఛింపలేదుగద బన్నుగ పాపిగ శ్రీరామున్!
దండక వనమున కెందుకు బంపిరి దండించుట యేలను గలిగెన్?

చపలమైన భరతుని తల్లియునూ జరిగిన దంతయు భరతునకున్!
వెనుక జూపినా స్త్రీ స్వభావములు వివరముగా నిటులను పలికెన్!
పండితమానిని యన దలచెడి యా నిండు మూఢురాలగు సతియున్!
భరతుని మాటలు విని సంతసమున బన్నుగ పలికెను నీరీతిన్! 24

ధర్మజ్ఞుండవు భరత కుమారా! బాధపడకు! నిక వేలెమ్మా!
రాజరికంబును స్వీకరింపుమా! రమ్యముగా బాలింపు ధరన్!
ఈ విధముగ నీబాగు కోఱకు నే నింపుగ చేసితి సర్వంబున్!
పాపము పుణ్యము దలపక మదిలో బన్నుగ నీఘన కార్యంబున్! 25

విధిజ్ఞులగు నా వసిష్ఠాదులను వేద విదులతో గూడికొనీ!
తండ్రికి సంస్కారములను జేసీ మెండుగ దానములను జేసీ!
దిగులు జింత లేకను మదిలోపల దైన్యము నంతయు విడనాడీ!
అభిషిక్తుండవు గమ్ము సుపుత్రా! యఖిల జనులు నిను గీర్తింపన్! 26

(అయోధ్యాకాండము 72 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## డెబ్బది మూడవ సర్గము

## (భరతుడు తల్లిని తీవ్రముగా గోపించుట)

తండ్రి గతించెను; సోదరు లిద్దఱు దగ కాననలకు బోయిరనీ!
విని యాభరతుడు బహు దుఃఖముతో వేదనాక్షరములను బలికెన్!
పితృహీనుడను, భ్రాతృహీనుడను బ్రిదులుచు వేదన పాలైనా
నా కిపుడీ రాజ్యముతో బని యేమీ? నాకీ సంపద లెందులకూ? 1

రాజు గతింపగ జేసితివీ! మఱి రాముని దపసిగ జేసితివీ!
దుఃఖమందు మఱి దుఃఖము జేర్చి దుఃఖితము జేసితివి గాదే!
వ్రణమునందు క్షారము జల్లి నటుల వరుసగ దుఃఖములను గూర్చి
శోక వేదనల బడ ద్రోసితివీ! లోకము నను నిందింపగనూ! 2

రఘువంశమునకు మచ్చ దెచ్చుటకు రక్కసివలె నరుదెంచితివీ!
కాల రాత్రివలె నరుగు దెంచితివి కఠిన శిలయెగద! నీ హృదయం!
పన్నగమని నిను దెలియక పోయెను బాలును బోయుచు నిను బెంచెనీ!
కొఱవి యనుచు నిను మదిలో దలపక కోరి గౌగలించెను విభుడున్! 3

పాప దర్శినీ! రాజును జంపి బన్నుగ సుఖముల బడయగనూ!
కులపాంసిని! అజ్ఞానము జేతను గులనాశనమును జేసితివీ!
సత్యసంధుడును మహాయశుండును సత్య పరాక్రముడగు రాజున్!
నీ వలనను శోకమున వేదనను నిరసించి మరణించెగదా! 4

ధర్మవత్సలుండగు భూపాలుని ధాత్రిని లేకుండగ జేసీ
ఏ కారణమున రాముని వనికీ నింపుగ నంపితి వెందుకనీ?
పుత్రశోకమున బొగులు సుమిత్రయు బొలుపుగ కౌసల్యా సతియున్
తల్లివైన నీ సహవాసంబున దగ జీవింపరు నిశ్చయమున్! 5

ధర్మాత్ముడు శ్రీరామచంద్రుడును దగ భావించును దన తల్లిన్!
అటులె ప్రవర్తించును గద నీయెడనట్టి వినయమును జూపుగదా!

జ్యేష్ఠమాత కౌసల్యా సతియును నిష్టసోదరిగ దలచుచునూ!
ప్రవర్తించు గద! యిట్టి నిర్దయత ప్రవర్తింపదగునా నీకున్! 6

పాపే! కౌసల్యా కుమారునీ బన్నుగ రాముని లక్ష్మణునీ!
నారచీరలను వనికి బంపితివి నయముగ విచారమును లేకన్!
అపాప దర్శనుడైన రామునీ యారీతిని గానకు బంపన్!
కారణమేమో విశదము జేయుము గల్మష మేమో కనుగొందున్! 7

లుబ్ధురాలవై తెలియక బోతివి బుద్ధి నాదు బరిశుద్ధతనూ!
రాముని యందున భక్తి శ్రద్ధలును రమ్య భ్రాతృ భక్తియు మిగులన్!
అందువలవనే రాజ్యము కొఱకై జిందితి విటులను వికృతినీ!
రాజును స్వర్గమునకు బంపితివీ! రాముని బంపితివీ వనికిన్! 8

మహాపురుషులగు రామ లక్ష్మణులు మఱి నాయొద్దను లేకుండన్!
ఏ విధమున రాజ్యము బాలింతును నేవిధమున రక్షించెదనూ?
మేఱు పర్వతము దన రక్షణకే మిగుల వనము గైకొనినటులన్! 9
దశరథరాజును నాశ్రయించెడినా దగ రాముని బల విక్రమమున్!

కాడిని గట్టెడి వృషభము గానూ వోడిమలేనీ గిత్తను నే!
ఈ రాజ్యంబును నెటు బాలింతును? నేవిధి సమర్థుడను నగుదున్?
సామధానములచే నీ రాజ్యము సరస బుద్ధి బల ధీశక్తిన్!
రాజ్యభారమును మోయు శక్తినీ రహి నా కుండిన యుండిననూ
పుత్రప్రేమగల నీ కోరికనూ పూర్ణము జేయగజాల సుమా! 10

రాముడు దల్లిగ నిను మది దలచుచు రహి యెల్లపుడును వర్తించున్!
పాపబుద్ధిగల నిన్ను విడువగా బన్నుగ మనసొప్పుట లేదూ!
పాపదర్శినీ! పరమ పవిత్రులు బన్నుగ మా పూర్వుల జేతన్
నిందింపగ దగినట్టి యావికృతి నందితి వెటులను గలిగినదీ? 11

అందఱిలో జ్యేష్ఠుడు రాజ్యమునకు విభిషిక్తుండును నగును గదా!
మిగిలిన దమ్ములు నందఱు భక్తిని మిగుల బ్రవర్తించెదరు గదా!

ఈ వంశాచారం బది యిది కద యీమాత్రము దెలియద నీకున్!
రాజ ధర్మమున యనాదరంబున రహి నీవిధి యొనరించితివీ! 12

రాజవృత్తమున జ్యేష్ఠ పుత్రుడే రాజగుచుండును నెల్లపుడున్!
రాజులందఱికి సమాన ధర్మము రహి యిక్ష్వాకులకుమ మఱియున్!
ప్రధానధర్మము నట్టి ధర్మమును భ్రష్టము చేసితి పిఁ తగునా?
వంశగౌరవము మాపి వేసిలిపి భ్రంశము జేసితి వీ కులమున్! 13

ధర్మప్రధానులు నిక్ష్వాకులు గద! ధార్మిక చరిత్ర గలవారున్!
మంచికులము బహు సదాచారమును నంచితముగ గలవారు గదా!
సచ్చరిత్రమున గల గర్వంబును సొంతము నశింప జేసితివీ!
ఉచ్ఛ నీచముల బరిగణింపకను సచ్చరిత్ర బద ద్రోసితివీ! 14

ఈ వంశంబున బుట్టిన రాజులు నింపుగ పురుషోత్తములు గదా!
నీచమైన యీబుద్ధి నీ కెటుల నిలయ మైనదో నే నెఱుగన్!
పాప నిశ్చయే! నీ కోరిన పని కడగి చేయగా లేను సుమా!
నా ప్రాణములకు ముప్పు దెచ్చితివి నయముగ చెడు కార్యముజేసీ! 15

నీ కప్రియమును జేయ దలచితిని నిజముగ నమ్ముము నా పలుకుల్!
సర్వజనుల ప్రియుడైన వానినీ సర్వదోష రహితుండైనా
రాముని వనమున నుండి మఱల్చి రహి దెచ్చెద నీ యయోధ్యకున్!
సీతను మఱియును లక్ష్మణవీరుని జింత దీర దెచ్చెద బురికిన్! 16

దీప్త దేజసుండైన రామునీ ధీరత మెఱయగ గొనివచ్చి
అంతరాత్మతో ధ్యానము జేసెద చెంతజేరి సుస్థిర భక్తిన్!
ఇటు బటు బలుకుల నా భరతుండును గటువుగ బలుకుచు దన తల్లిన్
శోకాతురుడై పర్వత గుహలో భీకరముగ సింహము వోలెన్!
మఱల బిగ్గఱగ యేడ్చెను భరతుడు మదిలో వేదన బెల్లుబకన్! 17

(అయోధ్యకాండములోని 73వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము-రెండవ భాగము

## డెబ్బది నాల్గవ సర్గము

### [భరతుడు తల్లిని తీవ్రముగా గోపించుట]

అంతట భరతుడు తల్లి నా విధము జింతను నిందించుచు మఱియున్!
పటు రోషముతో మఱల బలికెనిటు గటువగు నిందా వాక్యముఁలన్!
క్రూరురాల! ఓ దుష్టచారిణీ! కోరిన కోరిక తీరదుగా!
ధర్మహీన! నే మరణింతును నుమ తగ నేడ్చుచు గూర్చుండు మిలన్! 1

త్వత్కృతకర్మను రాజు గతించెను దగ రాముడు వనమున కేగెన్!
రాజుగాని, భృశ ధార్మికుడైనా రాముడు దూషించెన నిన్నున్!
కులము నశింపగ భ్రూణ హత్యనూ కోరి జేసితివి కైకేయీ!
భర్తతోడి సాలోక్యము బొందవు బన్నుగ నరకమె ప్రాప్తించున్! 2

ఘోరకర్మమును జేసి యీ విధము ఘోర బాపమును జేసితివీ!
అందఱికిని యప్రియము జేసితివి యల రాముని దూరము జేసీ!
నీదు కుమారుడనైన నాకు నిల నిండు భయము గలిగించితివీ!
నా కపకీర్తిని దెచ్చి పెట్టితివి నయముఁగ లోకము నంతటనూ! 3

నీ మూలంబున రాజు గతించెను నిర్మల హృదయుడు రాముండున్!
వనములకేగెను క్రూర హృదయవూ! వినయము జూపను నీయందున్
మాతృరూపమున నున్న విరోధివి మఱి మాటాడను నీతోడన్!
రాజ్యలోభమున పతిని జంపితివి రమణివి గాదొక రక్కసివీ! 4

కులమును నపవిత్రము జేసితివి కూరిమి కౌసల్యా సుమిత్రయున్!
తల్లు లందఱును దుఃఖము నొందిరి తగ యనిష్టమును గూర్చితివీ!
ధార్మికుడైనా రామచంద్రునీ తరిమి వేసితివి వనములకున్!
పుత్రశోకమున దండ్రి గతించెను భూరి స్వర్గమునకును నేగెన్! 5

కావున నీవొక పెను రాక్షసివీ గడగితి వెటు జెడు కర్మలకున్?
ధీమంతుండగు నశ్వపతికినీ తీరుగ తెచ్చితి పపకీర్తిన్!

చంద్రికులంబును నాశము జేయగ తగ బుట్టితి వా వంశమునన్!
అశ్వపతికి పుత్రికవుగాదు సుమ నరయ జనించిన రక్కసివీ! 6

నీవు జేసినా ఘోర పాపమది నిమ్మగ నను గ్రమ్మినది సుమా!
తండ్రి గతించెను సోదరులందఱు దగ నను జరిత్యజించిరిగా!
అందఱికిని యప్రియుడను వైరిని కందితి మనమున దుఃఖముతో
జగతి జనుల ముందఱ నగుబాటుగ జారిపోతి నవకీర్తులతోన్! 7

పాప నిశ్చయే! నిరయగామినీ! పరమ పవిత్రను గౌసల్యన్!
పుత్రవియోగము గలిగించితివీ! పోదు వెట్టి లోకంబునకున్?
క్రూరురాల కౌసల్య కుమారుడు గూర్మిని నిగ్రహవంతుడనీ!
జ్యేష్ఠ దనియు మఱి మాకందఱకిని యిష్ట జనకుడని గ్రహింపవా? 8

సర్వాంగములను హృదయమునుండీ సరసత జనించు వాదగుటన్!
తల్లికి మిక్కలి ప్రీతిపాత్రుడగు దక్కిన బంధులు బాంధవులే!
ఒకానొకప్పుడు ధర్మజ్ఞయు మఱి యొప్పగ సుర సంఘము జేతన్
పూజనీయ యగు గామధేనువును బొలుపుగ తన పుత్రుల గాంచెన్! 9

భూలోకంబున బొలముల దున్నుచు భూరి శ్రమను మూర్ఛలనందూ!
తన బుత్రుల దుర్భర యాతన గని తల్లడిల్లె సురధేను వటన్!
మహీతలంబున నర్ధ దివసమును మహాశ్రమను బని జేసెడి యా
వృషభములను గనులార గాంచుచును విషాద హృదయముతో నేడ్చెన్! 10

ఆ సమయంబున దేవేంద్రుండును నలరి బోవుచుండగ క్రిందన్!
సురధేనువు గన్నీటి బిందువులు సురుచిరముగ పడె నాతనిపై!
పరిమళించు గన్నీటి బిందువులు పయిని బడగ నింద్రుడు దలచెన్!
కామధేను గన్నీటి బిందువులు కాబోలనుకొనె దన మదిలో! 11

సురరాజంతట పైకి జూడగా సురభి గనవడియె కన్నులకున్!
దైన్యముతో దుఃఖించుచున్న యా ధేనువు నంతట కనుగొనియెన్!
వజ్రపాణి చేతులు జోడించుచు వన్నె కీర్తి గల ధేనువునూ!
నమస్కరించుచు వలికె నిట్టులను నయముగ వినయ విధేయతలన్! 12

సర్వహితైషిణి! కామధేనువా! సరసత దెలుపుము రోదనకున్!
మాకు నీకు భయమెవ్వరి నుండియు మఱి వచ్చుటయును లేదుగదా;
కారణమేమో తెలుపుము వేగము గడగి భయము దొలగించెదనూ!
కన్నీటిని గాల్చలను జేయకుము గడువేదన దుఃఖముతోడన్! 13

ధీమంతుండగు సురరాజిటులను ధీరత వలుకగ ధేనువునూ!
వాక్య విశారధుడైన యింద్రునకు వలనొప్పగ నిటులను వలికెన్!
పాపము శాంతము! దివిజాధిప విను! బన్నుగ యాపద లేదు సుమా!
నా పుత్రులు వృషభముల జూడగా నా కన్నుల నీరును దొలికెన్!

కష్టము లందున గ్రుంకుచున్నవియును గడు సూర్యుని వేడిమితోడన్!
దంపింప జేయగ దుర్బలమైనవి తగ కర్షక బీవన చేతన్!
మఱింత దుర్బలమైన వృషభములు మఱింత కృశించుచున్నవియున్!
దుఃఖనిమగ్నములైన సుతులగని దుఃఖము నందితి దివిజేశా! 15

మోయలేక భారమును దుఃఖమున మూల్గుచున్న యీ వృషభంబుల్!
నాదు కాయమున నుండి పుట్టినవి ఖేదము గలిగిన దందుకనే!
పుత్రుని కంటెను ప్రేమ పాత్రు డీ పుడమిని నుండడు దివిజేంద్రా!
పుత్రుల దుఃఖము జూచి పొందితిని పుట్టెడు శోకము నే డిటులున్! 16

వందలాది పుత్రులు ధేనువునకు! జందముగా గల రీ వసుధన్
అట్టి కామధేనువు నదలుట గని యా సురేంద్రుడును మది యందున్!
నిశ్చయించుకొనె పుత్రుని మించిన ప్రియు డీ పుడమిని లేడనుచున్!
ప్రియ బాంధవు లెందఱు గలిగున్నను ప్రియసుతు సాటిగ రారుగదా! 17

లోకములను రక్షించు గోరికను లోలత ధేనువు వర్తించున్!
స్వభావముననే యది యెల్లప్పుడును సద్గుణములకును నిలయమదీ!
వేలకొలది సంతాన ముండియును వేదన జెందుచు నున్నదిగా!
ఏక బుత్రువిరహమున కౌసల్య యెంత శోకమును బొందునొకో! 18

ఏక బుత్రుగల పరమ సాధ్వినీ జీకటి బ్రతుకును జేసితివీ!
ఇహ పర లోకములందు దుఃఖమును నిమ్మగ బొందెదు నిజము సుమా!

సోదరు విషయము దండ్రి విషయమును సురుచిరముగ యంతయు జేతున్!
శుభ్రయశస్సును బెంచుకొందునూ! జూడు! లేదు సంశయము నిలన్! 19

మహాబలుని కౌసల్యా తనయుని మఱి వెనుకకు నే రప్పించీ!
స్వయముగ నే వనములకు బోయెదను సర్వ సుఖములను ద్యజియించీ!
పాపే! శోకముచే బ్రజలందఱు బన్నుగ కుములుచు నను జూడన్
నీవు జేసినా ఘోర బాపమును నే భరింతు నెటులను జెపుమా! 20

అగ్నియందు దూకుము! లేదా మఱి యరణ్యములకును వే బొమ్మా!
కంఠమునందున ద్రాడు జుట్టుకొని గడగి ప్రాణముల నొదులు మికన్!
పంచభూతముల గలియుట యొకటే పశ్చాత్తాపము లే దింకన్!
మఱి యొకగతి, దారియు లేదుసుమా! మరణ మొక్కటియె గతి నీకున్!

సత్య పరాక్రముడైన రాముడి సర్వ రాజ్యమును గ్రహియింపన్!
పాపమంతయును దొలగి పోవుటను బరితృప్తుడ నయ్యెద నింకన్!
తోమరాంకుశములను బొడిచిన యా తూలు గజమువలె గోపముతో
సర్పమువలె నేలనువడె భరతుడు సారెకు నిట్టూర్పుల తోడన్! 22

కనులు నెఱ్ఱబడి వస్త్రము జారగ గల యాభరణములును జెదరన్!
శత్రుమర్దనుండైన భరతు డా భ్రాతృ విరహమున దీనతతోన్!
నేలను గుప్పగ బడి మోహముతో నిడుద శ్వాసలను బీల్చుచునూ
ఇంద్ర ధ్వజముగ నేలను వడియెను యింద్రోత్సవ మంతము నందున్!

అయోధ్యాకాండ యందలి 74వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యకాండము- రెండవ భాగము

## డెబ్బది యైదవ సర్గము

### [కౌసల్యాదేవి యెదుట భరతుడు శపథముజేయుట]

వీర్యవంతుడగు భరతు డంతటను వేగము మోహము విడనాడి!
అశ్రుపూర్ణ నేత్రములను దల్లిని నటు గనుగొని మంత్రుల మధ్యన్!
దీనయైన కేకేయి యంతటను దిక్కులు జూచుచు నుండంగన్!
భరతుడిట్లు నిందించెను దల్లిని బహు పరుషాక్షర వచనములన్! 1

రాజ్యము గావలెనని నే నెన్నడు రహి కోరిక గోరగలేదూ!
తల్లితోను గూడను నే నెప్పుడు దగ యోచన జేయగ లేదూ!
తండ్రి దశరధుడు రాజ్య మిచ్చుటయు దగ నా విషయము దెలియదుగా!
శత్రుఘ్నునితో దూరదేశమున సమ్మతి నే నట నుంటినిగా! 2

రాముడు వనవాసము బోవుటయును రహి యా సంగతి నెఱగనుగా!
సీతయు, లక్ష్మణుడును కానలకు జేరుటయును నే నెఱుగనుగా!
మహాత్ముడగు భరతుం డీ విధమున మఱి క్రోశించుట గమనించి!
కంఠ ధ్వని గుర్తించి భరతునీ కౌసల్యాసతి సుమిత్రతోన్!
బలికె నిటులను గద్గదస్వరమున బన్నుగ మది కలతను జెందన్! 3

క్రూరకర్మ కైకేయి సుతుం డిదె కూరిమి వచ్చెను నయోధ్యకున్!
దీర్ఘదర్శియగు భరత కుమారుని గోరిక యగుచున్నది చూడన్!
వివర్ణయై కృశియించినట్టి యా విమలహృదయ గౌసల్యయునూ!
భరతుని జూడగ బయలు దేరెనూ బన్నుగ వణుకుచు సుమిత్రతో! 4

అట్టి సమయమున భరతుడు గూడను నిట్టె కౌసల్య గృహమునకున్!
శత్రుఘ్నునితో గూడిన వాడై యాత్రమతో బయశం బయ్యెన్!
పుత్రశోకమున దుఃఖితురాలై పొగులుచున్న కౌసల్య సతిన్!
కౌగలించి భరతుడు శత్రుఘ్నుడు గడగి పాదములపై బడిరీ! 5

దుఃఖితయగు గౌసల్యా సతియును దూరుచు భరతునితో ననియెన్!
రాజ్యము నేలగ కోరుచున్న నీ రమ్య కోరికయు నెఱవేరెన్!
కంటక రహితంబైన రాజ్యమును గడగి పొందితివి సులభముగన్!
కైక జేసినా క్రూరకర్మచే గడు శీఘ్రముగా నందితివి! 6

నారచీరలను ధరింపజేసీ నయముగ రాముని యడవులకున్!
బంపివేసినది బహు క్రూరముగా గంప మింతయును లేకుండన్!
పుత్రవియోగము గలుగజేసినది పుట్టెడు దుఃఖము గలుగంగన్!
ఏ ప్రయోజనం బాసించినదో యెఱుగను గద! కైకేయి మదిన్! 7

హిరణ్య నాభుండైన నా సుతుడు యరణ్యమున నున్నా డిపుడున్!
నన్ను గూడ బంపుట మంచిది కద! విన్నవింతు నా కైకకునూ!
అటుల గానిచో నేనే స్వయముగ నల సుమంత్రుతో గూడికొనీ!
అగ్ని హోత్రమును ముందుంచుకొనీ యారాముని వద్దకు బోదున్! 8

ఇష్టమైనచో నీవే స్వయముగ కష్టమనక నను వేగముననన్!
రామునియొద్దకు జేర్పుము శీఘ్రము రమ్య తపోవన భూములకున్!
గజాశ్వ రథ సంపూర్ణమైనదీ కడు ధనధాన్య సమృద్ధమునూ
అతి విస్తృతమగు రాజ్య మామెచే నలరి బొందితివి ధన్యుడవూ! 9

ఈవిధమగు బహు గతిన వాక్యముల నిమ్మగ కౌసల్యా సతియున్!
పలికిన బలుకలు వ్రణము నందునను ఒటు సూదులతో గ్రుచ్చినటుల్!
ఏపాపంబును నెఱుగని భరతుడు నీపటు వాక్య పరంపరకున్!
సంభ్రాంతుండై కలత జెందుచును చయ్యన పదముల పై వ్రాలెన్! 10

అనేక విధముల విలపించుచునూ యా భరతుడు సంజ్ఞను దప్పెన్!
కొంతసేపటికి సంజ్ఞను బొందీ చింతను యటులే పడియుండెన్!
అంతట భరతుడు ప్రాంజలి తోడను వింతగ విలపించుచు మఱిన్!
అనేక దుఃఖము లావరింపగా నా కౌసల్యకు నిటులనియెన్! 11

ఆర్యే! యే పాపంబు నెఱుగనీ యకిల్బిషుండను నగు నన్నున్
ఏకారణమున నిందించెదవూ యే దోషంబును జూచి ననున్!

రాముని పైగల ప్రేమ యెట్టిదో రహి నీకును దెలియును దల్లి!
ఎంతగాఢమైనదియో, స్థిరమును యెంత భక్తితో గూడినదో!

సత్య సందుడును సత్పురుషుండును సకల ప్రియుడు శ్రీరాముండున్!
ఎవని యనుమతిని కానల కేగెనొ! యవని యట్టివానికి బుద్ధిన్!
శాస్త్రరీతి వర్తించు యోచనయు సరి స్థిరబుద్ధియు లేకుండున్
రాము డరణ్యము బోవలె ననుచును రహి నే యోచన జేసినచో
నా బుద్ధియు వక్రము నస్థిరమై నడుచు నీతికిని దూరంబై ! 13

అన్నగారు నెవ్వని యనుమతితో నల వనముల బయనించెనొకో!
అట్టివాడు బాపాత్ముల సేవను నలరు నిశ్చయముగా మఱియున్!
సూర్యుని కెదురుగ మలమూత్రముల యశుచియై జేయును వాడు! నిలన్!
నిదురించెడి ధేనువును బాదమున నిరసించుచు దన్నును వాడున్!
అట్టి పాపమును బొందుదు నేనును నా రాముని వని బొమ్మనినన్! 14

అన్నగారు నా యనుమతి తోడను యరణ్యములకును బోయినచో
పనిజేయించుచు బైక మీయనీ ప్రభువుకెట్టి పాపము వచ్చున్!
రాజద్రోహమును జేసినవానికి రహి దోషము నెట్టిది వచ్చున్
అట్టి దోషమును బొందుదు నేనును నారాముని వని బొమ్మనినన్! 15

అన్నగారు నా యనుమతి తోడను నరణ్యములకును బోయినచో!
ఆరవ వంతును బన్ను గైకొనుచు నా ప్రజ యాదాయము నందున్!
రక్షింపని యారాజు బొందునో రహిపాపము నపకీర్తియునూ!
అట్టి పాపమును బొందుదు నేనును నారాముని వని బొమ్మనినన్! 16

అన్నగారు దా యనుమతి తోడను నరణ్యములకును బోయినచో
మునులకు యజ్ఞమునందు దక్షిణను మోదముతో దా నిత్తునని
ప్రతిన జేసియును బొంకిన వానికి బన్నుగ గలిగెడి దోషంబున్!
అట్టి దోషమును బొందుదు నేనును నారాముని వని బొమ్మనినన్! 17

అన్నగారు నా యనుమతి తోడను నరణ్యములకును బోయినచో
గజాశ్వరథముల తోడ గూడినా రణమునందు గడు భీరువునై

సత్పురుషుల ధర్మము భావింపక సరసత యుద్ధము జేయకనూ
పొజెడి వానికి గలుగు బాపమును బన్నుగ నాకును గలిగెడినీ! 18

నా యనుమతి గైకొనుచు రాఘవుడు నయముగ గానకు బోయినచో
ధీమంతుడు నగు నాచార్యునిచే ధీమంతములగు శాస్త్రములన్!
ఉపదేశములను మఱచెడి వానికి దపింప జేయును బాపములున్!
అట్టి పాపమును బొందుదు నేనును నా రాముని వని బొమ్మనినన్! 19

అన్నగారు నా యనుమతి తోడను నరణ్యములకును బోయినచో
గోవును దన్నిన బాపంబును మఱి కూర్మి మిత్రునకు ద్రోహంబున్!
పెద్దవానినీ కఠిన బాషలను సద్దుజేసినా వానికినీ
ఎట్టి బాపములు గలుగునొ నాకును యట్టి బాపములు గలిగెడినీ! 20

అన్నగారు నా యనుమతి తోడను నరణ్యములకును బోయినచో!
పితృ-అతిధి పూజలు సేయకనూ ప్రియమారగ పాయసము మఱిన్
పులగము దినువాడును గురుదేవుల పొమ్మని యవమానించెడినో!
ఎట్టి దుర్గతిని బొందునొ నేనును నట్టి దుర్గతిని బొందుదునూ! 21

అన్నగారు నా యనుమతి తోడను నరణ్యమునకును బోయినచో!
చంద్రార్కులతో సమతేజుండగు నింద్ర తుల్యుడగు రాఘవునీ!
సింహాసనమున గూర్చొని ప్రజలను స్థిర క్షేమంబును గోరుచునూ!
పాలించెడి యాప్రభువును గాంచెడి భాగ్యము లేకుండెడి నాకున్! 22

అన్నగారు నా యమమతి తోడను నరణ్యములకును బోయినచో!
మిత్రాదులు జెప్పిన రహస్యముల శాత్రవులకు మఱి జెప్పుచునూ!
మిత్రద్రోహము జేసిన వానికి మిక్కిలి పాపము గలిగెడినో
అట్టి బాపమును నాకును గలుగును నారాముని వని బొమ్మనినన్! 23

అన్నగారు వని బోవుటలో నా యంగీకారం బుండినచో!
ఉపకారం బెవ్వనికి జేయకను నపకారంబును జేయుచునూ!
కృతజ్ఞతించుక లేనివానిగను నాత్మను వదిలిన వానిగనూ!
సిగ్గులేని వానిగ లోకంబున స్థిరముగ ద్వేషింపగ బడుదున్! 25

అన్నగారు నా యనుమతి తోడను యరణ్యమునకును బోయినచో
భార్యాపుత్రుల బంధు మిత్రులను బరివారముతో గూడికొనీ
మృష్టాన్నము దా నొక్కడే దినిన కష్టము గలుగునొ దుర్మతికిన్!
అట్టి కష్టములు గలుగును నాకును నిట్టె రాము వని బొమ్మనినన్! 25

ఆర్యుడు రాముడు నా యనుమతినీ యరణ్యమునకును బోయినచో!
వైవాహికమును భార్యను బొందక వారసులను మఱి బొందకనూ!
ధార్మిక కర్మల నాచరింపకను దగ మరణించునొ వానిగతిన్!
అట్టి పాపమును బొందుదు నేనును నా రాముని వని బొమ్మనినన్! 26

అన్నగారు నా యనుమతి తోడను యరణ్యమునకును బోయినచో
పూర్ణాయుర్దాయము లేకయునూ బొగులుచు సంతతి లేకయునూ!
ఎంత పాపమున నీ స్థితి గలుగునొ యంత పాపగతి వాని వలెన్!
నేనును బొందుదు నట్టి బాపగతి నే రాముని వనీ బొమ్మనినన్! 27

అన్నవారు నా యనుమతి తోడను నరణ్యమునకును బోయినచో
రాజు మఱియు స్త్రీ బాల వృద్ధులను రహి వధియించిన బావంబున్
పోషింపగదగు వారి నొదిలినా దోషముగలుగునొ వారి గతిన్!
అట్టి పాపమును బొందుదు నేనును నా రాముని వని బొమ్మనినన్! 28

అన్నగారు వని బోవలె నుంచును నలరి నేను గోరితి నేనిన్!
మధుమాంసంబుల, లక్కలోహముల మఱివిషమును నమ్ముచు గొనుచున్!
దారపుత్రులను మఱి బంధువులను దగ పాపంబును బొందునొకో
అట్టి పాపమును బొందుదు నేనును నా రాముని వని బొమ్మనినన్! 29

అన్నగారు నా యనుమతి తోడను దిన్నగ యడివికి బోయినచో
భయంకరంబగు యుద్ధము నందున పందవోలె బాఱెడి వానిన్!
పట్టి వధింపగ జేయునట్టి యా పలవ కెట్టి పాపము గలుగున్!
అట్టి పాపమును నందుదు నేనును యా రాముని వని బొమ్మనినన్! 30

అన్నగారు గానకు బోవలెనని యలరి నేను గోరితి నేనిన్!
కపాలమును హస్తమున ధరించీ కడగి చినిగినా వస్త్రములన్!

బిచ్చమెత్తుకొను బిచ్చగాని వలె దుశ్చరిత్రుడగు బాపమునన్
అట్టి పాపమును బొందుదు నేనును యా రాముని వని బొమ్మనినన్! 31

ఆర్యుడు గానకు బోవలె నంచును నలరి నేను వాంఛించినచో
కామక్రోధముల వశుడై నిత్యము గడగి సప్త వ్యసనములందున్!
ఆసక్తుండగు నెట్టి భావమున నలరు నెట్టి పాపముచేతన్!
అట్టి పాపమును బొందుదు నేనును యా రాముని వని బొమ్మనినన్! 32

ఆర్యుడు గానకు బోవలె నంచును నలరి నేను వాంఛించినచో!
ధర్మమునందున బ్రవర్తింపకను దాన మపాత్రులకును జేయున్!
అధర్మ కార్యములను నిమగ్నుడగు నట్టి పాప మనుజుని బగిదిన్!
నేనును బొందుదు నట్టి పాపమును నిజముగ రాముని బొమ్మనినన్! 33

ఆర్యుడు గానకు బోవలెనంచును నలరి నేను వాంఛించినచో
సంపాదించిన ధన మంతయునూ నింపారగ చోరుల జేతన్!
అపహరింప బడునో భాపంబున యట్టి దుష్ట నరునకు వోలెన్
నేనును బొందుదు నట్టి పాపమును నా రాముని వని బొమ్మనినన్! 34

అన్నగారి నడవికి బొమ్మనుచో నలరి నాదు సమ్మతి యున్నన్!
సంధ్యాకాలములందు నిదురలో సరసత నుండెడి వానికెదో!
పరగృహంబులను దహించు వానికి బన్నుగ గలిగెడి పాపమెదో!
అట్టి పాపమును గలుగును నాకును యా రాముని వని బొమ్మనినన్! 35

పరభార్యా గమనము జేసిన యా ఘోర పాపికిని గలుగునెదో!
మిత్రద్రోహము జేసిన వానికి మిక్కిలి గలిగెడి పాపమెదో!
అట్టి పాపమును గలుగును నాకును యా రాముని వని బొమ్మనినన్!
అన్నగారి నడవికి బొమ్మనుచును నలరి నాదు సమ్మతి యున్నన్! 36

అన్నగారు వని బోవుట కొఱకై యలరుచు నే వాంఛించినచో
దేవతలకు మఱి పితృదేవతలకు దివిజార్చనలను జేయకనూ!
తల్లిదండ్రులకు శుశ్రూషలనూ దగ జేయని యాపాపికినీ!
ఎట్టి పాపములు గలుగునో నాకును నట్టి పాపములు జేకూరున్! 37

ఆర్యు డరణ్యము బోవుట కొఱకై నలరుచు నే వాంఛించినచో
సత్పురుషుల లోకములనుండి మఱి సత్పురుషుల కీరితి నుండి!
సత్పురుషుల కర్మల నుండియునూ సారహీనుడగు బాపివలెన్
నేనును బరి భ్రష్టుండను నగుదును నిజముగ రాముని బొమ్మనినన్! 8

దీర్ఘబాహువగు రామ చంద్రునీ దేవుని గానకు బొమ్మనినన్!
మాతృమూర్తి శుశ్రూషను విడిచీ మఱి మాలిన పనులందుననూ!
నిమగ్నుడగు దుర్మతికి గలిగెడీ నిందా పూర్వక బాపంబున్!
అట్టి పాపమును బొందుదు నేనును యా రాముని వని బొమ్మనినన్! 39

అన్నగారు నాయనుమతి చెప్పిన యరణ్యమునకును దోయినచో
బహుపుత్రులతో దారిద్ర్యముతో బహుజ్వర రోగ సమన్వితుడై
సతతము క్లేశము లందు మానవుడు మితములేని బాపంబుల చేన్!
అట్టిపాపమును బొందుదు నేనును యారాముని వని బొమ్మనినన్! 40

అన్నగారు నాయనుమతి తోడను నడవికి శీఘ్రము బోయినచో
దీనవదనమున దిక్కులు జూచుచు దేహి! యనెడి యర్థుల యాసల్
నిష్ఫలములుగా జేసెడి వానికి దుష్కర దురితంబులు వచ్చున్
అట్టి దురితములు నాకును వచ్చును నా రాముని వని బొమ్మనినన్! 41

అన్నగారు నా యనుమతి తోడను నా వనభూముల కేగినచో!
చాడీలను జెప్పుచు దిరుగుచునూ సరసత్వంబును లేకయునూ!
అపవిత్రుండై, యధర్మాత్ముడయి యారాజునకును భయబడుచున్
దిరిగెడివానికి గలుగునౌ పాపము దీఱగ నాకును గలుగునుగా! 42

అన్నగారు నడవికి బోవుటకై యనుమతించి నే బొమ్మనినన్!
ఋతుస్నాతయునగు బతివ్రత భార్యను ఋతుకాలము బాటించునదీ
అట్టిసతిని గలియని దుష్టాత్మకు నిట్టిగలుగునో పాపంబున్!
అట్టి పాపమును నాకును గలుగును యారాముని వనిబొమ్మనినన్! 43

ఆర్యు డడవికిని బోవుట కొఱకై యనుమతించి నే బొమ్మనుచో
ధర్మమునం దాసక్తిని వదులుచు ధర్మదార నట విడనాడి!

పరదారల సంగమము జేసినా పాపికెట్టి పాపము దగులున్
అట్టిపాపమును నేనును బొందుదు నా రాముని వని బొమ్మనినన్! 44

ఆర్యుదరణ్యము బోవలెనంచును ననుమతించి నే బంపినచో
సంతానంబును బొందని విప్రుడు దగ తా జేసిన బాపమునన్!
సంతులేక వేదనను బొందెడి యంతములేని శోకముతో
అట్టి వేదనను నేను బొందుడును యారాముని వని బొమ్మనినన్ 45

అన్నగారు వని బోవుట కొఱకై యనుమతించి నే బంపినచో!
త్రాగు నీరమును దోషము జేసిన ప్రీగు మానవుడు బాపమునన్!
ఇతరులకును విషమిచ్చిన వానికి యెంతటి బాపము గలుగు నాకో!
అంతటి బాపము గలుగును నాకును యారాముని వని బంపగనూ! 46

విప్రుని కొఱకై సిద్ధము జేసిన విమలభూజ జెఱచెడి వాడున్!
లేగకు మిగులక పాలనన్నియును లీలగ బిదికెడి దుర్మతియున్!
ఎట్టి పాపముల బొందెదరో మఱి అట్టి పాపముల బొందుదునూ!
ఆ శ్రీరాముడు వని బోవుటకై యనుమతించి నే బంపినచో! 47

అన్నగారు వని బోవుట కొఱకై యనుమతించి నే బంపినచో!
దప్పికచే డస్సిన మానవునికిని దయతో జలముల బోయకనూ!
ఉన్నను లేవని జెప్పెడి వానికి యురుతరమగు బాపము వచ్చున్
అట్టి పాపమును బొందుదు నేనును యారాముని వని బొమ్మనినన్! 48

అన్నగారు వని బోవలెనంచును ననుమతించి నే బంపినచో!
రెండు పక్షములు గలహము తోడను దండిగ పోరాడుచు నుండన్!
విడదీయక చోద్యమును జూచు నా జడుని కెట్టి పాపము గలుగున్
అట్టి పాపమును నాకును దగులును నారాముని వని బొమ్మనినన్! 49

పార్థివాత్మజుడు భరతు డంతటను బరిపరి విధముల బలుకుచునూ!
పతిపుత్రులకును దూరమైన యానతి కౌసల్యను వేదనతో!
ఓదార్చుచునే దుఃఖార్తుండై యోరిమి గోల్పోయెను దానున్
నేలపైని బడి మోహము నందెను నిఖిల సద్గుణుడు భరతుండున్! 50

కష్టమైన శపథముల తోడనూ నిష్ఠ వచనముల బలుకుచునూ!
నేలవడిన యాభరతుని తోడను కలికి కౌసల్య యిటు లనియెన్
'పుత్రా! యీవిధి శపథంబులనూ పొలుపుగ జేయుచు దుఃఖంబున్!
అధికము జేయుచునుంటివి జీవము నడలిపోవుచున్నది గదరా! 51

ధర్మమార్గమును జలింప లేదుగ ధర్మ ప్రతిజ్ఞుడవును నీవున్!
పుణ్యవశంబున నీ మనస్సునను బొలుపుగ నిలిచెను ధర్మంబున్!
సత్పురుషుల లోకమును బొందుమా! సహలాలిత లక్ష్మణు తోడన్!
ఆ శ్రీరాముని తమ్ముడవు గదా ! యా గుణములు నీకును వచ్చెన్! 52

భ్రాతృ వత్సలుండైన భరతుతో బన్నుగ యిటులను బలుకుచునూ!
ఆ కౌసల్యయు నా భరతుని దా నలరుచు నొడి గూర్చొవజేసీ
కౌగలించుకొని కడు వేదనతో కన్నకుమారుని దలచుకొనీ!
కన్నీటిని యొలికెను గాలువగా చిన్నికొలను నిండెనొ యనగా! 53

భరతుండును విలపించుచు మనసున బరి వేదనలను నిండుకొనీ
మోహముజేతను దుఃఖము జేతను మోహ సముద్రమునను మునిగెన్!
విలపించుచు చైతన్య రహితుడై విమలత్వంబును గోల్పోయెన్!
మాటిమాటికిని నిట్టూర్పులతో మఱి యారాత్రియు నట దొరలన్!

(అయోధ్యాకాండములోని 75వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## (డెబ్బది యాఱవ సర్గము)

## (దశరథ మహారాజు దహన సంస్కారము)

శోకసంద్రమున మునిగిన భరతుని జీకునుండి యోదార్చుచునూ!
శ్రేష్ఠ వాక్కుగల వసిష్ఠ దేవుడు చిత్తము రంజిల నిటులనియెన్!
రాజపుత్ర! ఓ భరతకుమారా ! రహి దుఃఖింపకు మిక జాలున్!
రాజున కుత్తర కర్మల జేయుము రమ్య పుణ్య ఫలములు గలుగన్! 1

వసిష్ఠు మాటలు విని యాభరతుడు నొప్పుగ ధీరత మదిబొంది!
ప్రేతకార్యముల భక్తిని జేయగ ప్రీతి బూనుకొనె వేగముగన్! 2

అంతట భరతుడు మృతుడగు దండ్రిని చింత వీడి తైలద్రోణిన్!
పచ్చబడిన ముఖమును గలవాడును ప్రసుప్తు వలె గనబడువానిన్!
రత్నభూషితంబగు శయనంబున రహి పరుండగా జేసియునూ!
సుదుఃఖితుండై విలపించెను నట శోకము నందగ నందఱునూ!

'నే రాకుండగనే గతించితివి! నిఖిల ధర్మవిదు డా రామున్!
లక్ష్మణు సహితము వని బంపితివి శిక్షించితి విటులను నన్నున్!
ఎట్టి నిర్ణయము జేసినావుగా గట్టిడి దప్పియు నీ విధమున్!
లోకనింద నను బడద్రోసితివి! శోకము నను ముంచితి విటులన్! 4

అక్లిష్ట కర్మణు డగు రాఘవుడును నరయ దాపునను లేడుగదా!
దుఃఖార్తుడనగు నన్నిట విడిచీ దూరమెచ్చటికి బోయెదవూ?
మహారాజ! స్వర్గమునకు బోతివి! మా రాముడు గానకు జనియెన్!
కోసలదేశపు యోగ క్షేమములు గూడిమి జూతురు నెవ్వరిలన్? 5

నీవులేని యీ రాజ్యమంతయును నిర్జన భూమిగ ననిపించెన్!
చంద్రుడు లేని చీకటి రాత్రిగ యింద్రుడు లేని దివి వోలెన్!
ఈ విధి భరతుడు దీనమనస్సున నిమ్ముగ విలపించుట గాంచీ!
వసిష్ఠుడంతట పలికె భరతుతో నొప్పుగ సౌమ్య సువచనములన్! 6

మహాబాహూ! రాజునకును జేయుము! మహాభక్తి నీకార్యములన్!
అవ్యగ్రుడవై యవిచారితముగ నాలోచనలును లేకుండన్!
అంతట భరతుడు వసిష్ఠుతో ననె 'అటుల జేసెదను!' అని మఱియున్
ఋత్విజులను పౌరోహితులను వే సత్వరమని తొందర వెట్టెన్!
అగ్ని గృహమునను బైటకు దెచ్చిన యగ్నులు రాజుకు జెందినవీ!
పురోహితులు మఱి యాచార్యులునూ పొలుపుగ గ్రహియించిరి వేగన్!
అంతట పరిచారకులు శోకమున నంత జిందుచున్న నా రాజున్
చిన్న శిబిక యందెక్కించుకొని జెర మోసికొని బోవంగన్!
వెండి బంగరపు నాణెంబులునూ దండి పట్టు వస్త్రంబులునూ!
మార్గమ్మున విరజిమ్ముచు బోయిరి మహారాజు నెదుటను బ్రజలున్!
కొందఱు దెచ్చిరి చందనంబులను గొందఱు నగురువు గుగ్గిలమున్!
కొందఱు బద్మక దేవదారువులు గొందఱు సుగంధ ద్రవ్యములన్
భక్తితోడ నట దెచ్చి వేసిరీ చిత్తము గౌరవమును దొలుకన్!
అంతట పౌరోహితులు ఋత్విజుల్లు నాచార్యులు న్నే గూడికొనీ!
రాజు కళేబరమం దుంచిరిగా రహో భక్తిని చితి మధ్యమునన్
రాజ ఋత్విజులు వేద మంత్రముల రాజు నగ్ని హోమము జేసీ!
జపించి రంతట సామగానమును శాస్త్రరీతి జరిపించి రటన్!
ఆసమయంబున రాజు భార్యలును నర్హత వాహనముల మీదన్!
పల్లకీలలో వృద్ధుల తోడను బన్నుగ వచ్చిరి యచ్చటికిన్!
అంతట ఋత్విజులును బ్రాహ్మణులును నల కౌసల్యా స్త్రీ లంతన్!
ఆహితాగ్నియు నగు రాజున కప్పుడు నప్రదక్షిణము గావింపన్!
ఆ సమయంబున దుఃఖ బీడితల యతి దీనంబగు రోదనలన్!
క్రౌంచపక్షులా వేదన ధ్వనివలె యంచితముగ యట వినిపించెన్!
వశముదప్పి శోకించుచున్న యా వరాంగనామణు లడలుచునూ
సరయూనది తీరమును జేరికొని సరగున వాహనములు దిగిరీ!
రాజస్త్రీలు. మంత్రులు, బురోహితులు రహి భరతునితో బాటుగనూ!
జలదర్పణములు జేసిరి రాజుకు జాలువారు శ్రద్ధాభక్తిన్!
కన్నీరును నిండిన కన్నులతో గడగి పురంబును జేరికొనీ
నేలను బరుండి పది దినంబులును జాల కష్టమున గడిపి రటన్!

(అయోధ్యా కాండమునందు 69 సర్గము సమాప్తము)

# అయోధ్యకాండము - రెండవ భాగము

## డెబ్బదియవ సర్గము

భరతుడు తండ్రి శ్రాద్ధమున బ్రాహ్మణులకు ధన రత్నాదులను దానముచేయుట—అస్థి సంచయన కార్యక్రమము—భరత శత్రుఘ్నులు విలపించుట—వసిష్ఠుడు, సుమంత్రుడు వారిని యోదార్చుట

దశాహములు గడిచిన వగుచుండగ తగ కృతశౌచము జేసికోనీ!
పండ్రెండవ దినమున యా భరతుడు బరగ శ్రాద్ధకర్మను జేసెన్!
తండ్రి శ్రాద్ధ సమయమున భరతుడును దగు భోజనములు వస్త్రములున్!
రత్నములును, ధనములు ధేనువులును దానము జేసెను విప్రులకున్! 1

తండ్రి పారలౌకిక క్రియలందున తగ, తెల్లని మేకల మందన్
వందలకొలదీ పాడి యావులను వాహనములు దానము జేసెన్!
విశాలమైన గృహంబులను మఱి వివిధ దాస దాసీ జనమున్!
విప్రుల కంతట దానము జేసెను వినయ వంతుడగు భరతుండున్! 2

పదమూడవ దినమున యా భరతుడు ప్రాతఃకాలంబున యందున్!
అస్థిసంచయనము జేయుటకై యరిగెను స్మశాన స్థలమునకున్!
మహోజానుడగు నా భరతుండును మఱి మఱి మూర్ఛలు జెందుచునూ
గద్గద కంఠముతో విలపించెను గంతమెత్తి బహు బిగ్గఱగా! 3

తండ్రీ! నను నీ వే రామునకును దగ స్వాధీనము జేసితివో!
అట్టి రాముడిపు డరణ్యంబునకు నరిగినాడు గద! నీ చేతన్!
శూన్యమందు న న్నిపుడొదిలితివి! క్రుక్కుచుంటి నే నొంటరిగా!
రెక్కలు విఱిగిన పక్షికి వలె నే రిక్కవోలె బడుచుంటి ధరన్! 4

అనాథయగు కౌసల్యకు గతియగు నా రాముని వని బంపితివీ!
ఆమెను విడిచీ యెచటకి బోతివి? యామెకు దిక్కెవ్వరు నిపుడున్?
అస్థులు దగ్ధము కాగా భస్మము నరుణకాంతులను జిమ్ముచునూ!
ఉన్న స్థానమండలమును గాంచుచు నుర్విని బడి బిగ్గఱ నేడ్చెన్! 5

చితాభస్మమును జూచి యేడ్చుచు జింతాకులుడై యేడ్చుచునూ!
యంత్ర బద్ధమగు నింద్ర ధ్వజముగ వింతగ నేలను బడిపోయెన్!
అంత్యకాలమున క్రింద పడిన యా యయాతి జుట్టిన ఋషులవలెన్!
చుట్టు ముట్టిరీ మంత్రులు ద్విజులును శూరుడైన భరతుని వేగన్! 6

శత్రుఘ్నుండును భరతుని జూచి నార్తముతో బహు శోకముతో
తండ్రియైన రాజును స్మరించుచును దగ మోహంబున నేలపడెన్!
తండ్రి గుణములను నవయవంబులను దగు విధమున స్మరియించుచునూ!
ఉన్మత్తునివలె ప్రలాపించుచును నుచ్చ కంఠమున శోకించెన్! 7

మందరనుండీ పుట్టినదియునూ మఱి కైకేయీ నక్రముచే
కలత పెట్టబడి వరదాన మనే కలతబెట్టబడు సంద్రంబున్!
అందఱినీ యది ముంచివేసినది యటునిటు నేమియు లేకుండన్!
తండ్రీ! నీవెటు బోయినాడవో దయ యింతయు లేకుండగనూ! 8

తండ్రీ బాలుడు సుకుమారుండును సదా లాలితుడు భరతుండున్!
ఈ రీతిని విలపించుచుండగా నెటకు జనితివో విడిచి మమున్!
భోజ్య పానములు, వస్త్ర భూషలును భూరి వస్తు సముదాయంబున్!
ఇచ్చెడి వాడవు నెవరు నిత్తురిక నెవ రా విధి జేయగ జాలున్? 9

ధర్మజ్ఞుండవు, మహాత్ముండవగు ధరణీశ్వర నీవును లేనీ!
ఈ ధరిత్రి చీలిక కావలసెను నిటులగాక యది నిలిచినదీ!
తండ్రి గతించెను రాముడు వని జనె దగ బలమెచ్చట జీవింపన్?
హుతాశనుని నే నాశ్రయించెదను హతాశుడగుదును వేగముగన్! 10

ప్రియ సోదరుడును, దండ్రియు లేనీ శూన్యమైన యా యయోధ్యకున్
కాలిడబోవను దపోవనంబును గడిగి ప్రవేశింతును వేగన్!
వారిద్దఱి యాలాపంబులు విని వచ్చిపడిన యా యాపదనూ!
జనులందఱు గని విచారించిరీ జార్చిరి వేగము గన్నీరున్! 11

అటుబిమ్మట యా విషణ్ణులైనా యా భరతుడు శత్రుఘ్నుడునూ!
కొమ్ములు విరిగిన వృషభంబులవలె నిమ్ముగ దొరలిరి భూస్థలిపై!

అంత వసిష్ఠుడు భరతకుమారుని చింత దీర్చుచును నిటు లనియెన్
నేల దొరతెడి రాజకుమారుని నేల నెత్తి మృదు వాక్యములన్! 12

భరతకుమారా! తండ్రి గతించిన పదుమూడవ దిన మిది సుమ్మా!
అస్థిసంచయము మిగిలియున్నదీ యాలస్యము జేయుదు వేలా?
ఆకలి దప్పులు, సుఖదుఃఖంబులు నరయ జరా మరణంబులునూ
సర్వ ప్రాణులందున వర్తించును సదా భేదమేమియును లేకన్!
పరిహరింపరానివి ప్రాణుల కివి బన్నుగ యీజంటలు మూడున్

అట్టిస్థితిని నీ విటు శోకించుట నరయ న్యాయమగునా! పుత్రా!
తత్త్వ వేత్తయగు సుమంత్రుండునూ తగ శత్రుఘ్నుని లేపుచునూ!
సకల జీవులకు జనన మరణములు సహజ సిద్ధమని బోధించెన్!
పుడమినుండి లేచిన వారిడువురును భూరి వర్షమున యెండకునూ!
రంగుమారినా యింద్రధ్వజముగ రాజించిరి యా రాకొమరుల్! 14

తుడుచుకొనుచు గన్నీటిని వేగము దొణికెడి గద్గదస్వరములతో
రాజకుమారులు నమాత్యులును మతి రహి ఋత్విజు లాచార్యులునూ!
మిగిలిన బనులను జేయ దొడంగిరి మేదినీశు సంత్యక్రియలన్
శాస్త్రోక్తముగా విధి విధానముగ సర్వము జేయ దొడంగి రటన్! 15

(అయోధ్యాకాండములోని 77వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము - రెండవ భాగము

## డెబ్బది యెనిమిదవ సర్గము

[శత్రుఘ్నుని కోపము — కుబ్జనుబట్టి యీడ్చుట — భరతుడు వారించుట]

రాముని యొద్దకు బోదలచెడి యా రామానుజుడగు భరతునితో!
లక్ష్మణానుజుండగు శత్రుఘ్నుడు లాలితముగ భరతునితో వలికెన్!
సర్వభూతముల గతియగు రాముడు సర్వప్రజల ప్రియ భాజనుడున్!
ఒకస్త్రీ కోరికపైని బంపబడె నొప్పుగ కానల భూములకున్! 1

బలవంతుడు మఱి వీర్యవంతుడును బాహుబలాఢ్యుడు లక్ష్మణుడున్!
రాజును నెదిరించుచు శ్రీరాముని రక్ష నేయలే దెందుకనో!
స్త్రీవశుడగు నా దశరథరాజును శీలము, న్యాయాన్యాయములన్!
పరీక్షించి ముందుగనే యాపిన బాగుండెడి దంతయు మఱియున్! 2

లక్ష్మణానుజుండగు శత్రుఘ్నుడు లాలితముగ బలుకుచు నుండన్
సర్వాభరణంబుల భూషితయై సఖియలతో మందర నిలిచెన్
చందన సారములను బూసికొని చారువస్త్ర మణిభూషలతో
అనేకవిధముల యలంకారముల నలంకరించుక నిలువబడెన్! 3

చిత్రమైన వడ్డాణంబులతో చిత్ర చిత్ర భూషణములతో!
తూర్పు ద్వారమున నిలిచిన మందర తోలు బొమ్మవలె గనిపించెన్!
త్రాళ్ళచేత బంధింపబడిన యా తగ వానరముగ కనిపించెన్!
ధరించినా యా వస్త్రభూషలును దగ సిగ్గును బొందుచు నుండెన్! 4

అచటినుండి యా ద్వారపాలకులు నా మందరనూ బట్టుకొనీ!
శత్రుఘ్నుని పద్దకును దెచ్చిరీ కరుణలేని కుబ్జను నపుడున్!
ఎవతె మూలమున తండ్రి గతించెనా యెవతె మూలమున రాఘవుడున్
వని జనె యా స్త్రీ యిది గిది గిదిగో! వలనొప్పుగ శిక్షింపు మికన్! 5

భృశ దుఃఖితుడును, ధృఢవ్రతుడును నగు వశముదప్పి శత్రుఘ్నుండున్!
అంతఃపుర వాసులతో నిట్లనె చింతతోని కఠినోక్తులతో!
మా సోదరులకు మా తండ్రికినీ మహోపకారియు నగు గుబ్జన్
తగిన శిక్ష నే విధింతు నిపుడే దా జేసిన చెడు కర్మకునూ! 6

అటుల వలికి యా శత్రుఘ్నుండును యా కుబ్జను వే బట్టుకొనన్
సఖీజనముతో గూడిన యామెయు సరగున యేడ్చెను గొల్లుమనీ!
శత్రుఘ్నుడు గోపించె ననియునూ సఖియ లందఱును భయవడుచున్!
నలు దిక్కులకును బారిపోయిరీ విలవిల మంథర నట వదిలీ! 7

శత్రుఘ్నుని బోకడ జూడగ మఱి సఖియల నందఱ బట్టుకొనీ!
ఊచకోత కోయునొ యేమో యని యూహించిరి యా సఖియలునూ!
సానుక్రోశమును, వదాన్యురాలగు సర్వ ధర్మముల దెలిసిన యా
కౌసల్యను శరణమును వేడుదము గరుణ బ్రోచు మన లందఱినీ! 8

అంతట శత్రుఘ్నుడును మంథరను కాంత యనక బహురోషముతో!
జుట్టుబట్టుకొని బరబర యీడ్చెను బిట్టుగ నేడ్వగ కుబ్జయునూ!
మంథర నా శత్రుఘ్న కుమారుడు గందగ బిరబిర యీడ్వగనూ!
అలంకార సముదాయ మంతయును అటు నిటు రాలెను భూస్థలిపై! 9

మంథర దాల్చిన యలంకారములు మఱి నేలను రాలుట చూడన్!
శరత్కాల గగనమువలె నుండెను చారు చంద్ర తారల శోభన్!
ఈ విధమున శత్రుఘ్నుడు గుబ్జను నీసడించి యా కైకేయిన్
భయవెట్టుచు నిందా వాక్యములను బరుషముగా బలుకగ దొడగెన్! 10

కైకేయియు బహు దుఃఖితురాలై కడు నాపద శత్రుఘ్ననిచే
వచ్చుననుచు బహు భీత చిత్తమున వచ్చి భరతు శరణము వేడెన్!
క్రుద్ధుడైన యా శత్రుఘ్నునితో గూర్మి భరతు డిటులను పలికెన్!
సర్వభూతముల యందును స్త్రీలను సరగున జంపగ రాదు సుమా!
క్షమియింపుము నీమెను సహనముతో సర్వజనులు నిను మెచ్చుకొనన్! 11

ధర్మాత్ముడు నగు రామసంద్రుడును దగ నిగదింపక యుండినచో
మాతృ హంతకుడనని గోపింపక మఱి మాటాడక యుండినచో
దుష్టచారిణియు బాపాత్మయునగు గష్ట జరిత్రయు గైకేయిన్!
యమలోకమునకు బంపెడివాడను మమత యింత లేకుండగనూ! 12

కుబ్జను జంపిన పని యా రాముడు గూర్మిని మదిలో జింతిలుచున్!
నిను నను గూడను దిరస్కరించును నిశ్చయ మిది బలుకడు గూడన్!
భరతుని మాటలు విని శత్రుఘ్నుడు విరమించెను గ్రోధమునుండీ!
మంథర నంతట విడిచి బొమ్మనెను మంథర విలపించుచు బోయెన్! 13

ఆ మంథరయును నడలుచు బోయీ యా కైకేయీ పాదములన్!
బడి విలపించుచు నిట్టూర్పులతో బహు దీనత వేదన తోడన్!
శత్రుఘ్నుని చే నీడ్వబడిన యా సఖియ కుబ్జగతి బరికించీ!
క్రౌంచపక్షివలె విలపించుచు మఱి కరుణ పాదములపై బడినా
మంథర నంతట యా కైకేయియు మంచి మాటలను నోదార్చెన్! 14

(అయోధ్యా కాండమునందు 78వ సర్గము సమాప్తము)

* ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## డెబ్బది తొమ్మిదవ సర్గము

మంత్రులు మున్నగువారు భరతుని రాజ్యము స్వీకరింపుమని కోరుట - రాముడే రాజ్యాధికారియని భరతుడు బలుకుట

అంతట బదునాల్గవ దినంబునను చెంత జేరి యా భరతునితో
రాజామాత్యులు నిటుల బలికిరీ రమ్యముగా మధురాక్షరముల్!
పూజ్యుడైన యా దశరథేశ్వరుడు బుణ్య లోకములకును నేగెన్!
రామలక్ష్మణులు వనమున కేగిరి రహి పితౄజ్ఞను బాలింపన్! 1

రాజకుమారా! రాజవు గమ్మా! రహి మాప్రజ కండఆ కివుడున్!
రాజులేని యీ రాజ్యము నందున రవరవలును బ్రబలును వేగన్!
దైవ వశంబున యరాజకం బిల యావరింపగను లేదింకన్!
ఆలస్యము జేసినచో గలుగును నట్టి యుపద్రవ బాధ లిలన్! 2

నృపాత్మజా! నీ స్వజనులందఱును నేమముగా సకల బ్రజలున్
అభిషేకమునకు వలయు వస్తువులు నటుగొని నిలిచిరి సీ కొఱకై!
పితృ పితామహ క్రమమున వచ్చెడి ప్రీతిని గొను మీ రాజ్యంబున్!
అభిషిక్తుడవై మము బాలింపుము నఖిల జనంబులు గీర్తింపన్! 3

దృఢవ్రతుడగు నా భరతు డంతటను నతిభక్తిని వారల కనియెన్!
అభిషేచనికము లగు వస్తువులకు నాత్మ బ్రదక్షిణ జేయుచునూ!
మా వంశంబున జేష్ఠపుత్రుడే మహి నేలును! ఆచారమిదీ'
అన్నియు దెలిసిన మీరిటు బలుకుట యాజ్ఞ యిచ్చుటిది యుక్తంబా? 4

జ్యేష్ఠ సోదరుండగు శ్రీరాముడు జిరకాలము బాలించు ధరన్!
పదునాలుగు వర్షములు గానలను బన్నుగ నుందును ముని వోలెన్
రథ గజ తురగ పదాతి దళంబును రయమున గూర్పుడు వేగమునన్
వనమునుండి రాముని గొనివచ్చెద జనమందఱు ధర ముదమందన్! 5

అభిషేకమునకు వలయు వస్తువులు నన్నియు గైకొని కానలకున్!
శ్రీరాముని వేగొని వచ్చుటకై శ్రీకరముగ నే బోయెదనూ!
అచ్చటనే నే యభిషేకించెద యా రాముల వనభూములలోన్!
యజ్ఞమునుండీ యగ్నివోలె నే నా శ్రీరాముని గొనివత్తున్! 6.

నాదు దల్లియను బేరు పెట్టుకుని నయముగ నున్నా కైకేయిన్!
ఈమె కోర్కి నే సఫలము జేయను నిమ్మగ నే వని బోయెదనూ!
భావికాలమున రాజగు రాముడు రమ్యముగా బాలించు భువిన్!
పయనంబునకును సకల కార్యములు బన్నుగ జేయుడు! వే వేగన్! 7.

ఎత్తుపల్లములు నున్న స్థలములను నింపుగ సరిజేయగ వలయున్!
దుర్గమమగు నా ప్రదేశమందున దుర్గమ రక్షకులును వలయున్!
రాముని విషయము నందున భరతుడు రమ్యముగా బలుకుట వినియున్!
సకల జనులు శోభాయుక్తముగా సరసముగా బలికిరి నిటులన్! 8.

శ్రేష్ఠుడైన శ్రీరాముని యెడలను నిష్టముగా బలికెడి నిన్నున్!
శ్రీకరముగ శ్రీలక్ష్మి దేవియు స్థిరముగ నిను జేరును గాతన్!
నృపాత్మజుని బలుకులు విని ప్రజయును నిర్మలులై తమ నేత్రములన్
ఆనందాశ్రువులను నొలికిరి యట యభినందించిరి నృప దనయున్! 9.

అమాత్యులును మఱి సభాసదులునూ నా భరతుని పలుకులు వినియున్!
సంతోషించుచు బలికి రిట్టులను సర్వము సిద్ధము నరశ్రేష్ఠా!
నీ యాజ్ఞను మఱి శిల్పకారులును నిర్మాణము జేయగ పథమున్!
నియమించితి మాదేశించితి మని నిఖిల బరిషదులు బలికి రటుల్! 10.

(అయోధ్యాకాండము 79 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము — రెండవ భాగము

## ఎనుబదియవ సర్గము

[అయోధ్య నుండి గంగాతీరము వఱకును సుఖకరమగు రాజ మార్గమును నిర్మించుట]

అటుపిమ్మట యా ప్రదేశమందలి యాభూమిని దెలిసిన వారున్!
సూత్రకర్మలును గార్య శూరులును యాంత్రికులును గర్మాంతకులున్!
వడ్రంగులు బాటలు నిర్మించెడి వలనొప్పగ బహు శిల్పులునూ!
వృక్షంబుల చేదించువారునూ వివిధ సాధనములను బూని! 1

బయలుదేరిరీ కూపకారులును బహు సమర్థులును వేవేగన్!
పర్యవేక్షకులు బరిశోధించుచు బయలు దేరిదీ ముందుగనూ!
సంతసమున నడిచెడి యా జనములు వింతగ కన్పట్టెను నచటన్!
పర్వమునందున సంద్రమునకు వలె బన్నుగ నుండెను దృశ్యంబై
బాటలు వేసెడి కర్మకారులును బహువిధ సాధనముల తోడన్
ముందు బయలుదేరిరి ఒక గుంపుగ యందమొప్ప యుత్సాహముతో! 2

తీగెలు పొదలును బెద్ద శిలలనూ దీరుగ తొలగించుచు వారున్!
అనేక వృక్షములను దొలగించుచు నలరగ విర్మించిరి పథమున్! 3

చెట్లులేని యా ప్రదేశమందున చెట్లను నాటిరి వే వేగన్!
గొడ్డళ్ళను, నులులను, అంపములను గూర్మి వేసిరీ వృక్షములన్!
బలవంతులు వీరణ స్తంభములును బహునేర్పున దొలగించి రటన్!
నడువ శక్యమునుగాని స్థలములను నడువ చదును జేసిరి వేగన్! 4

కొందఱు నూతుల బూడ్చివేసిరీ కొందఱు బోదవగు గోతులనూ!
మఱికొందఱు సమములుగ జేసిరీ మనుజులు నడవని పల్లములన్!
కట్ట దగిన కట్టడములను గట్టిరి యిట్టె శిల్పు లా సమయమునన్
బ్రద్దలు గొట్టగవలయు వాటినీ బ్రద్దలు గొట్టిరి త్వరితగతిన్!

అచిరకాలమున యుదకము గలపీ యనేక యాకృతులు గలపీ!
సంద్రమువంటి యాకారముగల సరసులు నిర్మించిరి దారిన్!

నీరు లభింపని యా ప్రదేశమున నిర్మలమగు శ్రేష్ఠములైనా
నూతులు త్రవ్వించిరి వేగముగా రాత్రులు బవళులు నని యనకన్! 6
సేన నడుచు నా మార్గము నందున శీఘ్రము జేసిరి చదునుగనూ!
సున్నముతో దను బంకమన్నుతో జూడ ముచ్చటగ కార్మికులున్!
వృక్షములన్నీ పుష్పించినవీ పక్షులు గూయుచు నుండె మఱిన్
మార్గమంతయును దోరణములతో మఱి పతాకముల విలిపి రటన్! 7
చందనోదకములను దడిపి రటన్ అందముగా నా మార్గములన్!
వివిధ పుష్పములు రాలెను జెట్లను వింత గూర్చుచుండెను బథమున్!
సురలు నడుచు మార్గము వలె నుండెను సురచిరముగ నా మార్గమునూ!
చింతనింతలగు నలరింపులతో గాంతులతో సేనా పథమున్! 8
ఆయా యధికారులును వేగమున యా భరతుని యాజ్ఞను దాల్చి!
ఆయా పనులను జేయుట కొఱకే యా యా వారల నియమించీ!
మధుర ఫలంబులు దొరుకు బ్రదేశము మంజులంబులగు స్థలములనూ!
భరతుని కొరకై కట్టిరి గృహముల మహనీయత తొణికిసలాడన్! 9
జ్యోతిష శాస్త్రమునందు వేత్తలగు జ్యోతిని గాంచెడి వారంతన్!
మహాత్ములగు నా శాస్త్రవేత్తలును మహాయశుండగు భరతునికై!
సైన్య శిబిరముల స్థాపించిరి యట సరసత మార్గమునంతటనూ
ప్రశస్తంబులగు నక్షత్రములను ప్రశస్త ముహూర్త లగ్నములన్!
ఇసుక కుప్పలును బరిఘలునూ మఱి యింద్రకీల బర్వతములనూ!
ప్రాసాదంబులు బ్రాకారములును బహుమార్గములును నిర్మితమై!
ఆ ప్రాసాదములును శిఖరంబుల నాకాశంబున నున్నటులన్!
ఆ ప్రదేశములు నింద్ర నగరివలె నలరుచు గాంతులు శోభించెన్! 11
ఇరుప్రక్కల వృక్షంబుల తోడను నింపగు నరణ్యముల తోడన్!
శీతలాదులా తోయంబులనూ చిరశాంతిని సమగూర్చునదీ!
గంగానది వలకును మార్గంబును రంగుగ వ్యాపించియు నుండెన్!
ఉత్తమ శిల్పులు విర్మించినదియును జిత్తము రంజిల జేయునదియున్;
చంద్ర తారలను గూడిన గగనము సాంద్రదీప్తివలె శోభించెన్! 13

(అయోధ్యకాండములోని 80వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## ఎనుబది యొకటవ సర్గము

[ప్రాతఃకాలమున మంగళ వాద్యములువిని భరతుడు దుఃఖించుట-
వశిష్ఠుడు సభకు వచ్చి మంత్రులను బిలువ నంపుట]

అంతట వేకువ సూత మాగధులు సలరుచు వాక్య విశేషములన్!
మంగళ సహితంబగు బదములతో సంగతి భరతుని స్తుతియింపన్!
బంగరు దండము తోని గొట్టుచును రంగుగ దుందుభి మ్రోగించి
శంఖనాదములు వివిధ వాద్యములు చారులీల మ్రోగించి రటన్! 1

దివమును నింపెడి తూర్య ఘోషములు దిక్కులన్నియును ధ్వనియింపన్!
శోకదపితుడగు భరతు డింకనూ శోకముచే బీడింప బడెన్!
అంతట భరతుడు రాజును గానని యా సూతులతో బలుకుచునూ
తూర్య ఘోషములు నిలిపివేసి యనె వీరుడైన శత్రుఘ్నునితో! 2

శత్రుఘ్నా విను! కైకవలన మఱి జగతికెంత యాపద వచ్చెన్!
తండ్రి తనదు దుఃఖము లన్నియునూ తగ నాపై నిడి దివి కేగెన్!
దశరథ రాజుకు ధర్మరీతిగా దగ వచ్చిన యీ రాజ్యంబున్
అకర్ణికయునగు నావకువలెనూ యాటు పోటులను జేరినదీ! 3

మన కందఱికిని రక్షకుడగు యా మహితాత్ముడు రాముని గూడన్!
ధర్మ హీనయగు కైకేయీ సతి దా బంపెనుగా వనములకున్!
ఈ రీతిని విలపించుచు భరతుడు నిలపైబడి మూర్ఛను బొందన్!
స్త్రీలందఱు నట గొల్లున యేడ్చిరి చిత్తశాంతి గోల్పోవంగన్! 4

భరతు డీ విధము మోహమునెందీ బహు వేదనలను నుండగనూ!
మహాయశుండగు వసిష్ఠు డొచ్చెను మహారాజు భవనంబునకున్!
స్వర్ణ రత్నముల నలంకృతంబై స్వర్గ దేవసభకును వోలెన్!
సుధర్మకును వలె నున్న యాసభకు సురగురువునకును వలె వచ్చెన్! 5

సకల వేదములు దెలిసిన యా ఋషి సరస స్వర్ణ పీఠిక యందున్!
అధిష్ఠించి దూతలను శీఘ్రముగ యాజ్ఞాపించెను నీ రీతిన్!

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనూ మఱి ఐన్నుగ మంత్రుల యితరులనూ!
వేగముగా గొనిరండి వారితో విశదముగా భాషింపవలెన్! 6

రాజభృత్యులను శత్రుఘ్నుని మఱి రమ్యకీర్తి భరతుని వేగన్!
యుధాజిత్తునూ, సుమంత్రు మంత్రిని యధావిధిని బిలువగ వలెనూ!
అంతట వసిష్ఠు నానతి చొప్పున యందఱు రథగజ తురగములన్
వచ్చుచుండ కోలాహల శబ్దము హెచ్చుగ వినబడియెను నచటన్! 7

వచ్చుచున్న యా భరతుని గాంచీ వరుసగ యమాత్యులును, ప్రజలున్!
దశరథునికి వలె, సురరాజుకు వలె దగ జేసిరి యభివందనముల్!
దశరథ సుత శోభితమగు నాసభ దశరథు గూడినదియును వోలెన్!
యధాపూర్వముగ ప్రకాశించెనూ తథా యిపుడు భరతుని తోడన్!

(అయోధ్యాకాండములోని-81వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## ఎనుబది రెండవ సర్గము

రాజ్యాభిషిక్తుడవు గమ్మని వసిష్ఠుడు భరతుని ఆజ్ఞాపించుట—భరతుడు అంగీకరింపకుండుట—శ్రీరాముని గొని తెచ్చుటకై బయలు దేరుడని అందఱిసీ ఆజ్ఞాపించుట

బుద్ధి శాలియగు భరతుడు గాంచెను బూజనీయమగు నా సభనూ!
పూర్ణ చంద్రు డుత్తమ గ్రహములతో బొలుపుగ నుండిన రాత్రివలెన్!
సభ్యులందఱును దగు నాసనముల సరసరీతి గూర్చుండి రటన్!
వస్త్రభూషలను నంగరాగముల వన్నెలు జిందెను నా సభలోన్! 1

విద్వజ్జన సంపూర్ణమైన యా విమలమైన సభ తేజమునన్
పూర్ణచంద్రునీ గూడికొనిన యా పూర్ణిమ రాత్రిగ శోభించెన్!
దశరథేశ్వరుని యమాత్యు లందఱు డగ సచ్చోటికి విచ్చేయన్!
వారల గనుగొని వసిష్ఠ దేవుడు యొనరగ భరతునితో ననియెన్ 2

భరతకుమారా! దశరథరాజును ధర్మాచరణము జేయుచునూ
ధనధాన్యములను గూడిన రాజ్యము దగ నీ కిచ్చియు గతుడయ్యెన్!
సత్యధృతి ధర్మాతుడు రాముడు సత్యమార్గమును విడువకనూ!
ఉదయించిన చంద్రుడు వెన్నెలనూ సదయ! విడువకుండిన! రీతిన్!
తండ్రియానతిని విడువలేదుగా దగబోయెను గాననములకున్! 3

నీ తండ్రియు సోదరుడు నీ విధము నీ కిచ్చిన యీ రాజ్యంబున్
మంత్రుల తోడను ననుభవింపుమా! సుంతయు భీతియు లేకుండన్
శీఘ్రముగా నభిషిక్తుడవై యిక స్థిరముగ నేలుము భూప్రజలన్!
రాజులేని రాజ్యము నస్థిరమై రహి యరాజకము గలుగు సుమా! 4

ఉత్తర దేశపు రాజలునూ మఱి విత్తముగల పడమటి రాజుల్
దక్షిణాత్యరాజులు వచ్చెదరూ దగ సింహాసనములు లేనీ!
రాజు లందఱును, సరిహద్దులుగల రాజులందఱును వచ్చెదరూ!
కోట్లకొలది యత్తమ వస్తువులను గూర్మి సమర్పింతురు నీకున్! 5

ధర్మజ్ఞుండగు భరతు డంతటను దగ నా మాటల వినుచు వగన్!
ధర్మమార్గమును నవలంబింపగ దన మనసున రాముని దలచెన్!
కలహంసకు వలె స్వనము గలిగినా కడు గంభీరుడు భరడుండున్!
సభామధ్యమున వేదన స్వరమున సభాష్పములతో శోకించెన్
పురోహితుని నిందించుచు మఱియును బూర్ణహృదయుడై నిటు వలికెన్! 6

బ్రహ్మచర్యమును నాచరించుచును బహు విద్యా పారంగతుడున్!
ధీమంతంబుగ సత్యధర్మముల ధీరత నిలుపగ దలచిన యా
రాముని రాజ్యము నపహరింపగా రమ్యత యెవ్వడు మది దలచున్?
నామన సెట్టిదో నీకు తెలియదా? నా ప్రవృత్తియును గురుదేవా? 7

దశరథరాజుకు బుట్టిన వాడిల దగ రాజ్యమును హరించునా?
ఈ రాజ్యంబును నీవును నేనును యింపుగ రాముని వారలమూ!
ఈవిషయంబున ధర్మము దెలుపుము వింపుగ దెలియును సర్వంబున్!
పూర్వపురుషుడవు! బుణ్యమార్గమును బొలుపుగ దెలుపుము శీఘ్రముగన్!

జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు, మఱి ధర్మాత్ముడు జెలగు దిలీపుడు నహుషులతో!
సముదగు రాముడు దశరథునకు వలె సకలమైన యధికారంబుల్!
గలవుగాని యిల వేరెవ్వరికిని గలవని జెప్పగ లేరుగదా!
ఇక్ష్వాకుల వంశపు రీతి యిదీ యింపుగ నీకంతయు దెలియున్; 9

అనార్య జుష్టములగు బాపములను నరయ జేయజాలను సుమ్మా!
ఇక్ష్వాకుల వంశముమ గళంకము నింపుగ నే జేయను సుమ్మా!
తల్లి జేసినా పావకార్యమును దగ నంగీకృతి దెలుపనుగా!
వన దుర్గమునందున్న రామునకు మనసున యంజలి యర్పింతున్ 10

రాము ననుసరించియు నే బోయెద రమ్యమైన వనభూములకున్!
పురుషోత్తముడగు రాముడు రాజగు బొలుపగ కాజాలరు నెవరున్!
మూడు లోకముల రాజ్య మేలుటకు ముదమున శ్రీరాముడు దగునూ!
నేనాతని దాసుడను సేవకుడ నిత్యము దలతును శ్రీరామున్! 11

సభాసదులు భరతుని వాక్యము విని భవ్యానందము నొందుచునూ!
రాముని దలచుచు రమ్య భాష్పములు రహి నొలికిరి యా సభయందున్!

వనమునుండి నే నన్నగారినీ వడి దీసుక రాకుండినచో
లక్ష్మణునకువలె నే నరణ్యమున లాలితముగ జీవించెదనూ! 12

గుణవంతులు సత్పురుషులు, బూజ్యులు గుదురుగ మీయందఱి ముందున్!
రాముని వెనుకకు మఱల్చుటకునై రహి యత్నంబులు సేయుదునూ!
రక్షకులును మఱి మార్గశోధకులు రమ్య శిల్పులను ముందుగనే!
బంపియుంటి మఱి నేను గూడ వే బయలుదేరనలె ననుకొంటిన్! 13

భ్రాతృవత్సలుడు ధర్మాత్ముడునగు భరతుడు బలుకుచు నీ రీతిన్
మంత్రనిపుణుడగు సుమంత్రు దోడను మధురములగు బలుకులు పలికెన్!
సుమంత్ర! నా యాజ్ఞను నెఱవేర్పుము సురుచిరముగ వెడలుము వేగన్!
నా యానతిగా నాజ్ఞాపింపుము! నయముగ సేనను గొనిదెమ్మా! 14

మహాత్ముడగు నా భరతుని పలుకులు మాన్యుడు సుమంత్రు డంతటహూ!
విని యా కార్యము నాజ్ఞప్రకారము విస్తృతరీతిని జేయగనూ!
రాముని మరల్చి పురి దెచ్చుటకై రాణువ గూడను బోవుననీ
సైనికులును మఱి సేనాధ్యక్షులు సంతసమున నుప్పొంగి రటన్! 15

పిమ్మట యోధుల భార్యలందఱును బ్రియమగు భరతుని యాత్రవినీ
తమ తమ భర్తల తొందర వెట్టిరి దగ రాముని పురి గొనిదేవన్!
గుఱ్ఱములును మఱి నడిగా నడిచెడి గోరథంబులును రథములతో
యుద్ధభటులు నా సైన్యము నంతయు సిద్ధముజేసిరి యాత్రకునై 16

సన్నద్ధంబగు సైన్యము గాంచి సమక్షమున వా వసిష్ఠునీ!
ప్రక్కననున్నా సుమంత్రుతో ననె చక్కని రథమును దెమ్మనియెన్!
సుమంత్రు డంతట భరతుని యాజ్ఞను సుందరమగు గుఱ్ఱంబులతో
రథమును దెచ్చి ముందఱ నిలిపెను రమ్యకాంతు లట జెలగంగన్! 17

రఘువంశంబున బుట్టినవాడును రమ్య సత్య ధృతి గలవాడున్!
సత్య విక్రముడు సుయుక్తుండునగు సౌమ్యతేజుడగు భరతుండున్!
రాము నను గ్రహమును బొందుటకై రయమున బురికిని దెచ్చుటకై
మహారణ్యమును బోవుట కొఱకై మమతను సుమంత్రుతో ననియెన్! 18

సుమంత్ర! బొమ్మ్మ! సైన్యాధ్యక్షుల సురుచిరముగ సైన్యము గూర్చి
సిద్ధము గమ్మని తెలియబలుకుమా! శీఘ్రము గానకు బోవలయున్!
వనమున నున్నా రామచంద్రునీ వడి యనుగ్రహింపగ జేసీ
లోకహితంబును జేకూర్చుటకై లోకేశ్వరు గొని రావలెనూ! 19

భరతుడీ విధిని యాజ్ఞాపింపగ పరమ హితుండగు సుమంత్రుడున్
సంపూర్ణంబగు బూర్ణకాముడై సంతోషించుచు శీఘ్రముగన్!
సైన్యనేతలను సేనాపతులను సరసత మిత్రుల నందఱినీ!
భరతుని యాజ్ఞను వారి కందఱికి బన్నుగ యాతడు వినిపించెన్! 20

అంతట ప్రజలును ప్రతి గృహమందున జింత వీడి వడివడి వేగన్!
బ్రాహ్మణ క్షత్రియ వైశ్య సూద్రులును బన్నుగ తమ తమ వాహనముల్!
గజాశ్వ రథములు, యొంటెలు, ఖరములు గయనీయంబగు వృషభములన్
సిద్ధము జేసిరి వనికి బోవుటకు శ్రీరాముని పురి దెచ్చుటకై! 21

(అయోధ్యాకాండమునందలి 82వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## యెనుబది మూడవ సర్గము

[భరతుని వనగమనము—శృంగి బేరపురమున యారాత్రి నివసించుట]

అంతట భరతుడు వేకువఝామున సంతసమున నిదురను లేచీ!
కాలకృత్యముల దీర్చికొనియు మఱి కమనీయంబగు రథమెక్కి
రామ దర్శనము మది కాంక్షించుచు రయమున బయనము గావించెన్!
అనంతమగు నానంద వీచికలు నాతని మది తొణికసలాడెన్! 1

మంత్రులు మఱి పౌరోహితు లందఱు మాన్యత యాభరతుని వెనుకన్!
సూర్య రథములను బోలునట్టి యా సురుచిర స్యందనముల పైనీ!
ఇక్ష్వాకుల నందనుడగు భరతుడు నింపుగ వని బోవుచునుండన్!
యథావిధిని నవ నాగసహస్రము నా భరతుని వెంటను బోయెన్! 2

భరతు డా విధివి బోవుచుండగా భవ్యాయుధముల ధరియించీ!
అఱువది వేలా రథముల పైనమ నా భటులును నేగిరి వేగన్!
భరతుడా విధిని బోవుచుండగా భవ్యశ్వా రూఢులు వేగన్
లక్షమంది సైనిక భటులంతట లాలితముగ బోయిరి వెనుకన్ ! 3

కైకేయీ సతి సుమిత్ర మఱియును కాంక్షతోని కౌసల్యా సతియున్!
రామదర్శనా కాంక్షను బోయిరి రమ్యమైన వాహనముల పై!
మహనీయులునగు జనులందఱుమా మది సంతోషము నందుచునూ
రామలక్ష్మణుల జూడ బోయిరీ రమ్య రామ కథలను వినుచున్! 4

మేఘశ్యాముడును, మహాబాహుపును మిగుల బలాఢ్యుడు శ్రీరామున్!
జగతి శోకమును నాశము జేసెడి చారు యశస్కుని గాంచెదమూ!
ఉదయ భాస్కరుని వోలె లోకమును నుజ్వల కాంతులు నింపెడినీ
కనుల బంటగా గనబడగానే జను శోకములన్నియు మనకున్ ! 5

ఈ విధముగ పురి జను లందఱునూ నింపగు మాటలు బలుకుచునూ!
బంధొరులను గౌగిలిని నింపుచును నిండుగ మది సంతోషమునన్!

రాజ కుటుంబములోని బంధువులు రహి పురి వర్తక సంఘములున్!
వివిధ ప్రకృతులకు జెందిన వారలు వే బోయిరి భరతుని వెనుకన్! 6

మణికారులునూ, కుంభకారులును, మఱి శస్త్రోపజీవులునూ,
సాలెవారు మఱి మయూరకులునూ మఱియును అంపపు పనివారున్!
రోచకులును మఱి వేధకులును మఱి రూఢి దంతకారులు మఱియున్
సుధాకారులును, సువర్ణకారులు సుగంధముల వమ్మెడి వారున్! 7

కమ్మలు ధావకులును; వైద్యులునూ, శౌండికులును మఱి ధూపకులున్!
కుట్టుపనులవారును రజకులునూ కూర్మి వివిధ వృత్తులవారున్!
గ్రామ ఘోషముల వసించువారును గదు పెద్దలు మఱి యువకులునూ!
స్త్రీలను గూడిన నటనర్తకులును చేపలు బట్టెడి వారలునూ!
ఆభరతుని వెమకను బయనించిరి యా రాముని దర్శించుటకై! 8

సమాహితులునూ వేద విదులు నగు జక్కని నడవడి పూజ్యులునూ!
ఎడ్లబండ్లపై పోయిరి విప్రులు నింపుగ యా భరతుని వెనుకన్!
సువేషములతో, శుద్ధ వసనముల నురుచిర సుగంధ ద్రవ్యములన్!
అనేక విధముల వాహనములపై యా భరతుని వెనుకను జనిరీ! 9

ఆసైన్యంబును నానందించుచు నా శ్రీరాముని గొనిదేవన్!
బోవుచున్న యా భరతుని వెనుకను బోయిరి బాడుచు గీతములన్!
వారందఱును రథములపైనీ వరుసగ గజాశ్వములపైనీ
పయనము జేసిరి బహుదూరంబగు బన్నగ గంగానది చెంతన్! 10

శృంగి బేరపురమను బల్లెకునూ చేరికొనెను నా భరతుండున్!
రాముని మిత్రుడు బాహు విక్రముడు రమ్యశీల గుణవంతుండున్!
గుహుడను రాజూ పరిపాలించును గూరిమి శృంగీ బేరమునూ
బాగీరథి నదియొడ్డును జేరెను భరతుడు దన పరివారముతో! 11

భరతుని వెనుకను బయనించెడి యా ప్రబలసేన యట జేరికొనెన్!
చక్రవాకములతో గూడిన యా చారునదీ తీరంబునకున్!

వెనుకను దరలెడి సేననుగాంచీ విమల పవిత్రోదకములనూ!
ముందుగాంచి యా భరత కుమారుడు మోదముతో మంత్రుల కనియెన్! 12

మీ సౌకర్యము బట్టి సైన్యమును మిగుల వసతులను గల్పించీ!
ఆ యా స్థలముల యందు విడుదులును నలరి జేయుడీ! శీఘ్రముగన్!
ఈనాటికి విశ్రాంతి గొంద మిట యీ మహానదీ తీరమునన్!
రేవు దాటుదము గంగానదినీ రేయి గడుపుదము నిచ్చోటన్! 13

ఈ గంగానది పవిత్ర స్నానము నింపుగ నే జేసియు మఱియున్!
స్వర్గస్థుండగు దండ్రిగారికిని స్వర్గసుఖంబులు గలుగుటకై
జల దర్పణములు జేయవలయునని యలరి నాదు మరి గోరెడినీ!
అని మంత్రులతో వలికెను భరతుడు గని భాగీరథి తోయములన్! 14

అమాత్యులందఱు 'నట్లే' యనుచును నా భరతునితో వలుకుచునూ!
నా సైన్యంబును నిలిపి రచ్చటను నా యా ప్రాంతము లందులనూ!
అనేక విధముల యుపకరణంబుల యా సైన్యంబును వేగముగన్!
చేయించెను విడుదులు దీరమునను శ్రీ కరుడగు నా భరతుండున్
ఆలోచింపగ సాగె రామునీ నలరి యెటుల గొని రావలెనో! 15

(అయోధ్యాకాండమునందలి 83 సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## ఎనుబది నాల్గవ సర్గము

## (భరతుడు సైన్యముతో గంగానదీ తీరమును జేరుట - గుహుని యాతిథ్యము)

అటుపిమ్మట యా నిషాదరాజగు నా గుహుడును నదియొడ్డుననూ!
విడిసి యున్న సైన్యమును జూడగనె కడు నాతురతను బొందుచునూ!
ఎన్నడులేనిది యీ సైన్యం బిటు బన్నుగ వచ్చిన దేలయనీ!
తన బంధువులతో నిట్టుల బలికెను దగ నాశ్చర్యంబును నుట్టిపడన్! 1

మహాసముద్రమువలె నున్న దదే మహా సైన్యమదె తీరమునన్!
ఎంత సైన్యమో మనసుకు, నూహకు నింతగూడ యందుట లేదూ!
రథముపైని కోవిదార వృక్షము రమ్యముగా గనబడుచుండెన్!
దుర్బుద్ధియునగు భరతు డొచ్చినటు దోరముగా గనబడుచుండెన్!

కైక కుమారుడు భరతు డిచ్చటికి గడు వేడుక పల్లీయులనూ!
బంధించుటకో? చంపుటకో మఱి బల్లిదులగు దన సైన్యముతో
లేదా రాముని జంపుట కొఱకై సదారాజ్యమును నేలుటకై
సదాసుఖంబుల నందుట కొఱకును సాగి యిటుల దండెత్తె నాకో! 3

ప్రభువు మాత్రమే కాదు రాముడును బరమ మిత్రుడగు నా కతడున్!
అతని యర్థకామముల రక్షకై యలరి యుండుడీ తీరమునన్!
మాంస మూల ఫల యశనంబులతో నలరెడు బల్లీయులు వేగన్!
తమ సైన్యముతో నిలిచియుండుడో దగ గంగానది తీరమునన్! 4

ఐదువందలా పడవల పైనీ యలరుచు నూర్గురు యువకులునూ!
సిద్ధముగా నటనుండగ సఖులను జెన్నుగ గుహు డాజ్ఞాపించెన్!
భరతుని కా శ్రీరాముని పైనీ విరసములేదని తెలిసిననే
ఈసేనలు గంగానది దాటును నింపుగ రాముని గొనగనున్! 5

గుహు డా విధమున బలికి వేగమున కూర్మి మత్స్య మాంసము దేనెల్!
ఉపాయనముగా గైకొని పోయెను సుర్వీశుడనగు భరతునకున్!
ప్రతాపవంతుడు వినయజ్ఞుండగు బవిమలుండగు నా సుమంత్రుడున్!
వచ్చుచున్న యా గుహుని గనుంగొని చెచ్చెర భరతున కిటు లనియెన్! 6

వేయిమంది బంధులతో వచ్చిన విములుడైన యా నిషాదుడున్!
ఈ యరణ్య భూభాగ మంతయును నింపుగ తెలిసిన వాడుసుమా!
వయసుబండినా వాడును, సుగుణుడు వర్ణమెంచగను రాడు సుమా!
నీ యన్నకు ప్రియమైన వాడు మఱి నీ సోదరునకు మిత్రుండున్! 7

ఆ కారణమున గుహుని గలియుమా! యాత్మీయత మది నుట్టిపడన్!
రామలక్ష్మణులు నెచ్చట గలరో రహి యీ నిషాదునకు దెలియున్!
శుభకరమగు నా సుమంత్రు బలుకులు సురుచిరముగ విని భరతుండున్
గుహుని దెండు శీఘ్రముగ నాకడకు గూరిమి బలికెను సేవకులన్! 8

భరతుని యాజ్ఞను బొంది గుహుండును భవ్యానందము బెందుచునూ!
జ్ఞాతులచే బరివారితుడై మఱి నీలివిదుడు భరతున కనియెన్!
ఈ దేశము నీ నిష్కుటంబు సుమ! యిల మేమును నీ దాసులమూ!
ఈ దాసుని గృహమందు వసింపుము నింపుగ స్వేచ్ఛను సైన్యముతో! 9

బోయలచే నిట గొనిరాబడినా బొలుపుగ ఫల మూలంబులనూ!
అనేక విధముల వన్య మాంసములు వలనొప్పగ గొని వచ్చితిమి!
స్వీకరింపుమిదె! మా యాతిథ్యము శ్రీఘ్రము నీ కోరిక దీరున్!
శ్రీరాముని దమ్ముండవు నీవును స్థిర మిత్రుండవు నాకు మఱిన్!

నా సపర్యలను గైకొని సైన్యము నయముగ రాత్రిని యిటనుండున్!
విశ్రాంతిని గొను విమలోదకముల వేకువ స్నానంబును జేసీ!
జనకునికిని జలదర్పణంబులను సహజ రీతి సంధ్యను వార్చి!
సేనా సహితంబుగ యుదయంబున శ్రీకరముగ బోవలయు సుమా! 11

(అయోధ్యాకాండము 84వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## యెనుబది నాలుగవ సర్గము

[గుహ భరత సంవాదము — భరతుని శోకము]

మహా ప్రాజ్ఞుడగు భరతు డంతటను మంచిమాట విని యాగుహునీ!
హేత్వర్థంబుల సంహితవాక్యము జతురత వలికెను నాతనితో!
అన్నగారి మిత్రుండవు మఱియును నాంతరంగికుడ వో గుహుడా!
ఇంత సేనకును నీ వొక్కడవే స్వంతము నాతిథ్యము నీయన్
గోరుచుంటివిదె! సౌహార్ద్రుండవు గూరిమి యెంతటి మిత్రుడవో!
నీ యభిలాషయు నెంత గొప్పదో నిమ్మగ నే దెలుపగ జాలన్! 1

మహాతేజుడును శ్రీమంతుండును మహితాత్ముండగు భరతుండున్!
అతుల బలికి యా నిషాదరాజుకు నలరి వలికె మఱలను నిటులన్!
మిత్రమ! గుహుడా! జలములు నిండిన మీరిన గంగా ప్రాంతములన్
ప్రవేశింప శక్యముగానివి సుమ బన్నుగ దాట నశక్యంబున్! 2
భరద్వాజ యాశ్రమమునకు బోవలె పరమఋషులు నివసించెడిదీ
ఎటుబోవలెనో! యెంతదూరమో! యేదారిని బయనింపవలెన్? 3

ధీమంతుడగు రాజపుత్రుని దీనవచనముల మది వినుచున్!
గహనగోచరుండైన యా గుహుడు గరములు మోడ్చుచు నిటు లనియెన్!
మహాయశస్కుడ! రాజకుమారా! మహాధనుర్ధరులును నీతో
అనుసరించి వచ్చెదరు మిత్రమా! యడలబోకుమా! యింతయునూ!
నేనుకూడ నీతో వచ్చెదనూ నీకు దారి నే జూపెదనూ! 4

అక్లిష్ట కర్ముడు రామచంద్రునీ! నలరి కష్టమును బెట్టగనూ
బోవుచుంటి వేమో యని నామది పొటమరించుచున్నది సఖుడా!
నీ విశాలసైన్యమును జూడగా నింపుగ నామది లోపలనూ!
శంకయు నలుగుచు నున్నది సఖుడా! పొంకముగా బానో! కాదో! 5

ఆకాశమువలె నిర్మలుడైనా యాభరతుడు నా నిషాదుతో
మృదువుగ పలికెను మధురోక్తులతో మేలిమి కాంచనమాల వలెన్!
రాముని విషయము నపచారములను రహి దలబెట్టెడి కాలంబున్
గలుగ కుండెడిని కలకాలము నే కలిసి యుండెదను రామునితో! 6

నను శంకింపకుమోయి మిత్రమా! నన్నవ మానింపకు సఖుడా!
జ్యేష్ఠ సోదరుడు పితృసమానుడు నిష్ఠ పూర్తి నే దలతుగదా!
వనవాసితుడగు రామచంద్రునీ వినయముగా గొనివచ్చుటకై
బోపుచుంటినీ! సత్యవాక్య మిది పొల్లుగాదు; దలపకు వేఱన్! 7

భరత సుభాషితముల విని గుహుడును బట్టరాని సంతోషముతో
వికసించిన ముఖమున భరతునితో విమల వచనముల నిటు లనియెన్!
అప్రయత్నముగ వచ్చిన రాజ్యము నంటక ముట్టక విడువంగన్!
కోరుచుంటివీ! ధన్యుడవోయీ! కూర్మి నీ సమము గనరాడూ! 8

కష్టములందున యున్న రామునీ యిష్టముగా గొని వచ్చుటకై!
గోరుచుంటివీ! శాశ్వత కీర్తిని! సర్వలోకముల వ్యాపించున్!
ఈవిధి నిషాధిపతి భరతునితో నింపుగ మాటాడుచునుండన్!
నష్టప్రభలు గలవాడై సూర్యుడు గష్ట జలధిలో బడిపోయెన్!
చుక్కలతో జంద్రునితో రజనియు నక్కజముగ వ్యాపించె దిశల్! 9

శ్రీమంతుడగు భరతు డంతటను సేవల నన్నియు బరికించీ!
గుహుని సేవలకు సంతోషించుచు శయనించెను శత్రుఘ్నునితో!
మహాత్ముడగు నా భరతుని కంతట మర్మముగా నాతని హృదిలోన్!
రాముని గూర్చిన విచార భావము రహి శోకంబును గలిగె నటన్! 10

వన దాహముతో సంతప్తంబగు వాడిన వృక్షము లోపలనూ!
దాగియున్న యగ్నులు గాల్చినటుల్ తగ దుఃఖాగ్నియు భరతునిలో
దపింప జేయుచు దాహము గూర్చుచు దగని బాధయును బెట్టె మదిన్!
ఎంతవారలకును దప్పదుగా మఱి యీశ్వరేచ్ఛ కొనసాగు నిలన్! 11

సూర్యాంశువులను సంతప్తంబగు సురచిర హిమవత్పర్వతమున్!
మంచు జారినట్లుగ యాభరతుని యంచిత సర్వావయవములనూ!
శోకాగ్నిని బుట్టిన తాపముచే సోలిపోయి చెమటలు బుట్టెన్!
దుఃఖం బనియెడి మహాశైల మది దుర్దముడగు భరతుని బొందెన్! 12

ఆలోచించుటయే గిరి శిలలును నా నిట్టూర్పులు ధాతువులున్!
దైన్యమె యచ్చటి వృక్ష సంఘమును దగ శోకాయాసంబులునూ!
ఆగిరి శిఖరంబులు ననవచ్చును నంతములేనీ మోహంబున్!
అచటి జంతు సముదాయమనంగను నా సంతాపము నాగిరిపై
ఓషధులును వేణువులన వచ్చును నోరిమి లేకను భరతుండున్! 13

అటు పిమ్మట నరశ్రేష్ఠుడైన యా యమల హృదయుడును భరతుండున్!
నిట్టూర్చుచు దుఃఖించుచు మనసున కట్టా! యనుచును బలుకుచునూ!
ప్రమూధ సంజ్ఞను బరమాపదయును ప్రబల హృదయ జ్వర బీడితుడై
ఋషంబులచే గొట్టబడిన యా ఋషభమువలె శాంతియు లేకన్! 14

మహానుభావుడు భరతుడంతటను మహిమాన్వితుడగు శ్రీరామున్!
మనసున దలచుచు నచల చిత్తుడై మఱి పరివారముతో గూడన్!
గుహుండు మఱల గలిసెను భరతునితో గూడిన దుఃఖము వేదనతో!
ఓదార్చెను భరతుని దుఃఖంబును నోరిమి దాల్పగ వలె నంచున్! 15

(అయోధ్యాకాండములోని 85వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము-రెండవ భాగము

## ఎనుబది యాఱవ సర్గము

[నిషాదరాజు గుహుడు లక్ష్మణుని యుత్తమ స్వభావమును, విలాపమును వర్ణించుట]

అటు పిమ్మట నా గహనగోచరుడు నా గుహుడును భరతుని కయెనిన్!
'మహాత్ముడగు నా లక్ష్మణ వీరుని మహాసద్గుణములను గూర్చి!
శరచాపములను ఖడ్గము ధరించి సహోదరుని రక్షణకొఱకై
రాత్రియంతయును మేలుకొనిన యా రఘువీరునితో నిటులంటిన్! 1

రఘునందన! ఓ తండ్రీ! లక్ష్మణ! రమ్యమైన శయ్యము నదిగో!
త్వదర్థమై కల్పింపబడినదీ యథా విధిని శయనింపు మటన్!
ఓ ధర్మాత్మా మేమందఱమును నోర్తుము గద! బహు కష్టములన్!
సుఖమున కలవాటును బడితివి గద! సుఖముగ నిద్రింపుము నింకన్! 2

రాముని రక్షించుటకై మేమును రహి మేల్కొని యిట నుండెదమూ!
ఈ భువి రాముని కంటె నాకు బహు నింపగు మిత్రుడు లేడు సుమా!
బెంగబెట్టుకొని జికాకు బడకుము సంగతి దెలియుము! సత్యమిదీ!
రాముని దయచే నీ లోకమునను రమ్యకీర్తి, సద్ధర్మమునూ!
పరిశుద్ధంబగు నర్థకామముల బడయ గోరుచున్నాను సుమా! 3

అట్టి నేను బంధులతో గలసీ నలరుచు ధనస్సు ధరియించీ
నిదురించెడి యా సీతారాముల నిర్భయముగ కాపాడెదనూ!
ఈ వనిలోపల దెలియని దేమియు యంతము లేదుగ ప్రియసఖుడా!
రథ గజ తురగ పదాది దళములను రణమున మే మెదిరించెదమూ! 4

మా మాటలు విని మహాత్ముడగు నా మహితాత్ముండగు లక్ష్మణుడున్!
ధర్మదృష్టితో జూచుచు నాతడు మర్మముగా నిటులను వలికెన్!
"సీతారాములు కటిక నేలపై చింతను నిదిరించుచు నుండన్!
నిదుర యెటుల బట్టును మఱి సుఖములు నిలుచు నెటుల నా జీవమునన్!

గుహుడా! విను! దేవాసురులందఱు గూడి రాము నేమాత్రమునూ!
రణమున విజయము నందగజాలరు రహి యెదుర్కొనగ జాలరుగా!
అట్టి రాముడదె! సీతాసహితము నదిగో! చూడుము! తృణములపై
శయనించెను! అది యెంత కష్టమో! సహియింతును మది యెట్లెటులన్!

దశరథేంద్రుతో సమ లక్షణములు సరి దూగును శ్రీరాముండున్!
అనేక వ్రతముల నాచరించి మఱి యా దశరథు డీతని బొందెన్!
రాముడు గానకు బోయిన పిమ్మట రహి దశరథుడును బ్రదుకడుగా!
నిశ్చయమిది యీ మేదిని గూడను నిరవధికము శోకము బొందున్! 7

అంతఃపురస్త్రీ లంత శోకమును నఱచి యఱచి మానుదు రిపుడున్!
రాజ నివేశనమందు నార్తధ్వని రహి నిలుచును నిపుడిపుడిపుడే!
కౌసల్యాదేవియును దశరథుడు గన్నతల్లి యా సుమిత్రయున్!
రాత్రి బ్రదికి జీవింపగల రనెడి రహి విశ్వాసము లేదింకన్! 8

శత్రుఘ్నుని గనుగొనుచు నా తల్లి యాత్రము మానుచు జీవించున్!
వీరమాత కౌసల్యా మాత్ర మికవేదన జెందుచు మరణించున్!
ఒకటొకటిగ తన మనోరథములను నొప్పుగ సఫలము నొందకనూ!
తండ్రి దశరథుడు నస్తమించు నిక తనయుని రాజును జేయకనూ! 9

మరణించిన యా దశరథరాజుకు మానుగ భరత శత్రుఘ్నులునూ!
ప్రేత కార్యములు జేయుదు రప్పుడు ప్రీతిని వారలు ధన్యులుగా!
అందమైన ముంగిళ్లు గలదియును నతివిశాల మగు మార్గములన్
ప్రాకారములును గూడినదియును మఱి భవ్యరత్నముల భూషితమున్! 10

గజాశ్వరథముల గూడి క్రిక్కిరిసి రమ్య తూర్యధ్వని స్వనములచేన్
సర్వమంగళములను గూడికొనీ సంతోషించిన జనములతోన్!
ఆరామములును ఉద్యానములును నలరెడి నుత్సవ భరితమునూ
అట్టి రాజధానిని జరించెదరు నా భరతుడు శత్రుఘ్నుండున్! 11

ఈ గడువును గడిచిన బిమ్మట మే మింపుగ నయోధ్య జేరుదుమా!
సత్యప్రతిజ్ఞను బాలించిన యా సౌమ్యుడైన రామునితోడన్!
కోసల దేశము జేరుదుమా మతి కోరిక సఫలంబు గాగన్!
అనుచు లక్ష్మణుడు సీవిధి దలచుచు నావేదనతో విలపించెన్!
అతుల విలాపము జెందుచుండగనె నారాత్రియు గడిచెను వేగన్! 12

అమల ప్రభాతమునందు వారలును విమల జాహ్నవీ తీరమునన్!
జటలను దాల్చిరి నేనును వారిని సరగున నది దాటించితినీ!
జటాధారణయు, నారచీరలను నటు ముని వేషములను దాల్చి
మహాబలులునగు రామలక్ష్మణులు మహాయుధములను ధరియించీ
జాగరూకతను సీతా సహితము సరగున బోయిరి దాటి నదిన్!

(అయోధ్యాకాండములోని-86వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము - రెండవ భాగము

## ఎనుబది యేడవ సర్గము

భరతుడు రాముని గూర్చి ప్రశ్నల నడుగుట - గుహుడు బదులు బలుకుట

గుహుని వాక్యమును విని యా భరతుడు గూరిమి నంతయు గోల్పోయెన్!
అప్రియవాక్యము వినిన చోటుననె నడలుచు గుప్పగ కూర్చొనియెన్!
సుకుమారుండును, సింహస్కంధుడును సుందరరూపుడు, దరుణుడునూ!
మహాబాహువును గలవాడును మఱి మహాసత్త్వుడగు భరతుండున్!
క్షణకాలమునను దేజరిల్లి మఱి క్షణకాలము దుఃఖించుచునూ!
కొరడాతో గొట్టిన యేనుగువలె కూలివడెను నేలను మూర్ఛన్! 1

ప్రక్కనగల యా శత్రుఘ్నుండును బడిన భరతునీ జేరికొనీ!
కౌగలించి స్పృహ దప్పినవాడై కడు బిగ్గరగా రోదించెన్!
అంతట ఉపవాసముచే గృశించినా యల భర్తృ వియోగము జేతన్!
దీనలైన యా భరతుని దల్లులు దీనవదనలై జేరి రటన్! 2

వారందఱు నా పడిన భరతునీ వరుసను నిలిచిరి చుట్టుకొనీ!
కౌసల్యాసతి మాత్రము నేడ్చుచు గౌగలించుకొనె నాభరతున్!
శోకలాలసయు, దపస్వినియునగు శోకముతో గౌసల్యయునూ!
తన శ్రీరాముని గౌగలించునటు గౌగలించి యిటులను వలికెన్! 3

పుత్రా! దెలుపుము! నీ శరీరమును బొందలేదుగద! వ్యాధియునూ!
రాజవంశ జీవితమంతయునూ రహి నీ మీదనె గలదు సుమా!
రాముడు బోయెను వని లక్ష్మణుతో రాజు బోయె స్వర్గంబునకున్!
నిన్ను జూచుకొని జీవితమును నే నిర్వహించుచుంటిని పుత్రా!
నీ వొక్కండవె రక్షకుండవును నిఖిల దుఃఖముల దొలగింపన్! 4

రామలక్ష్మణుల సీతను గూరిచి రహి దుర్వార్తను వినియేమో!
ఈ విధమున శోకించుచుంటివా నిమ్మగ దెలుపుము విషయమునూ!
అన విని భరతుడు క్షణకాలంబును నలసట దీరగ కౌసల్యన్!
నోదార్చుచు మఱి శోకము దోడను నొప్పగ నిషాధి పతి కనియెన్! 5

గుహుడా! దెలుపుము! నాదు సోదరుడు గూర్మి రాముడెట నిదురించెన్!
సీత యెచట వసియించెను దెలుపుము శీఘ్రము లక్ష్మణు డెట నుండెన్?
ఏమి యేమి భుజియించిరి వారలు నెట నిదురించిరి వారిచటన్!
విషయమంతయును దెలియ బరుపుమా వేగము నే విన దలచెదనూ! 6
నిషాధిపతియగు గుహుదంతటనూ నిండుహృదయమున బ్రియ హితుడౌ!
అతిథియైన రాముని విషయంబున నలరుచు దా జేసిన క్రియలన్!
ఏ విధమున దా బ్రవ రించెనో యే విధమున వారల విధమున్!
పూసగ్రుచ్చినటు భరతునితో నిటు బొలుపుగ వలికెను వివరముగా! 7
'రాముని భోజనమునకై నేనును నంపితి బహు భక్ష్యాన్నములన్!
అనేక విధముల ఫలముల నంపితి యవసర వస్తువు లన్నియునూ!
సత్యపరాక్రముడైన రాముడును సకల వస్తు సముదాయమునూ
క్షత్రియ ధర్మము బాటించుచునూ సర్వము నిరాకరించె సుమా!
భరత మహారాజా! విను దెలిపెద భవ్య మహాత్ముడు రాముండున్!
నాతో పలికెను ననురాగముతో నవ్య స్నేహ ధారలు నొలుకన్!
'ప్రియమిత్రమ' విను! మే మెన్నండును ప్రేమమీర నివ్వగ వలయున్!
ప్రతిగ్రహింపగ రాదుసుమా! మఱి నితరులచే నిది రాజులకున్! 9
మహాయశా! శ్రీరామ లక్ష్మణులు మహాపతివ్రత సీతయునూ!
తెచ్చిన యుదకము ద్రాగియుండిరీ తీరుగ యుపవాసము నాడున్!
సీతారాములు శయినించిరి యిట నిన్న చిన్న దర్భలపైనన్!
ఈయింగుది తరు మూలంబుననే నింపుగ శయనించిరి నాడున్! 10
పరంతపుండగు లక్ష్మణు డంతట నరజేతుల దొడుగుల తోడన్!
పూర్ణములగు నంబుల పొదులను మఱి పొలుపుగ వీపున ధరియించీ!
నారిని గూర్చిన ధనుస్సు పట్టుక రాత్రియంతయును మేలుకొనీ
రాముని రక్షకు వేయి కనులతో రక్షకునికి వలె నిలుచుండెన్! 11
అపుడు నేనునూ యుత్తమమైనా యలరి చాప బాణముదోడన్!
ఏమరపాటును లేని బంధువులు నిమ్మగ మిత్రుల గూడికొనీ!
మహేంద్ర కల్పుండగు శ్రీరాముని మఱి రక్షించుచు నిలవడినా
లక్ష్మణుడుండిన చోటున నేనును లాలితముగ నిలిచితిని యటన్! 12

(అయోధ్యాకాండము 87 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## యెనుబది యెనిమిదవ సర్గము

రాముని కుశ శయ్యనుగాంచి భరతుడు రోదించుట - తానును జటావల్కములు ధరించి వనమునందు నివసింప గోరుట

గుహుని మాటలను విని యాభరతుడు గూరిమి తోడను మంత్రులతో
ఇంగుది తరుమూలంబును జూచెను నింపగు రాముని శయనమునూ!
తల్లులందఱికి నిట్లని పలికెను దగ శ్రీరాముడు నిచ్చటనే
శయనించెను నిట నేలపైని మఱి పయనంబయ్యెను నిటనుండే!
అతడు బరుండిన నలిగిన శయనము నదిగో! యింకను నిటనుండెన్! 1

మహాభాగ్య కులమందు జనించిన మహాభాగుడగు ధీమతుడున్!
దశరథేశ్వరుని పుత్రుడు రాముడు ధరణిపైని నిదురించుటయా!
అజినోత్తర చర్మంబుల పైనీ యాస్తరణముల సముదాయమునన్!
శయనించుట కలవాటు పడిన యా సరసిజాక్షుడగు రాముండున్
నేలపైని యెటు నిదురించెనొ కద! నింగి చుక్కలను జూచుచునూ! 2

ప్రాసాదాగ్రములను విమాన గృహ పైభాగములను నివసించున్!
బంగరు నంతస్థులును గలవియును వరాస్తరణములు గలవియునూ!
పుష్పంబుల సముదాయము దోడుత పొలుపగు రంగులు గలవియునూ
చందనాగురుల సుగంధములతో నందముగా గనిపించెడివీ! 3

తెల్లని మేఘములకు సరినెత్తుగ నుల్లము పుల్లము జేయునవీ!
చిలుక బలుకులతో ధ్వనించుచును జల్లని గాలుల దోడుతనూ!
బంగరు గోడలతో గట్టబడీ రలగు మేరువువలె నున్నా
ఆ ప్రాసాదమునందు సుఖముగను నరిరుచు రాఘవు డుండగనూ! 4

గీత వాదిత్ర నిర్ఘోషములను శ్రేష్ఠాభరణముల ధ్వనిచే!
మధుర మృదంగ స్వనములచేతను మధుర గీతముల రాగములన్!
మేలుకొలుపబడు చుండెడి రాముడు మేదిని పై నెటు నిదురించెన్? 5

సూతమాగధుల వందులచేతను సూరిజనుల స్తోత్రంబులచే!
గాథల బాడుచు గథలను దెలుపుచు కమ్మని తీయని రాగములన్!
వంశమునందలి పూర్వ పురుషులను యంశములన్నియు బేర్కొనుచున్!
ఆ యా కాలములందు నమస్కృతు లర్పింతురు బహు వినయమునన్! 6

జగతి యందు నమ్మగరానిది యిది! సత్యమనుచు దోచుటలేదూ!
మోహము జెందుచు నున్నది భావము మూలుగు చుండెను బుద్ధియునూ!
కలయో మాయయొ ననిపించును మది కాలబలము బలవత్తరమున్!
రాముడు నేలను శయనించుట యన రహి విచిత్రమది యోచింపన్!
కాలము కంటెను మించిన దేదియు గానము ధాత్రిని యిది నిజమున్! 7

విదేహ రాజగు జనకుని కొమరిత విమల దశరథేంద్రుని స్నుషయున్!
ప్రియదర్శిని యగు సీతాదేవియు నయముగ నేలను బవళించెన్!
ఇది నా రాముని శయన శయ్యయును నిది నిదురించిన చోటుగదా!
కఠిన స్థండిలము బఱచిన తృణములు గడు నలిగెను రాపిడి చేతన్! 8

ఈశయనపై యచ్చటచ్చటను నింపుగ కనబడు చుండెనదే!
కనక బిందువులు రాలిన విచ్చట గడ రమ్యముగా దృణములపై
ఆభరణంబుల తోడుత జనకజ నలరుచు నిద్రించెనొ యేమో!
నా మనమున ననిపించుచున్నదీ నయముగ భూమిజ శయ్యయనీ! 9

తగుల్కొనిన యీ పట్టుదారములు దగ జానకివని మది దలతున్!
ఉత్తరీయ మిట దగుల్కొన్నదని నూహను స్పష్టంబగు చుండెన్!
బాలయు, సుకుమారియు, దపస్వియును బతివ్రతయు నా జనకజయున్!
ఇట్టి స్థితిని గూడను దుఃఖముగా నిమ్మగ భావించుటలేదూ!
భర్తయున్న శయనమె సుఖకరమని భావించును నని మది దలతున్! 10

కట్టా! యెంతటి కష్టమొచ్చినది కడు క్రూరుడు గద భరతుండున్!
నామూలముననె కష్ట మొచ్చినది నయముగ శ్రీరామున కపుడున్!
భార్యా సహితుండైన రాఘవుడు భవ్యుడు నిట్లుగ తృణములపై
అనాథునికి వలె శయనించెను గద! యాహా! యెట్టివా! విధివ్రాతల్! 11

సార్వభౌమ కులమందు జనించిన సర్వజగతికిని సమ్మతుడున్!
ఇందీవర ఘనశ్యాముడు మఱియును సందీప్తములగు నేత్రములున్!
ప్రియదర్శనుడును నదుఃఖార్హుడును ప్రీతిభాజనుడు రాఘవుడున్!
రాజ్యసంపదలు వదిలి యీవిధము రాతినేల నెటు నిదురించెన్? 12

శుభలక్షణుడును మహాభాగుడును శుచిమంతుడు నా లక్ష్మణుడున్!
ధన్యుడు! రాముని కష్టకాలమున తగ దానును వని బోయెగదా !
భర్తననుసరించుచు బోయినది భవ్యురాలు నా సీతయునూ!
మహాత్ముడగు శ్రీరామచంద్రునకు మనము దూరమైతిమి నిటులన్!

సంశయాస్పదము నగు స్థితి నుంటిమి సర్వులమును రాముడు లేకన్!
దశరథరాజును స్వర్గము జేరెను దగ రాముడు వనమునకు జనెన్!
కర్ణధారి లేనట్టి యోడవలె గనిపించును నీ రాజ్యంబున్!
అరణ్యమున రాముడు వసించినను నతని బాహుబల వీర్యమునన్!
రక్షింపంబడు నీ వసుంధరయు రహి నెవ్వడు గోరడు దీనిన్! 14

శూన్యమైన ప్రాకార రక్షణము సుంతయు నడుపున లేనిదియున్!
గజాశ్వ బలములు బదాతి దళములు గదనమునకు సిద్ధములేవూ!
అపావృతంబగు బుర ద్వారంబులు నరక్షితంబగు నగరంబున్!
సంతోషింపని సేనలు గలదియును సకల శూన్యమగు నగరంబున్! 15

లోపల వెలుపల రక్షణ లేకను లోలత్వంబును గలదియునూ!
అట్టి రాజ్యమును జూచియు గూడను నా శత్రువులును దలపరుగా!
విషకృతములు నగు భక్ష్యములకు వలె వేగము జూపరు దరి జేరన్!
రాముని విక్రమమును దలుచుకొని రహి దూరమునను నుండెదరూ! 16

నేటినుండి నే జటల ధరింతును బాటిగ ముని వస్త్రంబులనే
భక్షింతును మఱి ఫలమూలములను బన్నుగ నేలను శయనింతున్!
రాముడు జేసిన వీర ప్రతిజ్ఞను నయముగ నే బాలించెదనూ!
రాముకు బదులుగ నే వనములలో రమ్యముగా వసియించెదనూ!
అటుల జేయ రాముని బ్రతిజ్ఞయును నసత్యమును మఱి కాబోదూ! 17

సోదరుడగు రామునకు బదులుగా శూన్య వనంబున నాతోడన్!
శత్రుఘ్నుడు గూడను వసియించును మిత్రత్వంబున వనములలో!
పూజ్యుడైన శ్రీరామచంద్రుడును బొలుపుగ లక్ష్మణుతో గూడన్!
కోసలదేశము బతిపాలించును గూర్మి ప్రజలు సంతసమందన్! 18

రాము నయోధ్యను బ్రాహ్మణు లందఱు రయమున నభిషేకింతురుగా!
దేవతలందఱు నా యీ కోరిక దీర్చెదరా సఫలముగాగన్? 19

దలనువంచి నే ప్రార్థించిననూ దయతో గోర్కెను దీర్పనిచో!
అరణ్యమున వసియించు రామునీ! యనుసరింతు నే సత్యముగన్!
అరణ్యంబులను వసింతు నేనును నా రాముని వలె మునిపగిదిన్!
రాముడు గాడనబోడు గలుగుచును రమ్య కరుణ నను వీక్షించున్! 20

(అయోధ్యాకాండములోని 88 వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము- రెండవ భాగము

## యెనబది తొమ్మిదవ సర్గము

భరతుడు సేనతో గంగను దాటి భరద్వాజాశ్రమమునకు జేరి కొనుట

రఘువంశంబున బుట్టిన భరతుడు రాత్రి గడిపె నా తీరమునన్!
ప్రాతఃకాలము శత్రుఘ్నునితో బన్నుగ నీ రీతిని వలికెన్!
శత్రుఘ్నా! లేలెమ్ము! వేగమున! భద్రమగును గావుత నీకున్!
నిషాధిపతియగు గుహుని రమ్మనుము! నెమ్మది దాటించును గంగన్! 1

భరతు డి విధము ప్రబోధింపగను బన్నుగ నా శత్రుఘ్నుండునూ!
ఇటుల వలికె నా భరతుని తోడను నింపుగ మధురాక్షరములతోన్!
పూజ్యుడైన శ్రీరాముని గూర్చియె బొలుపుగ యోచించుచు నుంటిన్!
మేలుకొనియె నే నుంటిని సోదర! సోలి నిదురబోవుట లేదూ! 2

పురుషోత్తములగు నా సోదరులును బొలుపుగ మాటాడుచు నుండన్!
తగిన సమయమున గుహుడును వచ్చెను దగ నమస్కృతుల నర్పించి!
ఓ భరతుడ! గతరాత్రి తీరమున నొప్పుగ శాంతిని గడిచినదా?
సైన్యముతో సుఖముగ నుంటివిగద! అన్యము జరుగక యుండకనూ! 3

రాముని వశముననున్న భరతుడును రమ్య స్నేహమున బలికిన యా
నిషాధిపతి బలికిన వాక్యము విని నిండు హృదయమున నిటులనియెన్!
ఓ నిషాధిపతి సుఖముగ గడిచెను నొనరగ సత్కృతు లందితిమీ!
ఆజ్ఞాపింపుము నీ భృత్యులకును నలరి గంగ మము దాటింపన్ 4

అంతట గుహుడును నా రామానుజు నాజ్ఞను విని యతి శీఘ్రముగా!
తన నగరమునకు బోయి జ్ఞాతులకు దగ నీ విధి బలికెను నతడున్!
లెండు! మేల్కొనుడు! మీ కందఱకును నిండు భద్రమగు వే వెంటన్!
నావల నొడ్డుకు జేర్పుడు సేనను నయముగ దాటింపగ వలయున్! 5

గుహుని మాటలను విని జ్ఞాతులునూ కూరిమి త్వర బడుచును వేగన్!
తమ తమ యోడల వే గొని వచ్చిరి సత్వరంబుగను సిద్ధంబై!
గంటల దోడుత నలంకరించిరి గట్టి ద్రాడులను గట్టిరి వే!
గాలికి యనుకూలముగా బోవుటకై గాలి తెరలను గట్టి రటన్! 6

అంతట గుహుడును దాను స్వయముగా కాంతి కంబళులు గప్పినదీ
ఆనందంబగు ధ్వనులు గలదియును నతి మంగళప్రద మైనదియున్!
స్వస్తిక మను నావను గొనివచ్చెను స్వస్తియనుచు నా కులగురువున్,
పూజ్యులైన బ్రాహ్మణులును నెక్కిరి పొలుపుగ మున్ముందుగ నావన్! 7

తదుపరి భరతుడు శత్రుఘ్నుండును దదుపరి సుమిత్ర కౌసల్యా!
ఇతర రాజ యోషితలును నెక్కిరి నింపుగ యోడను శీఘ్రముగన్! 8

విడిచి జేసినా నివాసంబులను వేగము దగ్ధము జేయుచునూ!
ఓడరేవు దిగుచున్న వారియును నొడ్డుకు జేర్చుచు వస్తువులన్!
నావపైకి సామగ్రి నెత్తుచును నయముగ కేకలు వేయుచునూ!
వీరందఱు జేసెడి యాధ్వనులును వేల్పు నగరమునకును జేరెన్! 9

అలంకరించిన యా నావలనూ నలితివేగము బల్లియులునూ!
స్వయముగ నడుపుచు నుండిరి యోడలు బరుగున బరుగెత్తెను నీటన్!
కొన్ని యోడలును స్త్రీ జనములతో కొన్ని యోడలును నశ్వములన్!
కొన్నిటిపై రథ వాహనంబులును గొన్నిటిపై వృషభంబులునూ!
కొన్నిటిపైనీ మహాధనంబులు గూరిమి యెక్కించిరి నటుపై 10

మావటి వారును బ్రేరేపింపగ మఱి నది దాటుచు గజములునూ!
వైజయంతికలతో గూడికొనీ వన్నెల గిరులుగ భాసించెన్!
ఆవలి యొడ్డున జేరి నావలును నా జనముల వే నట దింపీ!
తిరిగి వచ్చినవి నీట నావలును దీరుగ విన్యాసంబుల తోన్! 11

కొందఱు నావలపైని యెక్కిరీ కొందఱు నెక్కిరి తెప్పలపై!
కొందఱు గడవల సహాయంబుతో గూరిమి దేలుచు నది దాటన్!
కొందఱు జేతుల పీదుకొనుచునూ చందముగా దాటిరి గంగన్!
రాముని దర్శన భాగ్యంబునకై రయముగ యయోధ్య బురవాసుల్! 12

వల్లీయుల సహకారము తోడను బవిత్రమగు నా జాహ్నవినీ!
ప్రయాగ వనమును జేరెను సేనయు భరతుడు నాతని బంధువులున్!
మైత్ర ముహూర్తము నందు జేరిరీ మహానదీ యానలి యొద్దున్
భరతుండును మది సంతోషించెను బన్నుగ గుహునీ మెచ్చుకొనెన్! 13

పూజ్యుడైన భరతుడు సేనలతో బొలుపుగ గంగానది దాటీ
మంచిమాటలను బలికి సేనతో నంచితముగ విడిదిని జేసీ
ఋషిప్రవరుండగు భరద్వాజునీ ఋత్విక్కులతో గూడికొనీ!
దర్శింపగ వే బయలుదేరెనూ! ధర్మ పథికుడగు భరతుండున్! 14

దేవ పురోహితుడైన యా ఋషిని దివ్య తపోవనమును జేరీ!
భరద్వాజు నాశ్రమమును గాంచెను భవ్య పర్ణశాలల గాంచెన్!
రమ్యోటజ వృక్షములను గాంచెను రమణీయములగు దృశ్యములన్!
వేద ధ్వనులను నిమలనాదముల వినె మృగపక్షుల సుస్వనముల్!

(అయోధ్యాకాండములోని-89వ సర్గము సమాప్తము)

★ ★ ★

## అయోధ్యాకాండము – రెండవ భాగము

### (తొంబదియవ సర్గము)

### -భరద్వాజ ఋషిని భరతుడు గలిసికొనుట-

ధర్మజ్ఞుండగు భరతు డంతటను దగ క్రోసెలుడు దూరమునందున్!
భరద్వాజు నాశ్రమమును గనుంగొని భరితానందమునను మునిగీ!
సైనిక బలమును నటనె నిలిపి మఱి సర్వ శస్త్రములు నటనుంచీ
పట్టువస్త్రముల తోడ వసిష్ఠుని ఐన్నుగ తన ముందుంచుకొనీ
మంత్రులతోడను బాదచారియై మహర్షి యాశ్రమమునకు జనెన్! 2

పిమ్మట భరతుడు మంత్రులనందఱ నిమ్ముగ యాపెను దూరమునన్!
పురోహితుండగు వసిష్ఠ ఋషితో బోయెను ఋష్యాశ్రమమునకున్!
ఆ వసిష్ఠ దేవుని జూడగనే యా భరద్వాజుడు వెన్వెంటన్!
అర్ఘ్యము దెండని బలుకుచు శిష్యుల యాసనమున నుండియు లేచెన్! 2

మహాతేజుడగు భరద్వాజుడును నా వసిష్ఠుతో గలియంగన్!
భరతుడంతటను నమస్కరించెను భరద్వాజునకు వినయమునన్!
వసిష్ఠు డంతట తెలియబఱచెనూ వలనొప్పగ యా ఋషీంద్రుకున్
దశరథేంద్రునీ కుమారుడంచును ధర్మజ్ఞుడు భరతుం డనుచున్ 3

వారిరువురకును నర్ఘ్య పాద్యములు వలనొప్పగ ఫలముల నిచ్చీ!
కులమునందు కుశలమె? యనె భరతుని కూర్మి ప్రీతితో బ్రశ్నించెన్
అయోధ్య పురియును నటసైన్యంబును నలరు ధనాగారంబులనూ!
మిత్రుల మంత్రుల క్షేమము నడిగెను మీరిన ప్రేమను నాభరతున్
దశరథు మరణము విని యుండుటచే దగ ప్రశ్నింపగ లే దతనిన్! 4

ఆ భరతుండును భరద్వాజునీ నతి వినయముగా బ్రశ్నించెన్!
'నీ శరీరమునకును, నగ్నులకును నిఖిల వృక్షములు శిష్యులకున్!
మృగపక్షులకును నెట్టి బాధలును దగ లేవుగదా! మునివర్యా!'
అని వినయముతో నా భరతుండును నంజలించి మునితో ననియెన్! 5

అన్ని విధములను క్షేమం బనుచును నా భరతునకును ముని దెలిపి!
రాముని మనసున దలచి భరతునకు రమ్యముగా నీ విధి పలికెన్!
రాజ్యపాలనము జేయు పీ విటుల రహి నేతెంచుట కారణమూ!
విషయము దెలుపుము! నా మది శంకయు వేగుచున్న దది యెందులకో! 6

'అమిత్రఘ్నుడగు రామచంద్రునీ యటు బదునాలుగు వత్సరముల్!
అడవుల బొమ్మని యాజ్ఞాపించెను నాలి మాటలకు దలనూపి!
ఆ దశరథు మాటలను రాముడును నడవుల కేగెను దమ్మునితో!
ఆటంకంబులు లేని రాజ్యమును ననుభవింపగా మది దలచీ!
పాప కార్యమును జేయుట కొఱకై పరుగున నిటు రాలేదు కదా!' 7

భరతుడంతటను ముని మాటలఁ విని భళ్ళున కన్నీ రొలుకుచునూ!
గద్గద స్వరమున భరద్వాజుతో గరుణాక్షరముల నిటు లనియెన్!
భగవంతుండగు నీవిటు బలుకుట భరింప జాలను మునివర్యా!
ఎట్టి దోషమును శంకింపకుమా! యిటుల జలుకగా రాదు సుమా! 8

దూరదేశమున నున్న సమయమున దుష్టబుద్ధి నా తల్లి యిటుల్!
పలికిన బలుకులు సమ్మతి జేయను బన్నుగ సంతోషింపను నే!
రాముని బదములు నంటుట కొఱకై రయమున వచ్చితి నీ వనికిన్!
రాము నయోధ్యకు గొనిపోవుటకై రహి వచ్చితి బరివారముతో! 9

భగవంతుడ! నన్ననుగ్రహింపుము! దగ నే నుంటిని యిట్టి స్థితిన్!
మహీపతియునగు రాము డెట గలడు రమ్యముగా బలుకుము నాతోన్!
వసిష్ఠాది ఋత్విక్కులు గూడను నా భరద్వాజుని బ్రార్థింపన్
పూజ్యుడైన యా భరద్వాజుడును బొలుపుగ భరతునితో పలికెన్! 10

భరతా! గురువుల విషయంబుననూ గురు వృత్తియు శమమును దయమున్
సత్పురుషుల లక్షణము లన్నియును చాలగలవు నీ యందుననూ!
రఘువంశంబున జనించినాడవు రమ్య గుణములవి యన్నియునూ!
నీతో నుండుట సహజము గాదా! నితరము లెన్నుట యెందులకూ? 11

నీమది భావము దెలియును నాకును నిర్ణయింపగా దృఢముగనూ!
నీ కీర్తిని యభివృద్ధి చేయుటకు నిన్నిటు ప్రశ్నించితి నేనున్!
ధర్మజ్ఞుండగు రామ చంద్రుడును దగ సీతా లక్ష్మణుతోడన్
చిత్రకూటమున వసించుచుండెను జేరుము నీ పరివారముతో! 12

రేపటకును జను! నేటికుండు మిట! రీతి దెలిసినా వాడవునూ!
మా యాతిథ్యము స్వీకరింపుమా! మా కోరిక మన్నింపు మికన్!
ఉదార దర్శనుడైన భరతుడును 'ఊ' కొట్టెను ముని పలుకులకున్!
రాత్రి యాశ్రమమునను నివసింపను రాజకుమారుడు మది దలచెన్! 13

(అయోధ్యా కాండమునందు 90వ సర్గము సమాప్తము)

* * *

## అయోధ్యాకాండము - రెండవ భాగము

### తొంబది యొకటవ సర్గము

[సేనా సమేతుండగు భరతునకు భరద్వాజుడు నాతిథ్య మిచ్చుట]

ఆనాటికి యట నివసింపగనూ యా భరతుడు దలనొంపగనూ!
నా యాతిథ్యము స్వీకరింపుమని యాభరద్వాజుడు పలుకంగన్!
భరతుడు బలికెను మునిపుంగవుతో పాద్యము, నర్ఘ్యము, ఫలంబులున్!
ముందుగనే యిచ్చితివి మునీశ్వర యెందు కింత సత్కారంబుల్? 1

చిఱునవ్వును జిందుచు మునీశ్వరుడు జెన్నుగ భరతునితో నవియెన్!
'సంతుష్టివనీ నే నెఱుంగుదును సంతసింతు వేమిచ్చిననూ!
సేన కంతకును విందు సేయగా మానసమున నే గోరెదనూ!
సత్కరించుటకు దగిన వాడవును సంతసంబు గలుగును నాకున్! 2

సేనను దూరముగా నుంచి యిటుల్ చిత్రముగా మఱి వచ్చితివీ!
సైన్యబలముతో రాలే దెందుకు సరిగ నొంటరిగ వచ్చితివీ?
అంజలి ఘటించి యా భరతుండును నా భరద్వాజుకు నిటు లవియెన్!
భగవంతుడ! నే భయపడి నీకును బరగ సేనగొని రాలేదూ! 3

రాజుగాని మఱి రాజపుత్రుడును రహి యెల్లపుడును దేశములో
మునులకు దూరముగా నుండవలెను మొరటుగ దిరుగగ రాదు గదా!
మహాముని! మఱి యుత్తమాశ్వములు మదగజంబులును, సైనికులున్
విశాల భూమిని యాక్రమించుటకు వెనుక వచ్చుచున్నవి వేగన్! 4

ఆశ్రమ మందలి వృక్షంబులనూ యటగల యుదకంబుల కొలనుల్
భూమిని మఱియును బర్ణశాలలను బూని ధ్వంసమును జేయుననీ!
అని మదిలో భయమందితి స్వామీ! యార్భాటము లేకుండగనే
ఒంటరిగా కుల పురోహితునితో నొప్పుగ వచ్చితి నడచుచునూ! 5

ముని యానతి యా భరత కుమారుడు మోదముతో దన బలములనూ!
ఆశ్రమంబునకు రప్పించెను వే యా మహర్షియును సంతసిలన్!
అంతట మహర్షి భరద్వాజుడును అగ్ని గృహములోనికి బోయెన్!
ఆచమించి తన యవయవములనూ నలరుచు బరిమార్జన జేసీ!
ఆతిథ్యంబును నర్పించుటకును నఖిల సేనలను ద్వరితముగన్
విశ్వకర్మనూ నాహ్వానించెను వినుతి జేసి తగు స్తోత్రములన్! 6

ఆతిథ్యము నే నివ్వగోరుచును నలరు గృహములను నిర్మింపన్!
విశ్వకర్మ నిట బిలుచుచుంటినీ వేగ బనులు దగ జేయుటకున్!
దేవేంద్రుడు యమ వరుణ కుబేరుల దిక్కులు బాలించెడి వారిన్!
ఆహ్వానించుచు నుంటి! భరతునికి నాతిథ్యము జేయగ నుంటిన్!
కావున వారును వచ్చి కార్యములు గడు వేగముగా జేయవలెన్! 7

తూర్పు దిశను ప్రవహించు నదులునూ తోరముగా పడమటి దిశకున్!
బోయెడి నదులును పృథివి గగనమున బోయెడి నదులును వే వేగన్!
నదులన్నియు వే గలిసి వేగమున నలువైపుల వచ్చును గాతన్!
భరతుని కిచ్చెడి యాతిథ్యంబున భాగము బంచుకొనంగ వలెన్! 8

కొన్ని నదులు మైరేయ మద్యమును కొన్ని నదులు సురశ్రేష్ఠమునూ!
చెఱకు రసములా తీయని చల్లని చిత్రోదకము స్రవింపవలెన్!
దేవతలును గంధర్వులైన యా దివి విశ్వావసు నను వానిన్!
హాహా హూహూలను వారలనూ యాహ్వానించుచు నుంటి దగన్! 9

దేవజాతి జెందిన యప్సరసలను దివి గంధర్వుల జాతికినీ
జెందిన యప్సరసల నందఱనూ బొందుగ నాహ్వానించుచునూ!
ఘృతాచి, విశ్వాచీ యనువారల మిశ్రకేసి యాలంబుసయున్
హేమదంత, నాగా యప్సరసల హిమ యను నప్సరసను వేగన్
ఆహ్వానించుచు నుంటి భరతునకు నలరి జేయ సత్కారములన్! 10

దేవేంద్రుని సేవించు స్త్రీలనూ తేజోవంతుడు బ్రహ్మకునూ
సేవికలగు వారందఱ రమ్మని స్థిరబుద్ధిని బిలుచుచు నుంటిన్!

తుంబురు సహితము బిలుచుచు నుంటిని తోరపు సంగీతము బాడన్!
తమ తమ యుపకరణములను దేవలె తమ తమ విద్యలు భాసింపన్! 11

వస్త్ర భూషణములను బత్రములును నుత్తమ స్త్రీలను ఫలములతో!
ప్రకాశించు నా కుబేరువన మది వన్నె లొలుకు గురు దేశమునన్!
వత్తురుగావుత! వరుసగ నందఱు జిత్తము బరిపుల్లము గాగన్
భరతుని కాతిథ్యము నొసంగగను భారము మీపై వేసితినీ! 12

భగవంతుండగు జంద్రు డిచ్చటను బహుళాన్నములును, భక్ష్యములున్,
భోజ్యములను, చోష్యముల, లేహ్యముల బొలుపుగ యందించును గాతన్!
అపుడే విరిసిన పూలమాలికల యలరు మద్యపానీయములన్!
అనేక విధముల మాంసంబులనూ నలరి చంద్రుడిచ్చును గాతన్! 13

సాటిలేని తేజోవంతుండగు తపోధనుడు ముని ప్రవరుండున్!
ఏకాగ్రత శిక్షాస్వర యుక్తము నింపుగ పాటించుచు వలికెన్!
ప్రాన్ముఖమున యాముని యంజలితో బన్నుగ సురలను బ్రార్థింపన్
ఆహూతులు నగు దేవతలందఱు నరుదెంచిరి యొక్కొక్కరుగాన్! 14

అంతట వాయువు నరుగుదెంచెనూ యానందము గలిగించుచునూ!
మలయదుద్దురము స్పృశియించుటచే మంచి గంధముల వాసనచేన్!
దివ్యమైన మేఘంబులు వచ్చెను దివ్య పుష్ప వర్షంబులచే!
దివ్యదుందుభులు ధ్వనులును మ్రోగెను దిక్కులు, దిశలును దద్దరిలన్!

చల్లని తెమ్మెరలును వీచిశవీ మెల్లని వీణా సుస్వనముల్
అప్సరగణములు నాటల నాడిరి యంతులేని మోదము తోడన్!
గంధర్వులు గానంబును జేసిరి కఠిన శిలలు గఱుగగ నచటన్!
కిన్నెరలును బహు క్రీడల సలిపిరి వన్నెలు ధాత్రిని వికసింపన్! 16

లయ సమన్వితములగు నా ధ్వనులను లాలితనుగు వీణాధ్వనులున్!
భూమ్యాకాశములందు బ్రాణులకు బులకిత గాత్రులుగా జేసెన్!
శ్రోత్ర సుఖంబును బొందిన పిమ్మట శూరులు భరతుని సైనికులున్
విశ్వకర్మ జేసిన నిర్మాణము వీక్షించిరి యా యద్భుతమున్! 17

అయిదామడలను భూమి చదునుగా నట నేర్పడియెను నందముగా
ఇంద్ర నీల వైడూర్యంబులతో సాంద్ర శాద్వలములును నుండెన్!
అచట వెలసె పూ ఫలముల తోడను నల మారేడు గపిత్థములున్
పనస, యుసిరి, మామిడి వృక్షంబులు బహు మాదీఫల వృక్షములున్! 18

ఉత్తపు కురు భూదేశము నుండియు నుత్తమ భోగములను గూడి!
దివ్యవనంబును వృక్షంబులతో దివ్యమైన నది యటకొచ్చెన్!
చతుశ్శాలలును, గజాశ్వ శాలలు ముఖ ద్వారంబులతో గూడన్
హర్మ్య ప్రాసాదములు వెలసినవి యంచితమగు ధోరణములతో! 19

తెల్లని మేఘముతో సమానమగు దీరుగ ముఖద్వారంబులతో
రాజగృహం బట వెలసెను సుందర రమ్య వస్తు సముదాయముతో!
తెల్లని పూపులతోడను మఱియును దివ్య గంధములు జల్లినదీ!
నలుచదరముగా నున్నది మఱియును విలసిత శయాసనంబులతో! 20

నవరస భోజన భక్ష్యంబులతో నవ్య వస్త్ర సముదాయముతో!
ధౌత నిర్మలమునగు బాత్రలతో నతి సుఖంబులగు శయనములున్!
అట్టి సుందరంబగు భవనములో నా భరతుడు ముని యానతితో
ప్రవేశించి యానందము నందెను బన్నుగ సంభ్రమమును బొందెన్! 21

మంత్రులు బురోహితులును బోయిరి మానుగ రాజ కుటుంబమునూ!
భవన సంవిధానము గని మిక్కిలి బాగు బాగనిరి మోదముతో!
మంత్రులతో గూడిన భరతుం డట మానిత సింహాసనము గనీ!
సింహాసనమునకును, ఛత్రమునకు చామరములకును వినయముతో!
ప్రదక్షిణము రాజునకు జేసినటు ప్రదక్షిణంబును దా జేసెన్! 22

రాముని మదిలో స్మరించుకొనుచును రమ్యమైన సింహాసనమున్!
భక్తి పూజలను జేసి భరతుడట రక్తి చామరము జేబూని!
మంత్రి గూర్చొనెడి యాసనంబునను మానుగ దా గూర్చొనె నంతన్!
మంత్రి పురోహితులు క్రమముగా మఱి నట గూర్చుండిరి వరుసన్! 23

అటుపిమ్మట గూర్చొనె సేనాపతి నా వెనుకను నధికారియునూ
ప్రశాన్తయును గూర్చొనెను ప్రశాంతిని భవ్య హర్మ్యమున సుఖలీలన్!
అంతట యాఋషి శాసనములచే నటకొచ్చెను వే బహు నదులున్!
బురదకు బదులుగ పాయసముండెను భూరి సుగంధములను గూడి! 24

నదీతీరముల రెండు వైపులను నయముగ తెల్లని కాంతులతో
రమ్య భవనములు నిర్మితమాయెను రహి బాణీ విభు దయవలనన్!
అదే సమయమున బ్రహ్మ బంపినా యతివలు మఱి యిఱువది వేలున్!
కుబేరుడంపిన యువతుఋ వచ్చిరి కుదురుగ యిఱువది వేలటకున్! 25

సువర్ణమణి ముక్తముల తోడనూ సుందర భూషణములగూడి!
కుబేరు డంపిన స్త్రీలందఱునూ గూర్మి ప్రకాశించు నుండన్!
నందనవనమున నాడుచు బాడెడి యప్సరసలు వారందరునూ!
ఆడుచు బాడుచు నటకు వచ్చిరీ యతి యొయ్యారము నొలుకుచునూ! 26

నారదుండు దుంబురుడు, గోపుడును నయముగ రవిప్రభ గలవారున్!
గంధర్వులు నట గానము జేసిరి గడు రమ్యత భరతుని యెదుటన్!
అలంబుసయు మఱి మిశ్రకేశియును నల వామున నప్సరసలునూ!
నాట్యము జేసిరి భరతుని యెదుటను నయనాలంకారము గాగన్! 27

భరద్వాజు నాజ్ఞలచే వెలసెను భవ్య స్వర్గ మాల్యంబులుసూ!
చైత్ర రథములో బుష్పమాలికలు జేరెను ప్రయాగ క్షేత్రమునూ!
మారేడులు మార్దంగికు లాయెను మారెను దాంద్ర సువృక్షములున్!
తాళములను వేసెడి వారిగనూ తగ శశ్వత్థములును నచటన్
నృత్యము జేసెడి వారును వయ్యేను నృత్యము జేయుచునుండి రటన్! 28

సరళ తాళ తిలకంబులు మఱియును సక్తమాల వృక్షంబులునూ !
అంతఃపుర కుబ్జలు వామనులుగ నటకొచ్చిరి సంతోషమునన్!
శింశుపములు నమలక వృక్షంబులు శీఘ్రము జంబూ వృక్షములున్!
మల్లెమాలతీ జాజీ మున్నగు మహాపీయములగు బూలతలున్!
స్త్రీ శరీరముల ధరించి వచ్చిరి జేరి యాశ్రమము నిట్లనిరీ! 29

మద్యము ద్రాగెడి సైనికులారా! మఱి ద్రాగుడు మీ యిష్టంబున్!
ఆకలిగొనినా వారలు దినుడో! నమల పాయసములును నివిగో!
సుమేధ్యమగు మాంసంబులు గలవిట సురుచిరమగు బహు భక్ష్యములున్
ఆకలి దీరగ భక్షింపుడు మా యాదర సత్కారంబులతోన్! 30

ఆస్త్రీ లందఱు రుచిరలోచనలు నందమైన వారందఱునూ!
ఒక్కొక పురుషుని నలుగురు బెట్టి నొప్పున నదీ సుతీరములన్!
స్నానంబులు జేయించిరి వారిని చక్కని సుగంధ పుష్పొదులన్!
వారి శరీరంబులను దుడిచి మఱి వరుసగ ద్రాపించిరి మధువుల్! 31

వాహనముల బాలించువారలును వరుసగ గజాశ్వ ఖరములకున్
ఒంటెలకును మఱి వృషభంబులకును వెంటనె యాహారం బిడిరీ!
మహాబలులు నిక్ష్వాకు సైనికులు మఱి తమ వాహనముల కంతన్
తినుడు! దినుండని చెఱకు గడలనూ తేనెను గలిపిన పేలాలున్! 32

మధువును ద్రావుటచే నా సైన్యము మత్తిలి కడు నిస్సారమునన్!
అశ్వములను బంధించువాడు నట యశ్వములను గుర్తింపడుగా!
ఏనుగులను బంధించువాడు నట యేనుగులను గుర్తింపడుగా!
ఆనందముతో సైనికు లందఱు నట నుండిరి మైకము తోడన్! 33

సర్వకామముల దృప్తి నందినా సరసమైన భోగము లందీ!
ఎఱ్ఱచందనము మేన బూసికొని నింపుగ నచ్చెరలను గూడీ!
పారవశ్యమున నిటుల బలికిరీ బన్నుగ తమలో దా మచటన్! 34

మే మయోధ్యకును బోనేపోమూ! మేము దండకకు బోబోమూ!
ఇచటనె యుందుము! ఈ భోగములను నింపుగ నందుచు నిత్యమునూ!
భరతునకును కుశలంబగు గావుత! భవ్యుడైన శ్రీరాములకున్!
సుఖమగు గావుత! మేమిట నుందుము! సురుచిరసుఖముల నందుచునూ! 35

కాలిబంట్లు, నశ్వారోహకులును గజముల నెక్కెడి వారలునూ!
ఆముని జేసిన సత్కారములను నందుచు భరతుని పరిజనమూ!

నియమించెడి వారెవరు లేరనుచు నీల్గుచు బలికిరి స్వతంత్రులై
వేరే 'స్వర్గము' లేదు లేదు మఱి! వేల్పుసీమ యిచటనె గలదూ! 36

వేలకొలది యా సైనికు లందఱు విరుల మాలలను ధరియించీ
సంతోషముతో నృత్యము జేయుచు వింతగ కేకలు వేయుచునూ!
నవ్వుచు, బ్రేలుచు, పాటలు బాడుచు నలువైపుల బరువెత్తుచునూ!
అల్లరి పిల్లల వలె వారందఱు నాట పాటలను జెలగిరిగా! 37

అమృతంబుతో సమమగు నన్నము నా సైనికులును భుజియించీ!
అచటనున్న భక్ష్యంబుల దినగను నలరు గోర్కె వారికి గలిగెన్!
అచటనున్న బరిచారకు లందఱు నలరు స్త్రీలు మఱి సైనికులున్!
నలగని వస్త్రములను ధరియించీ యలత లేక యుండిరి తృప్తిన్! 38

అచటనున్న కుంజరము లుష్ట్రములు, అచటనున్న యెద్దులు ఖరముల్!
అచటనున్న యశ్వములు, బక్షులును నచ్చటగల యా మృగంబులున్
చక్కని యాహారము లభింపగా జిక్కని స్నేహముతో నుండెన్!
పరస్పరము గలహించుట లేదూ! బలిమిని బాధించుట లేదూ! 39

ఆ సైన్యములో దెల్లని వస్త్రము లలరి ధరింపని సైనికుడున్!
క్షుధితు డొక్కడును గానరాడుగా క్షోభను బొందిన మానవుడున్!
మాలిన్యముతో గూడిన వాడును మఱి కేశములకు బరాగమున్!
నంటినవాడును లేడు వెదికినను నానందము బొందనివాడున్! 40

అజ మాంసంబును వరాహ మాంసము నంచిత వ్యంజనములచేతన్?
ఫలరసములతో భరితములైనా పలు రసములతో నట నుండెన్!
పలుసూపములను నిండిన పాత్రలు బటుతర వాసనలను గూడీ!
వేలకొలది యన్నపు పాత్రలనూ వీరసైనికులు గనుగొనిరీ! 41

ఆశ్రమ పార్శ్వములందు బాయసపు నలరు గూపములు నేర్పడియెన్
అచటి ధేనువులు నడుగు వస్తువులు నందించుచు నుండెను వేగన్!
అచటి వృక్షములు దేనె ధారలను నలరి స్రవించుచు నుండె నటన్!
కోర్కెలు దీరని వాడును లేడూ కోర్కె లున్న వాడును లేడూ! 42

మైరేయముతో నిండిన బావులు మఱి చుట్టును బలు మాంసంబుల్!
లేడి, నెమలి, కుక్కుట మాంసంబులు వడి కుండలతో నొండుదునూ!
రాసులుగా బోయంబడి యుండెను రమ్యముగా నిరువైపులనూ!
వేలకొలది పాత్రలు గల వచటను విరివిగ పెద్దవి చిన్నవియునూ! 43

పెరుగును నింపిన పాత్రలు గల వట పెరుగును నింపిన హ్రదములునూ!
పాయసంబుతో నిండిన హ్రదములు బలురకముల దిను వస్తువులున్!
శర్కర గలిపిన యవల చూర్ణమును సరసత నేతుల దావులునూ! 44

నదుల రేవులను జూచిరి సైనికు లమలమైన యునిరిక పౌడులన్!
ఇంగుది ఫలచూర్ణములను మఱియును నింపుగ స్నానము జేయుటకున్!
అనేక యుపకరణంబుల గాంచిరి యనేక పాత్రము లందుననూ! 45

అచట గాంచిరీ యా సైనికులును నందమైన కుంచెలు గలుగూ!
దంత ధావనా సంచయంబునూ దంత కాష్ఠ సముదాయంబున్!
చందకనంపు ముద్దలును నద్దములు నందమైనట్టి వస్త్రంబులుశూ!
రంగురంగులా బాదుకలును మఱి యంగరక్ష గవచంబులునూ! 46

కాటుక భరిణలు దువ్వెనలును మఱి కడు రమ్యములగు వస్త్రములున్!
కూర్చెలు, ధనువులు, మఱి బాణంబులు గుదురుగ శయనాసనములునూ!
అలరి యుండెనట యా వస్తువులను యందించునటుల్ యప్సరసల్?
విశ్వకర్మ నిర్మాణము గాంచి నివ్వెరబోయిరి సైనికులున్! 47

గజాశ్వములు నీరును ద్రాగుటకై కమ్మని చల్లని జలములతో!
నిండిన గుంటల నట గనుగొనిరీ నిండిన సంతోషము తోడన్!
దిగుటకు ననుకూలంబైన రేవులను దీప్తిజెందు దామర కలువల్
వికసించిన సరసులను గనుగొనిరి విమలమైన మనసుల తోడన్! 48

నీలాకాశపు వన్నెలు గలిగిన కడు స్వచ్ఛములగు నుదకముతో
సుఖముగ స్నానం బాచరించుటకు సురుచిరమగు బహు సరసులునూ!
పశువులు మేయుట కొఱకై నచ్చట బన్నుగ పచ్చిక నేలలునూ!
నీల వైడూర్య రంగులు గలిగిన నీలమణులవలె తృణములునూ! 49

భరద్వాజముని యిచ్చినట్టి యా భవ్యాతిథ్యము నందుకున్!
స్వప్నలోకమున జరిగినట్లుగా సర్వజనులు నానందించెన్!
నందనవనమున దేవతలట్లుగ నా భరతుని బరివారంబున్!
భరద్వాజు నాశ్రమము నుండగా బన్నుగ యా రాత్రియు గడిచెన్! 50

సమస్త నదులును గంధర్వులు మఱి సరసిజాక్షులగు యప్సరసల్!
వచ్చినట్లుగా దిరిగి పోయిరీ నొప్పుగ యా ముని యానతిని! 51

గంధర్వాదులు బోయిన గూడను గదు బడలికతో సైనికులున్!
మైరేయము ద్రాగిన మత్తతచే మఱి యట్లే యుండిరి నేలన్!
శరీరమందున చందనాగురులు చారు గంధములు జెదరకనూ!
నలిగినట్టి యా పుష్పమాలికలు నచ్చటచ్చటను బడియుండెన్!
అట్లేయుండిరి యా సైనికులును నర్థ సుషుప్తిని మత్తతచే!

(అయోధ్యాకాండము 91వ సర్గము సమాప్తము)

★ ★ ★

## అయోధ్యాకాండము - రెండవ భాగము

### (తొంబది రెండవ సర్గము)

(భరతుడు భరద్వాజున కడ సెలవు గైకొని సేనా సమేతుడై చిత్ర కూటమునకు బయలుదేరుట)

అటుపిమ్మట నాభరత కుమారుడు నా ముని యాతిథ్యము దోడన్!
నపరివారముగ రాత్రి గడిపెనట రమ్యాశ్చర్యములను బొందెన్!
వేకువ ముని యాజ్ఞను బొందుటకై వినయ విధేయత గూడికొనీ!
భరద్వాజముని సమీపించి మఱి భక్తిని యంజలి ఘటియించీ! 1

అగ్నిహోత్రమును బూర్తిజేసికొని యట గూర్చుండిన యా ఋషియున్!
అంజలితో వచ్చిన భరతుని గని యా ఋషి యీవిధి ప్రశ్నించెన్!
అనఘుడ! భరతుడ! మా యాశ్రమమున నతి సుఖనిద్రను గడిపితివా?
పరిజనమున కంతకు నాతిథ్యము బరిపూర్ణము లభియించినదా? 2

అని వలుకగ ముని యా భరతుండును నంజలితో నిటులను బలికెన్!
ఆశ్రమము నందుండి వెలుపలకు నరుదెంచిన యా ఋషివరుకున్!
భగవంతుడ! నేనును మంత్రులునూ తగ సైన్యము నా పరిజనమున్!
సంపూర్ణము తృప్తిని బొందినదీ సకల సుఖములను నందినదీ! 3

భగవంతుడ! నిను వీడ్కొనుచుంటిని భవ్యానందము నువ్వతిలన్!
సోదరు నొద్దకు బోవుచుంటినీ సాదరముగ వీక్షింపు ననున్!
పరిచారకులను గూడి యందఱము బరిశ్రమయు గలతను వీడి!
సుఖముగ నుంటిమి! యాతిథ్యమునను సుఖ శయ్యా భోజన క్రియలన్! 4

ధర్మజ్ఞుడ! ధార్మికుడగు రాముని దారి దెలుపు!యాశ్రమమునకున్!
ఏది మార్గమో! యెంత దూరమో! యే విధముగ బోవలె నటకున్!
మహాతేజుడగు భరద్వాజుడును మఱి భరతునితో నిటు లనియెన్!
రామ దర్శనము మది కాంక్షించుచు రమ్య వచనముల నతడడుగన్! 5

భరతుడ విను! నిచ్చటికి దూరమున బన్నుగ నిర్జన వనమందున్!
మూడున్నర యోజనములు నడువగా ముదముగ గందువు శ్రీరామున్!

అందమైన సెలయేళ్లను గలవట! నతి సుందరమగు బ్రకృతియున్
చిత్ర కూటమను బర్వత మున్నది చిత్ర చిత్ర వృక్షంబులతోన్! 6

ఉత్తర పార్శ్వంబున మందాకిని యొప్పుగ నున్నది తీరములన్!
పుష్పించిన వృక్షంబులు గలవట పుష్పించిన యదవులు గలవూ!
తండ్రీ! యానది యావల బ్రక్కన యలరు చిత్రకూటంబు నటన్!
అటనున్నది యా పర్ణశాల మఱి యట నివసింతురు నీవారల్!
రాముడు సీతయు లక్ష్మణుండు నట రమణీయంబగు బ్రకృతిని! 7

మహా సేనలకు నధిపతియును మఱి మహాభాగ్యవంతుడ! వినుమా!
గజాశ్వ రథముల బయనింపుము వే కాఅడవుల దక్షిణ దిశకున్!
నైఋతి మార్గమునైన బోయినను నయముగ బోదువు నా గిరికిన్!
అన్నను జూచి యానందింతువు నటుపై నీకగు విధివ్రాతల్! 8

ప్రయాణ మనుచును విన్న రాణులును బన్నుగ దశరథు రాణులనూ!
వాహనములు దిగి యొప్పుగ యాముని వలనొప్పుగ జేరిరి చుట్టున్!
దీనవదనయగు గౌసల్యాసతి దీప్తిజెందు మునిపాదములన్!
ముట్టి యంజలిని నమస్కరించెను యిట్టె భక్తి వినయంబులతో! 8

సుమిత్రదేవియు భక్తియుక్తముగ సురుచి రక్తిని యామునికిన్!
నమస్కరించెను రెండు చేతులను నయముగ పాదము లంటుచునూ!
సఫలము కానీ కోరిక తోడను సర్వలోక నిందిత యగుచున్!
కైకయు గూడను ముని పాదములను గడు భక్తిని నంటుచు బ్రొక్కెన్!

ఆ కైకయు నా భరద్వాజునకు నలరి ప్రదక్షిణమును జేసి!
దీన మనస్సున భరతుని బ్రక్కను దీనముతో నిలుచుండె నటన్!
అంతట దృఢవ్రతుడైన మహామముని నా భరతునితో నిటులనియెన్!
నీ దల్లుల విషయమును దెలియగా నే గోరుచునుంటిని భరతా! 11

ధీమంతుడగు భరద్వాజముని తీయని మాటల భరతుండున్!
రెండు జేతులను నమస్కరించుచు నిండు హృదయమున నిటు లనియెన్!
భగవంతుడ! వినుమా నా పలుకులు భవ్యదివ్య శోకాననయున్!
ఉపవాసంబుల గృశించినదియును నున్నత బట్టపు రాణియునూ! 12

రాముని గనినా కౌసల్యానతి రహి పతివ్రతా శీలయునూ!
ధాతను గనినా యదితి విధమునను దగ శ్రీరాముని గన్నదియున్!
వనమున రాలిన పూవులు గలిగిన వర కర్ణిక శాఖయు బోలెన్!
కాంతి హీనమై గడు దుఃఖముతో గౌసల్యాసతి భుజంబునన్
ఆశ్రయించినది యా సుమిత్రయే యా లక్ష్మణు శత్రుఘ్నులనూ
కనిన వీరమాతయును దశరథునకు గడు శుశ్రూషయు జేసెడిదిన్! 13

ఎవరి వలన శ్రీరామచంద్రుడును యవని సంపదల విడనాడీ!
వనములకేగెనొ తండ్రి దశరథుడు వసుధ విడిచి స్వర్గము నేగెన్!
అట్టి యామె నాతల్లి నిజముగా గట్టిగ నమ్ముము మునివర్యా! 14

కోపస్వభావ వివేకము లేనిది కుదురుగ గర్వము గలదియునూ!
అందగత్తెనను నహంభావమును నైశ్వర్యమునం దాసక్తిన్!
అనార్యయును గ్రూరత్వము గలదియును నతి బాపంబును జేయునదియున్
నాతల్లియు కైకేయి యామె సుమ! నాకు దెచ్చె బహు వ్యసనంబుల్! 15

తామ్రాక్షుండై యా భరతుండును దగ దగ్గుత్తికతో బలికెన్!
బుసలు గొట్టెడీ సర్పంబునువలె వెస నిట్టూర్పులు విడుచుచునూ! 16

ఆ విధముగ భరతుడు బలుకుట విని యా భరద్వాజుడు నిర్మలతన్!
అర్థవంతమగు నీ మాటలనూ యతి మర్మముగా నిటు వలికెన్!
భరతుడ! తల్లిని దూషింపకుమా! భావి ఫలితములు గలుగు సుమా!
రాముని వనవాసంబున గలుగును రమ్య సుఖంబులు నీ ధరణిన్! 17

రాముని వనవాసంబున సురలకు రహి రాక్షసులకు గలుగు సుమా!
పరిశుద్ధాత్ములు బరమ ఋషులకును బరమ హితంబును గలుగు సుమా! 18

అంతట భరతుడు నా మహా మునికి యలరి ప్రదక్షిణ గావించీ!
అనతి బొందీ తన సైన్యమునకు నాజ్ఞ యిచ్చె బహు శీఘ్రముగాన్!
ప్రయాణ మగుదని చిత్రకూటమున బావన పర్వత భూములకున్!
సీతారాముల బర్ణశాలకును స్థిర భక్తిని రాముల దలచీ! 19

అటు బిమ్మట నా బహువిధ జనములు నల వాహనములపై నెక్కి!
గజాశ్వ రథములలో బయనించిరి కడు వేగము రాముని కడకున్!
హేమ కక్ష్యములు బతాకములచే విమలాలంకారంబులతోన్!
వర్షాకాలపు మేఘంబుల వలె నొప్పుగ ధ్వనులును జేయుచునూ!
గజములనూ మఱి గజకన్యలనూ గ్రక్కున గదిలెను సైన్యముతో! 19

చిన్నవి పెద్దవి యనేకంబులగు జెన్నుగ నటగల వాహనముల్!
ప్రయాణించినవి పదాతి దళములు పాదములను బయనించినవీ!
అటు బిమ్మడి కౌసల్యా సతియును నలరు స్త్రీలు సంతోషముతో
రాముని దర్శింపగ మది గోరుచు రయమున వాహనముల జనిరీ!

శ్రీమంతుండగు భరతు డంతటను శ్రీలుజిందు మంగళకరమగా!
పల్లకి నెక్కి పరివారముతో బయనమాయె కడు శీఘ్రముగా!
గజాశ్వరథముల తోడ నిండినా ఘనమగు నా సేనయు గదిలెన్!
పైకి లేచినా మహా మేఘముగ పయనమాయె దక్షిణ దిశకున్! 21

మృగములు బక్షులు గల యా వనమును మోదముతో బయనించుచునూ!
గంగానది యావలి యొడ్డున గల గడునెత్తగు గిరులను దాటీ!
నదుల మీదుగను బయనము జేసెను నయముగ యా భరతుని సేనల్! 22

ఉత్సాహముతో నురుకులు వెట్టుచు నున్నత మగు గోసల సేనల్!
గజాశ్వ రథముల గూడిన సేనయు గడు వేగము గదులుచు వనమున్!
మృగ బక్షుల భయవెట్టుచు బోయెను మెఱుపు మేఘముగ మెఱయుచునూ!

(అయోధ్యకాండములోని 92వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## తొంబది మూడవ సర్గము

### భరతుడు సైన్యముతో జిత్రకూటమునకు బోవుట

సయనించెడి యా మహా సైన్యమును బన్నుగ గాంచుచు భయపడియున్!
వనమున గల యా మృగవాయకులగు మొనని మదించిన మృగములునూ!
వరుగుతెత్తినవి తమ గుంపులతో జెరగున నాలుగు దిక్కులుకున్!
చెంగు జెంగునా యెగురుచు బోయెను రంగుగ గుంపులు గుంపులుగా! 1

పాఱిపోవు నా యెలుగుబంట్లునూ పృషత సంఘములు మృగములునూ!
గిరులపైన మఱి వనపంక్తులతో సరితలలో గనబడుచుండెన్! 2

ధర్మాతుడు మఱి దశరథాత్మజుడు ధార్మికుడగు నా భరతుండున్!
గజాశ్వ రథములు గాలిబంట్లతో గడు సంతసమున బయనించెన్!
ప్రావృట్కాలపు మేఘరాశి యల బన్నుగ గగనము గప్పినటుల్!
మహాత్ముడగు నా భరతుని సేనలు మానుగ ధరణిని గప్పె నటుల్! 3

ఆ సమయంబున గజాశ్వ రథములు నంతట వ్యాపించుట చేతన్!
గనిపింపకపోయెను బహు సమయము గన్నతల్లి భూమాతయునూ!
శ్రీమంతుండగు భరతు డంతటను స్వేదము జిందగ పయనంబై
అలసిన సైన్యము గని మంత్రులతో నా వసిష్ఠుతో నిటు లనియెన్! 4

ఈ పరిసరముల గనబడు దానిని యేను వినిన దానిని జూడన్!
భరద్వాజముని తెలిపినచోటికి నరుదెంచితి మని మదిదోచున్!
ఈ పర్వతమే చిత్రకూటమును నీ నది మందాకిని నదియున్!
దూరముగా నదె నీలమేఘముగ తోరముగా వని కన్పించెన్! 5

చిఱుకొండల సమమగు నా గజములు చిత్రకూటగిరి చరియలపై
అందమైన యా వృక్షరాసిలో నలరుచు నడుచుచు చున్నవదే!
వర్షాకాలమునందు మేఘములు వర్షధారలను గురిసినటుల్
పర్వత చరియల వృక్షరాసియును బన్నుగ విరులను రాల్పెడినీ! 6

శత్రుఘ్నా! గను చిత్రకూట మిది చిత్రముగా గన్పించెడినీ!
మకరములను నిండిన సంద్రమువలె మఱి మృగములచే నిండినదీ!
కిన్నెరలకు సంచార భూమి యిది చిన్నబోవు నా స్వర్గంబున్! 7

సైన్యము జేసెడి కోలాహలమున సకలమైన మృగ సంఘంబుల్!
ఆకాశంబున శరత్కాలమున నల వాయువులను గొట్టబడి!
చెదిరిన తెల్లని మేఘపంక్తి వలె జెదురుచున్న వదె మృగములునూ!
పరుగులెత్తుచున్నవి కనుగొనుమా! భయపడి గంతులు వేయుచునూ!
వింత ధ్వనులనూ జేయుచున్నవిదె సుంత వెనుకకును జూడకనూ! 8

ఈ పర్వత శిఖరములను గనుగొను నింపగు ప్రకృతి దృశ్యములన్!
దాక్షిణాత్యు లల పూవులు శిరసున ధరించు నటులను సానువులున్!
మేఘసమములగు శిలాఫలకముల మీరిన యందము జిందుచునూ!
పుష్పము లనియెడి యలంకారముల బొందుగ దాల్చెను గనుగొనుమా! 9

భయంకరంబగు నీ వనమంతయు బహు నిశ్శబ్దము మునుపుండెన్!
మన రాకడచే మారె నంతయును మనపురి వలె గనిపించెడినీ! 10
గుఱ్ఱపుడెక్కల కెగుర గొట్టబడి కుదురుగ ధూళియు వ్యాపించెన్!
అరణ్యమంతయు గప్పివేయగా నలవాయువు నా ప్రియమునకై
ఎగురగొట్టు చున్నది ధూళులనూ నిమ్ముగ నటునిటు దూరముగా!
ఎంత వత్సలతయో వాయువునకు వింతగ నాపై చూపెడినీ!

శత్రుఘ్నా గను సారథు లెక్కిన చిత్ర రథములును వాజులతో!
పోవుట జూడుము నరణ్యమందున బొంకముగా నీ దృశ్యములన్!
అందమొప్ప నీ నెమిళ్ళు బక్షులు జిందుచు భీతిని బరుగిడుచున్!
శీఘ్రముగా దమ నివాసములకును జేరుచున్న వవి కనుగొనుమా! 11

ఈ ప్రదేశమది మనోహరంబై నింపుగ కనబడుచున్న దహా!
స్వర్గధామ మిది తపోధనులకును స్పష్టముగా నిది నివాసమున్! 12

మృగీమృగంబులు నీ యరణ్యమున నగబడుచున్నవి యంతటనూ!
పూవులతో జిత్రించిన విధమున బొలుపుగ కన్పించును గనుమా!

ఎచ్చటి గలరో రామలక్ష్మణులు! చక్కని సీతాదేవియునూ!
సైనికులందఱు వని యంతటనూ చయ్యన వెదుకగ వలయు సుమా! 13

భరతుని బలుకులు విని సైనికులును బన్నుగ యశ్వంబుల తోడన్!
వనమునందు జని వారలు గాంచిరి వలనొప్పగ ధూమమునందున్!
ధూమాగ్రంబును జూచి వారలును రామలక్ష్మణుల గని నటులన్!
భరతుని తోడను నిటుల బలికిరీ బహు వినయంబున నీ రీతిన్! 14

మనుజులు లేనీ ప్రదేశమందున మఱి యుండదు నీ ధూమంబున్!
రామలక్ష్మణులు నిచటనె యుందురు రమ్యమైన యీ వనభూమిన్!
అటులగాక యా రాజకుమారులు నచట లేక యుండిన మఱియున్!
రామోపములగు నన్య తాపసులు రహి నివసింతురు సత్యమిదీ! 15

అమిత్ర వర్ధనుడైన భరతుడును నా పలుకులు విని వేవెంటన్!
సకలసైన్యములతో నిటు పలికెను సరసరీతి మధురాక్షరముల్!
మీరిట యుండుడు! సావధానులై మీరిక ముందుకు రావలదూ!
నేను, సుమంత్రుడు, గురుదేవుడునూ! నిర్మల మనసున బోయెదమూ! 16

సైన్యమంతయును భరతుని యానతి శాంతిని యచ్చటనే యుండెన్!
ధూమాగ్రము గనిపించు చోటునను దృష్టి నిలిపి యా భరతుండున్!
నిలిపిన సైన్యంబులను గాంచుచును లలి యెదుటను ధూమము గాంచీ!
రాముని దర్శనమగునని దలచెను రాజిలె భరతుడు మోదమునన్! 17

(అయోధ్యాకాండములోని 93వ సర్గము సమాప్తము)

★ ★ ★

## అయోధ్యకాండము రెండవభాగము

### తొంబది నాలుగవ సర్గము

[శ్రీరాముడు సీతకు చిత్రకూట శోభను జూపుట]

అటువిమ్మట నా దేవసమానుడు నావన ప్రియుడగు రాఘవుడున్!
చాలకాలమట వసించుచున్నను జెలి సీతకు ప్రియమును గూర్పన్!
తన మనో వినోదమునకు రాముడు దగ చిత్రంబగు బర్వతమున్
శచి కా దివిజేంద్రుడు జూపినటుల సతి సీతకును జూపించెన్! 1

మంగళప్రద! యీ సుందరమగు గిరి రంగుగ గాంచుచు మదియందున్!
రాజ్యభ్రంశనము బంధు మిత్రులను రహి దూరంబగుటయు గానీ!
బాధ సుంతయును దోచుట లేదూ! వేదన యిసుమంతయు లేదూ!
సృష్టి యందమంతయును విచ్చటనె సృజింపబడెనని మది దలతున్! 2

మంగళప్రద! సీతా! యిదె గాంచుము మానుగ పర్వత శోభలనూ!
నానావిధముల బక్షుల గూడుక నయనానందము గూర్చెడినీ!
గైరికాది ధాతువుల శిఖరములు గగనము నంటుచు నున్నవిగా!
రంగురంగులా కాంతికిరణములు సింగారించిన విధముననూ! 3

ధాతు విభూషితమైన పర్వతము జాతువుగద! నా స్థలములనూ!
ఈ పర్వతప్రాంతముల గొన్నిటను నింపగునట్టి వెండి వలెన్!
కొన్నిచోట్ల రక్తిమ సుకాంతులను కొన్నిచోట్ల పచ్చని కాంతుల్
కొన్ని నీలమణి వనములకు వలె కొన్ని పుష్యరాగముల వలెన్
స్ఫటికములకు వలె నక్షత్రములుగ పాదరసము వలె మెఱసెడినీ! 4

నానా మృగ గణ దీపిత మీ గిరి నానావిధముల పక్షు లిటన్!
క్రూరత్వంబును మాని యన్నియును గూడి వసించును స్నేహమునన్!
ఈ పర్వతమున ఫల పుష్పములను నింపగు నీడను నిచ్చునవీ!
అనేక జాతుల వృక్షంబులతో నలరుచుండు నీగిరి భూముల్! 5

నేరెడు వేగిస బొద్దుగ, మోరటి నిమ్మ, పనస, మారేడులునూ!
చంద్ర, మోదుగులు తినిసము, తుమ్మికి చక్కికి వెదుళ్లు. గుమ్మడులున్!
వేపలు నులిమిరి' విప్పలు, బొట్టుగు పేము, రేగి యుసిరిక చెట్టుల్!
ఏరుమద్ది, దానిమ్మ చెట్టునూ యింక గలవు నెన్నో తరువుల్! 6

మంగళప్రద! సీతా! కనుగొను మదె! మానితమగు గిరి చరియలనూ!
జంటలు జంటలుగా గిన్నెరలదె వెంట వెంట విహరించుటయున్!
మంచి మనసు గలవారు గిన్నెరలు మానితముగను నమాయకులున్!
పరస్పరము విడిపోరెన్నడునూ భవ్య ప్రేమ నాలికించుచునూ! 7

మంగళప్రద! సీతా! కనుగొనుమదె! మానితమగు గిరి చరియలనూ!
విద్యాధరులును, వారి స్త్రీలునూ విహరించెడి యా స్థలములనూ
వృక్ష శాఖలను ప్రేలాడెడి నదె! విమల వస్త్రములు ఖడ్గములున్!
ఆటల పాటల విహరించెడి యా యమర ప్రేమికుల జంటలనూ! 8

మంగళప్రద! సీతా! కనుగొను మదె! మానితమగు నాగిరి శోభన్!
కొన్నిచోట్ల ప్రవహించు చున్నదదె కూరిమి జలములు గిరిపైనీ!
కొన్నిచోట్ల ధర జీల్చుకొనుచునూ కూరిమి పైపై వచ్చునవీ!
మదోదకము స్రవియించునట్టి యా మదపు బేనుగుగ గిరి నొప్పున్! 9

మంగళప్రద! సీతా! యదె! జూడుము! మానితమగు నీ గిరి శోభన్!
నానాపుష్ప సుగంధ భరితమగు నర్మిలి మెల్లని తెమ్మెరలున్!
నా ఘ్రాణేంద్రియమునకు దృప్తినీ నయముగ గలిగించెడిని గదా!
ఆనందింపని మానవు డుండున? నలరెడి నీగిరి శోభకునూ! 10

మంగళ పద ! సీతా! విను నా మది మహిమాన్వితమగు యోచననూ!
సీతోడను, మన లక్ష్మణుతోడను నిమ్ముగ వర్షము లెన్నైనన్
వసింతు నిచ్చట హసించుచును మఱి నిసుమంతయు శోకము లేకన్!
ఈ గిరి వనములు నీ దరు దీవెలు నింపుగ నాకన్నుల నిలచెన్! 11

ఫలపుష్పములును బక్షి గణములును బ్రవహించెడి గిరి శోభలునూ!
చిత్రమైన శిఖరములు గలిగినా చిత్రకూట పర్వత మందున్!
చాల బ్రీతి గలుగుచు నున్నది సఖి! బాన! నే విడిచి రాజాలన్!
వనమునందు నే గాంచితి స్వర్గము! వసుధ యేల? మఱి సంపదలున్? 12

వనవాసముచే దండ్రి ఋణంబును నొనరగ దీర్చుటయును మఱియున్!
మన భరతునకును సంతోషంబును మది గలిగించుటయును జరిగెన్!
రెండు ఫలంబులు గలిగిన విప్పుడు దండిగ సంతసమున నుంటిన్!
చిత్రకూట సౌందర్యము గాంచుచు చింతల వంతల మానితినీ! 13

వైదేహీ! దెలుపుము నాతోదను వాసిగ నీ మనసున మాటన్!
మనోవాక్కు కర్మల సమ్మతమగు మధుర దృశ్యముల గాంచుచునూ!
చిత్రమైవ యీ చిత్రకూటగిరి చిన్మయ బ్రకృతి గాంచుచునూ!
ఆనందముగా నుంటివా సఖియ! నలరి దెలుపు ప్రియ వాక్యములన్! 14

పూర్వ పురుషులును, ప్రపితామహులును బొలుపుగ తెలిపిరి నిక్కముగన్!
ఉత్తమ జన్మము గలుగుట కొఱకై యొప్పుగ వనవాసము జేయన్!
గట్టిగ జెప్పిరి యమృత సమంబని నిట్టె యాచరించిరి వారున్!
ఆ వనవాసము జేయుచుంటినీ యలరి రాజ్యమును నొల్లక నే! 15

నీల పీతములు సితారుణములగు శిలలు మెఱయుచున్నవి యిచటన్!
వందల కొలదీ పర్వతంబునకు నందముగా నటు నిటు గలవూ!
సహజ ప్రకాశములై గ్రహములవలె సారెకు మెఱయుచు నున్న వదే
చంద్రునివలె భాసించుచున్నదీ చక్కని బర్వత మిచ్చోటన్! 16

సహజ కాంతులను రాత్రుల యందున చక్కని యీగిరి శిఖరములన్!
అగ్నులవలె యోషధులు శోభతో నతి మోదంబును గలిగించున్!
వైదేహీ! పర్వత ప్రదేశములు వలనొప్పుగ గృహములవలెనూ!
ఉద్యానములుగ యేక శిలలుగా నురుతర బ్రకాశముల నుండెన్! 17

వసుధను శీల్చుక లేచినటుల యీ వర బర్వతమును గనిపించున్!
శిఖరములంతట గానిపించు మఱి చిత్రకాంతి దేజస్సులతో!
కుష్ఠ సగర పున్నాగములును మఱి కూర్మి భూజ పత్రంబులతో!
పద్మదళములను గాముకు లిచ్చట పన్నుగ కూర్చిరి శయనములన్! 18

సీతా! కనుగొను గాముకు లిచ్చట చిదిమి వేసినా మాలలునూ!
అనేకవిధముల ఫలములు నవిగో! యద్రి యంతటను గానబడున్!
అనేకవిధముల కంద మూలములు ననేక ఫలోదకంబులునూ!
అలకా నగరిని, సౌగంథికమును నల యుత్తర కురు భూములునూ!
మించి యున్నదీ చిత్రకూటగిరి యంచిత ప్రకృతి శోభలనూ! 19

వైదేహీ! నీతో లక్ష్మణుతో వలనొప్పగ విహరించుచునూ!
ఉత్తమమగు నియ మంబుల తోడుత సత్పురుషులు జను మార్గమునన్!
కులమును, ధర్మము వృద్ధిఁ బొందగా గూర్తును యశమును బూర్వులకున్!
ఆనందంబున నిట వసియింతును నందమైన గిరివన భూమిన్!

(అయోధ్యాకాండమునందలి 94 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## తొంబది యైదవ సర్గము

[శ్రీరామచంద్రుడు సీతకు మందాకినీ నదీ శోభను వర్ణించి తెలుపుట]

రాముడంతటను బర్వత శోభను రమణి సీతకును జూపించి!
మంగళకరమగు జలములు గలిగిన మందాకిని నద వైభవమున్!
పద్మపత్ర నేత్రుండగు రాముడు బన్నుగ చంద్రనిభాననయున్!
వరారోహ యా జనక తోడను వలనొప్పగ యిట్లని పలికెన్! 1

విచిత్ర పులినములును గలదియును విమల సుందరంబై నదియున్!
హంస సారసములను గూడికొనీ నలరును వికసిత బద్మములన్!
కనుగొను జానకి! మందాకిని నది కర్మ బంధముల నిది ద్రెంపున్!
మునులు, ఋషులు నిట స్నానజపములను మోదంబున జేతురుబూజల్! 2

నదీ తీరమున పుష్పవృక్షములు నయముగ ఫల వృక్షంబులతో
రాజరాజ సౌగంధికమును వలె రమ్యకాంతులను జిందుచునూ!
ప్రకాశించుచున్నది కను మబలా! భవ్యమైన మందాకినినీ! 3

మృగయాథంబులు నీరు ద్రావుటను దగ రేవులలో జలకములున్
కలగియున్నవవి కాంతులు జిమ్ముచు గడు యానందము గలిగించున్!
ప్రియురాలా! జటలను గృష్ణాజిన ప్రీతి నార జీరల తోడన్!
మందాకినిలో స్నానము జేయుచు మఱి జప సంధ్యల వార్చుచునూ!
కనిపించెడి నీ ఋషి ముని సంఘము వినిపించును విమల ధ్వనులున్! 4

విశాలాక్షి గను! ఊర్ధ్వబాహులై వేదమంత్రముల జదువుచుహూ!
సూర్యోపాసన జేయుచుంటి రదె సురచిరముగ స్వర యుక్తముగన్!
అగ్రభాగముల గాలి కదల్చక యానది చుట్టును వృక్షములున్
పత్రపుష్పముల రాల్చుచునున్నవి! బన్నుగ చిత్ర విచిత్రముగా! 5

ఆ వృక్షములను నీ పర్వతమును నలరు నాట్య కత్తెకు వోలెన్ !
నాట్యమాడుచున్నటుల దోచునూ! నా మది యానందము బొందున్!
మృగముల యఱపులు వినిపించును జెవి మృదంగ
ధ్వనులుగ మది దలతున్!
పక్షుల ధ్వనులవి దోచు గీతిగా బన్నుగ సప్త స్వరములుగా! 6

కనుమో జానకి! మందాకిని నది కమనీయంబగు శోభలనూ!
కొన్నిచోటులను మందాకినిలో! గూరిమి మణి సమ ముదకములున్!
కొన్ని చోటులను నిసుక తిన్నెలును కొన్ని చోటులను సిద్ధులునూ!
అలరి యుండిరదె! జప తపములతో నల వైదికముల జదువుచునూ! 7

కనుమో జానకి! మందాకిని నది కమనీయం బగు శోభలనూ!
వాయువు వీచుటచే బుష్పంబులు వ్రాలి నేల బడుచున్నవదే!
జలమధ్యంబున బడుచును బువ్వులు నలల దెరలపై దేలుచునూ!
నాట్యకత్తెలకు వోలె జలములను నర్తించుచు బోవుచు నుండెన్! 8

కల్యాణీ! గను చక్రవాకములు గమ్మని స్వరములు బలుకుచునూ!
పుష్పరాశులను బాదము మోపుచు బొలుపుగ జారుచు నుండె నదే!
మంగళప్రద! నీవిట నుండగనే మందాకిని నది జూచుటయున్
అయోధ్య నగరము జూచుట కంటెను యానందంబని మది దలతున్! 9

శమదమ జపదపములను బాపముల నపహసించు నా సిద్ధులునూ!
స్నానమాచరించుటను జలము లవె సరసత క్షోభించెడి నదిలో!
స్నానమాడి జలక్రీడ సలుపుదము సరగున రమ్మా! ప్రియ సఖియా!
అలల తెరలలో నానందింతము వెలవెల వోవగ మది గలతన్! 10

తెల్లని ఎఱ్ఱని బద్మంబు లవే తీరుగ నీటను మునుచుచునూ!
చెలివలె మందాకిని నది యందున జలక్రీడలు సేయుము సఖియా!
నీటిపక్షులను నీటిని జల్లుచు నీటమునుగ జేయుము జెలియా!
పక్షుల బలుకుల ప్రతిధ్వనులతో బన్నుగ బలుకుము చిత్రముగా! 11

అడవి మృగములను పౌరజనముగా నలరుచు భావింపుము తెలియా!
చిత్రకూటగిరి యయోధ్య నగరిగ శ్రీకరముగ భావింపు మదిన్!
ఈమందాకిని సుందర నదినీ నింపుగ సరయూ నదివోలెన్
భావింపుము! నీ పక్షిగణంబును భవ్య సఖీ జనమును వోలెన్! 12

ధర్మాత్ముడు మన లక్ష్మణుండునూ దగ నా యాజ్ఞను బాలించున్!
నీవుగూడ ననుకూలవతిని గద! నిర్మల బ్రీతిని గలిగించున్!
మూడు వేళలను స్నానము జేయుచు మోదముతో నీతో గూడి!
కలిసి వసించుచు జిత్రకూటమున కంద మూలముల తేనెలనూ!
మునుల జీవితము గడుపుట మిక్కిలి మోదము గలిగించెడిని చెలీ!
అయోధ్యమీదను రాజ్యము మీదను నాశ యించుకయు లేదు సుమా! 13

రమణీ! యీ మందాకిని నదిలో రమ్యమైన మృగ యూధములున్!
గజసింహంబులు వానరంబులును గలిసి త్రాగుచున్నవి నీటిన్!
ఫలపుష్పంబుల నిండిన తరులవె! బారులు దీర్చెను దీరములన్!
గని సంతసమును బొందని మనుజుడు గానరాడు నీ సుందరతన్! 14

రఘుకుల దిలకుడు రామచంద్రు డా రమ్య సరిత మందాకినినీ
కీర్తించుచు జూపుచు దృశ్యములను కీరవాణి యా జనకకన్!
నయనాంజలి ప్రభలను జిందెడి యా ప్రియమగు బర్వత మందుననూ!
వైదేహిని గూడుక విహరించెను వలనొప్పగ యానందమునన్! 15

(అయోధ్యాకాండము 95 సర్గము సమాప్తము)

* * *

## అయోధ్యకాండము - రెండవ భాగము

### తొంబది యారవ సర్గము

### లక్ష్మణుడు సాలవృక్షమునెక్కి భరతుని సేనను జూచి కోపించుట

అంతట రాముడు నా మైథిలికిని యాగిరి నదులను జూపించీ!
ఫలపుష్పములను ననునయించుచును బర్వత ఝరియను గూర్చుండెన్!
'ఈ పుష్పములెంతో సుందరములు నీ ఫలముల రుచి జూడు సఖీ!'
అనుచు రాఘవుడు నా జానకితో నట గూర్చుండెను శిఖరమునన్ ! 1

రాముడీ విధిని గూర్చుని యుండగ రయమున భరతుని రాకడచే
సేనలధ్వనియును, లేచిన ధూళియు గాన యంతయును గప్పికొనెన్!
అటగల గజములు నా శబ్దములకు నలజడి జెందుచు భయబడుచున్
తమ యూథంబుల గూడి పారెనూ తగ నలుదిక్కులకును వేగన్ ! 2

సైన్యంబులచే గలిగిన ధ్వని విని సరగున రఘుకుల తిలకుండున్
పారిపోవు గజముల మృగములనూ బన్నుగ గాంచెను నటనుండీ!
మృగపక్షులు జేసెడి ధ్వనులను విని దగ మనసున గలతను బొందీ!
దీప్తి దేజసుండైన లక్ష్మణుని దేరిజూచి యిటులను వలికెన్! 3

సుమిత్ర నందన! లక్ష్మణ! వినుమా! సూటిగ వినబడె తుముల ధ్వనుల్!
ఆశ్చర్యంబును గలుగుచు నున్నది యదియేమో చూడుము వేగన్!
అరణ్యమందున నున్న గజములును నటు మహిషంబులు సింహములున్!

పరుగులు దీయుచునున్నవి గమమా! భయ పడుచును నలుదిక్కులకున్!
ఏరాజైనను వేటాడుటకై యిటువచ్చెనా! గమనింపుము వే!
క్రూరమృగము నేదైనను వచ్చెనా పారజూడుమా! వనరేఖన్!
పక్షులుగూడను నీ పర్వతమున పన్నుగ చరింపలేవు సుమా!
శబ్దమెటుల వచ్చినదో! విను! చను! శబ్ద తత్త్వమును గనుగొనుమా! 5

అంతట లక్ష్మణు డతి త్వరితముగా జెంతనున్న యొకసాలమునూ!
ఎక్కి జూచె నలుదిక్కుల వేగము నిక్కి జూచె తూరుపుదిశకున్!

ఉదన్ముఖుండై రామానుజుడును నువ్వెత్తున సేనను గాంచెన్!
రథగజ తురగ పదాతి దళములను రాజువ యుండుట గమనించెన్! 6

ఆ రామునితో నా లక్ష్మణుడును నతి గద్గదమున నిటు లనియెన్!
రథాశ్వ గజములతోడనున్న యొక రాజువ గాంచితి నని బలికి!
అగ్నిహోత్రమును నార్పుము సీతను అగారిబంపు బర్వతగుహకున్!
నారిని గట్టుము ధనుస్సునకు వే నయముగ దాల్పుము గవచంబున్!

అంతట రాముడు నా లక్ష్మణుతో నలరిపలికె నీ విధముననూ!
సౌమిత్రీ! యా సేన లెవ్వరివి? సరిగా జూడుము విశదముగా!
రాముని బలుకులు విని లక్ష్మణుడును రయమున కోపము బెల్లుబుకన్!
అగ్ని గాల్చినటు నా సైన్యంబును నలరి పలికె నీ విధముననూ! 8

కైకేయీ సుతు డా భరతుండును దగ యభిషేచనమును బొందీ!
నిష్కంటకమును జేయు గోర్కెతో నీతిమాలి సైన్యము తోడన్!
మనలను బరిమార్చుట కొఱకునునై మహాసేనతో నిటు వచ్చెన్!
శర శరాసనములను గూర్పుము వే సరగున నాతని యెదిరింపన్! 9

మహా సైన్యమున యరదము పైనీ మఱి ధ్వజమల్లదె! కననయ్యెన్!
కోవిదారవృక్షముతో గూడుక కూర్మి బ్రకాశించుచు నుండెన్!
విశాలమగు మ్రానును కొమ్మలుగల వేలకాంతులను జిమ్ముచునూ!
ధ్వజముపైన జిత్రింప బడినదీ దగ మన భరతుని ధ్వజమదియే! 10

అశ్వ సైన్యమును గజసైన్యంబును ననుసరించుచును నాధ్వజమున్!
సంతోషముతో నాటపాటలను దగ వచ్చుచు నుండిరి యిటకున్!
మహావీర! మన మిద్దఱ మిప్పుడు మానుగ ధనుసులు ధరియించీ!
పర్వతమును వే యధిరోహింతము బాహు బలంబును జూపంగన్! 11

తేదా కవచములను ధరించి యిట లీలగ యాయుధములతోడన్!
నెదిరింతము నా భరతుని సైన్యము లీలగ యాయుధముల తోడన్! 12

కోవిదార వృక్షముగల ధ్వజమును గోర్కెదీర మన వశమగునా?
ఇన్నికష్టముల మూలకారకుడు ఇన్నిగ భరతుని జూచెదనా?

ఎవని వలన రాజ్యము బోయినదో యెవని వలన గష్టములొచ్చెన్!
అట్టి శత్రువదె! భరతుడు వచ్చెను అతడు నాకు వధ్యుండగునూ! 13

భరతు వధించుట దోషమేమియును బన్నుగ కన్పించుట లేదూ!
అపకారిని వధియించుట యనునది యధర్మమేమియు గాదుసుమా!
భరతుడు నీకపకార మొనర్చెను బరగ ధర్మమును ద్యజియించి!
యీతని ముందుగ వధించి యావల నింపుగ బాలింతము వసుధన్! 14

రాజ్యమందు గోరికగల కైకయు రహి నా చే యుద్ధము నందున్
వధింపబడినా పుత్రుని భరతుని వలనొప్పగ యేనుగు జేతన్!
విరుగ గొట్టబడినట్టి తరువువలె విమల ధరిత్రిని బడియున్నా!
సుతుని గనుంగొని పెదబొబ్బలతో శోకముతో గ్రుంగును గాతన్! 15

పరివారముతో సబాంధవులతో సరగున వధియింతును గైకన్!
మేదినిపై కలుషంబు లన్నియును నీ దినమున దొలగును గాతన్!
రామా! జరిగిన యవమానంబున రహి యణచిన క్రోధానలమున్!
డొంకలలో విడిచిన యగ్నికివలె శంకలేక నేనను యణతున్! 16

నిశిత శరములను శత్రుసైన్యమును నీరసబఱచెద నేనిపుడే!
చిత్రకూట వన భూమి నంతటిని చిత్రారుణ కాంతుల జేతున్!
నా శరములదే జీల్చబడిన యా నవశోణితముల జిందుచునూ!
నేలవడిన యా గజాశ్వములనూ నీల్గిన యతిరథ వీరులనూ!
వనమునగల యా క్రూర మృగములును వలనొప్పగ గొనిపోవు తనూ!
ఈకాననమున భరతుని జంపి నిమ్ముగ నాతని సైన్యమునూ
ధనుర్బాణముల ఋణమును దీర్చెద దగ సంశయ మింతము లేకన్!

(అయోధ్యాకాండములోని- 96వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము—రెండవ భాగము

## తొంబది యేడవ సర్గము

[శ్రీరాముడు భరతుని సద్భావమును గొనియాడి లక్ష్మణుని శాంత బఱచుట]

కోపమూర్ఛితుడు సుసంరబ్ధుడగు గూరిమి లక్ష్మణు నోదార్చి!
రాముడిట్లు వలికెను లక్ష్మణుతో రమ్య వచనముల నీరీతిన్!
మహాబుద్ధిశాలియై నగు భరతుడు మానుగ నిటకొచ్చుట చేతన్
ధనుర్బాణములు కత్తి డాలుతో చగ పని యేమున్నది యింకన్! 1

తండ్రి వచనమును సత్యము జేయగ తగ వచ్చితి నే వనమునకున్!
వచ్చిన భరతుని జంపి యెట్లు నే వచ్చిన రాజ్యము బాలింతున్?
బంధుమిత్రులను నాశము జేసీ బొందిన సంపద నంటను నే
విషమును గలిపిన భక్ష్యములను వలె వ్రేలిని గూడను ముట్టనుగా! 2

ధర్మమర్థమును గామంబుల నే దగ రాజ్యము నే గోరుటయున్!
మీ కొఱకే నే గోరుచుంటినీ మేదిని నా కొఱకును గాదూ!
సోదరులగు మీ సంగ్రహార్థమును సుఖమును జేకూర్చుట కొఱకే
సత్యంబును నే బలుకుచుంటినీ శర శరాసనములను ముట్టీ! 3

లక్ష్మణ! విను! నే దలచు కొన్నచో లాలితముగ భూమండలమున్!
ఏలుదు! బరిపాలింతును నంతను ఇందాశ్వర్యము లేదు సుమా!
అధర్మంబుచే నింద్ర పదవియు నది నా కిష్టము గాదు సుమా!
సత్యంబును వచియించు చుంటినీ చారుశీల! లక్ష్మణ! వినుమా! 4

లక్ష్మణ! విను! నీవును భరతుండును లాలితముగ శత్రుఘ్నుడునూ,
అనుభవింపనీ సుఖసంపదలను ననుభవింప జాలను నేనున్!
మీరు లేక యే సుఖములు గలిగిన మిగుల యనుభవించిన వానిన్!
భస్మము జేయునుగా హుతాశనుడు భగ్నము జేయునుగా వానిన్! 5

భ్రాతృవత్సలుడు బ్రాణము బ్రాణము బన్నుగ నాకైకా సుతుడున్!
భరతు డయోధ్యకు వచ్చి వినియెనూ పరగ జరిగినా విషయములన్!
జటావల్కలము ధరించి నేనును జానకి తోడను నీతోడన్!
వనమున కేగిన సంగతులను విని మనమున మిక్కిలి జింతిలుచున్! 6

కుల ధర్మములను మది స్మరించుచును గూరిమి స్నేహము గలవాడై!
శోకముచే మది కలత బొందగా శూరుడనగు నా భరతుండున్!
మనల గాంచుటకు వచ్చినాడనుచు మది యందున నే దలచెదనూ!
మఱియొక కారణమునను వచ్చెనని మదిని దలంపకు సౌమిత్రీ! 7

తల్లి కైకనూ పరుషము లాడీ తల్లి కార్యముల జింతించీ!
తండ్రి ప్రసాదము నంది రాజ్యమును దగ నా కిచ్చుటకును వచ్చెన్!
మనల జూచుటకు భరతుడు వచ్చుట మంచి సమయమిది ..మన్నింపన్!
ఏ మాత్రము నప్రియము జేయగా నెంచడు భరతుడు మనసుననూ! 8

పూర్వ మెన్నడును నపకారంబును పూనిక జేయగ లేదుగదా!
ఎట్టి భయంబును గలిగింపడుగా గట్టిగ మాటలలో గూడన్!
అట్టి భయంబది యిట్టి భరతుపై చుట్టుముట్ట నీకేల మదిన్?
ఈ విధముగ శపియింప కారణము నింపుగ దెలుపుము నర్మసఖా! 9

భరతుని విషయమునను బరుషములను బలుకరాదు లక్ష్మణ! వినుమా!
అప్రియమగు వచనముల బలికి నను నలక గూర్పకుము భరతునిపై!
భరతుని గూరిచి యప్రియ వాక్యము బలికిన నన్నని నటులగునూ
భరతుని దూషించిన యా దూషణ బన్నుగ నన్నని నటు లగునూ!

పౌలుపుగ యెంతటి యాపదనైనను బుత్రులు దండ్రిని జంపుదురా?
ప్రాణ సమానుండైన సోదరుని బన్నుగ జంపున సోదరుడున్?
రాజ్యంబునకై పలుకుచుంటివా? రహి భరతునితో దెలిపెదనూ!
రాజ్యము లక్ష్మణునకు నిమ్మనుచును రయముగ తెలుపుదు నే నిపుడే! 11

రాజ్యము సౌమిత్రికి నిమ్మనుచును రమ్యముగా నే దెలుపగనే!
'అట్లే! యిచ్చెద!' ననుచును బలుకును నా భరతుండును సౌమిత్రీ!
అన్న పలుకులను విని లక్ష్మణుడును చిన్నబోయి మీరిన సిగ్గున్!
సర్వావయవములు గ్రుంగి బోయినటు శరీర మందున లక్ష్మణుడున్! 13

రాముని బలుకులు విని లక్ష్మణుడును రహి సిగ్గున మఱి యిటులనియెన్!
తండ్రి దశరథుడు నిను జూచుటకై తగ వచ్చెననీ నే దలతున్! 13

లక్ష్మణుండు సిగ్గున క్రుంగెననీ లాలితముగ రాముడు తెలిసీ!
మృదువాక్యములను బలికె దమ్మునికి మోద మరల ప్రియ మందగనూ!
మహాబాహూ! నా దశరథేశ్వరుడు మనల నందఱిని గాంచుటకై
వచ్చినాడనుచు దలచెద లక్ష్మణ! యచ్చముగా సైన్యము తోడన్! 14

వనిలో గష్టములను బరికించీ వని నుండగ రాదని మనలన్!
గృహమునకును గొని పోదలచి యటుల్ కూర్మి ప్రీతితో వచ్చెననీ!
శ్రీమంతుండగు దశరథేశ్వరుడు సీతనైననూ గొనిపోవున్
భయంకరంబగు వనమున జానకి భరింప లేదని కష్టములన్! 15

అదిగో! వీరుడ! లక్ష్మణ! జూడుము! నామహాశ్వముల గనుగొనుమా!
ప్రకాశించుచున్నవి సైన్యములో బన్నుగ రెండును దేజమునన్! 16

తండ్రిగారు యెక్కెడి గజ మదిగో! యింద్రుని గజమును బోలినదీ!
శత్రుంజయ యను బేరు గలిగినది శాత్రవులను మర్దించునదీ!
సేనాగ్రంబున గదిలి నచ్చుచును సేనాపతివలె గనిపించున్
తండ్రిగారి యాశ్వేత ఛత్రమది దగ కన్పింపదు నెందులకో!
ఏనుగుపై కనిపించుటలేదూ ఈ విషయము సంశయమయ్యెన్! 17

వృక్షాగ్రము వే దిగుము లక్ష్మణా! విమలములగు నా వచనములన్!
అని వలుకగ ధర్మాత్ముడు రాముడు నలరి వలుక లక్ష్మణుతోడన్!
అంత సుమిత్రానంద కరుడు మఱి యింతాలస్యము జేయకనూ
సాలంబును దిగి రాముని ప్రక్కన సరగున నిలిచెను నంజలితో! 18

జన సమ్మర్దము గాకుండగ యా జనపూజితుడగు భరతుండున్!
ఇచ్చిన యాజ్ఞను నౌదల దాలిచి వచ్చినట్టి యా సైన్యంబున్!
చిత్రకూట పర్వతము జుట్టునూ చిత్రముగా విడుదులు జేసెన్
గజాశ్వములతో రథముల తోడను రాణువ విడిసెను దూరముగా! 19

ధర్మంబును శిరమున దాల్చుచునూ! దగ గర్వంబును విడనాడీ!
శ్రీరాముని యనుగ్రహము గొఱకునై స్థిరమగు సంకల్పము తోడన్!
భరతునిచే గొని తేబడినట్టీ భవ్యమైన యాసైన్యంబున్!
చిత్రకూట పర్వత ప్రాంతంబున శ్రీలను జిందుచు నుండె నటన్! 20

(అయోధ్యాకాండమునందలి 97వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## తొంబది యెనిమిదవ సర్గము

[భరతుడు రామాశ్రమమును వెదుకుట — కనుగొనుట]

మానవశ్రేష్ఠుండైన భరతుడును మానుగ సేనల నట నుంచీ
తండ్రి యాజ్ఞ వని జేరిన రాముని దగ నడచుచు బోదలచె నహో!
తగిన స్థానముల సైన్యము నుంచీ తరలి ముందునకు రాకుండన్!
వినయవంతుడై శత్రుఘ్నునితో విమల వాక్యముల నిటు లనియెన్! 1

సౌమ్య యింక నరసంఘము తోడను సౌమ్యులైన వనవాసులతోన్
అరణ్య మంతయు బరిశోధింపుము నా రాముల లక్ష్మణ వీరున్!
శరచాపములను ధరించి గుహుడును సహస్ర సైనిక బంధులతో
స్వయముగ వనిలో వెదుకగ రాముని రయమున బోవలె శీఘ్రముగన్! 2

స్వయముగ మంత్రుల గురువుల తోడను సహ విప్రులు బౌరుల తోడన్!
వనము నంతటిని కాలినడకతో జనియెద రాముని వెదుకంగన్!
రాముని సీతా లక్ష్మణ వీరుల రమ్యముగా నే జూడవలెన్!
అంతవఱకు నా మనసున శాంతియు నుంతయు గలుగదు శత్రుఘ్నా! 3

చంద్రునితో సమమైన ముఖంబును నింద్రనీల సమ వర్ణుడునూ!
పద్మపత్ర నేత్రంబులు గల యా బాహుబలుడు శ్రీ రాఘవునీ!
మంగళ కరమగు నా వనంబునూ రంగుగ నే జూడంగ వలెన్!
అంతవఱకు నా మనసున శాంతియు నుంతయు గలుగదు శత్రుఘ్నా! 4

పార్థివ చిహ్నములను గూడిన యా పావన చరిత్రు రాఘవునీ!
పాద పద్మముల ధూళి నా శిరసు బన్నుగ దాల్తును శీఘ్రముగా!
ఏ మూలను గానన మందుండిన నిమ్ముగ వెదుకుదు నడచుచునూ!
అంతవఱకు నా మనసున శాంతియు నుంతయు గలుగదు శత్రుఘ్నా! 5

రాజార్హుండగు రామ చంద్రుడును రమ్యముగా నభిషిక్తుండై
తండ్రి తాతలకు సంబంధించిన దగు నాసనమున గూర్చుండీ!

ధాత్రిని బరిపాలింప వలయునూ శత్రువు లెవరును లేకుండన్!
అంతవఱకు నా మనసున శాంతియు నుంతయు గలుగదు శత్రుఘ్నా! 6

రాజీవాక్షుడు రామచంద్రునీ రమ్యమైన ముఖ మెల్లపుడున్!
చూచుచుండెడీ లక్ష్మణవీరుడు సురుచిరముగ ధన్యుడు గాదా?
సాగరపర్యంతము వ్యాపించిన సమగ్రమగు నీ వసుమతికిన్!
రాజగు రాముని యనుసరించెనూ రమణి సీత బహు ధన్య కదా! 7

నందనమున ధనదుడు వసించినటు నందమైన యీగిరి పైనీ!
రాముడు వసించె చిత్రకూటమున రమ్యకీర్తి యీ గిరిపొందెన్!
వ్యాళ నిషేవితమైనదియును మఱి నలవిగాని దుర్గమమున నౌ!
పుణ్యములెన్నో జేసికొన్నదీ పొలుపుగ జన్మాంతరములలో
అందుకనే శ్రీ సీతారాములు చందముగా నీగిరి నుండెన్! 8

తేజోవంతుడు బురుషశ్రేష్ఠుడు దీరుగ భరతుడు బలుకుచునూ!
కాలినడకతో బ్రవేశించెనూ కావనమందున శీఘ్రముగా!
మాటలయందున నేర్పుగలాడును మంచిమనసుగల భరతుండున్!
పర్వతచరియల దరుల మధ్యగా బన్నుగ నడుచుచు బయనించెన్! 9

పుష్పించిన యొక సాల వృక్షమును బొలుపుగ జేరీ భరంతుడున్!
రామాశ్రమమున ధూమము గనుగొనె రమ్యముగా ధ్వజమును బోలెన్!
బంధుమిత్రులను గూడిన భరతుడు బన్నుగ ధూమ ధ్వజము గనీ
రాము డచట వసియించు చుండెనని రయమున మనసున భావించెన్!
నదీప్రవాహము నీ దిన మనుజును నయముగ సంతస మంది నటుల్!
భరతుడు గూడను సంతస మందెను సరగున రాముని జూచినటుల్! 10

పుణ్యాత్ముండగు భరతుడు శీఘ్రము పుణ్యజనులతో గూడిన యా
రామాశ్రమమును గాంచి సైన్యమును రహి దూరముగా నియమించీ!
నిషాధిపతియగు గుహుని గూడికొని నీతివిదుండగు శ్రీరామున్
దర్శింపగ నడచెను వేగముగా దర్శించుచు బ్రకృతి లీలన్! 11

(అయోధ్యా కాండమునందు 98వ సర్గము సమాప్తము)

  

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## తొంబది తొమ్మిదవ సర్గము

### భరతుడు శత్రుఘ్నాదులతో కలసి రామాశ్రమమునకు బోవుట

సైన్యంబును నట నిలిపి భరతుడును సరసన శత్రుఘ్నుని గాంచీ!
ధూమధ్వజమును జూపి యాతనికి విమల మనస్కుడు రాఘవునీ!
దర్శించుటకై బయలు వెడలెనూ త్వరితగతిని యావన మందున్
పాదచారియై రాముని దలచుచు బన్నుగ కన్నుల నిలుపుకొనీ! 1

గురువత్సలుడగు భరతు డంతటను గూరిమి తల్లుల నందతినీ!
కొని రా బంపెను వసిష్ఠ దేవుని జనె దా ముందుగ శీఘ్రముగన్!
సుమంత్రుండునూ! యనుగమించెనూ సురుచిరముగ వారల వెనుకన్!
రాముని దర్శింపగ యభిలాషయు రహి యుండెను భరతుని వోలెన్! 2

శ్రీమంతుండగు భరతు డంతటను జెలగి నడచుచును గాంచెనటన్!
తపోవనంబున బర్ణకుటీరము దగ నొక గుటజంబును గాంచెన్!
విరువబడిన కాష్ఠముల గాంచె నట విమల బర్ణశాలకు నెదుటన్
కోయబడిన పుష్పముల గాంచె నట! కూరిమి భరత కుమారుండున్! 3

ఆశ్రమమున నివసించు వారలగు నా రాముడు లక్ష్మణ వీరుల్
పర్ణశాల మార్గము దెలియుటకై బన్నుగ వృక్షంబుల పైనీ!
దర్భలు మరియును నారచీరలును దగ గుర్తులుగా నుంచుటయున్
గాంచెను భరతుడు శత్రుఘ్నునితో గరణామయుడు సుమంత్రునితో! 4

చలికాలంబున యుపయోగార్థము చలి బాధలనూ దట్టుకొనన్!
మృగ మహిషంబుల పేడను జేసిన దగ ప్రోవుల భరతుడు గాంచెన్!
కాంతిమంతుడగు భరతు డన్నియును గాంచి సంతసము జెందుచునూ!
నడచుచునే శత్రుఘ్నునితో ననె నయముగ మంత్రులతో ననియెన్! 5

భరద్వాజముని తెలిపిన చోటికి బన్నుగ మన మిపు డొచ్చితిమీ!
మందాకిని నది సమీపమందున మానుగ యుండెడినని దలతున్!
నారచీర లవె కట్టబడినవీ నయమునగ నెత్తగు స్థలములపై
ఆశ్రమ ప్రాంతము గుర్తించుటకునై యా లక్ష్మణు డటు జేసెనొకో! 6

శైలపార్శ్వమున యడవి యేనుగులు బలువిధముల ఘీంకారములన్!
గుంపులు గుంపులుగా నట నుండెన్ నింపుగ జూడుము శత్రుఘ్నా!
వనిలో వసించు మునుల రక్షణకు వాసిగ యుంచెడి యగ్నులునూ!
ధ్వజమును వలె లేచెడి ధూమంబును దగ్గరలో గనిపించు నదే!

పురుషశ్రేష్ఠుడును వినయ వంతుడును బూజ్యుడు ఋషితుల్యుని రామున్!
కన్నులార నే గాంచెద నిప్పుడు గడు సంతసమున మది బొంగన్!
అంతట భరతుడు నాగిరివైపుకు గొంత నడిచె పరివారముతో!
మందాకిని నది జేరి మంత్రులను జిందివేదనను నిటు లనియెన్! 8

అదుగో రాముడు శత్రుఘ్నా గను! నాముని వేషము గనుగొనుమా
జనేంద్రుడును మఱి జగతికి ప్రభువగు జారు శీలు డా రాఘవుడున్
నిర్జన వనమున నివాసంబునను నిర్మలుడై గూర్చొనె నేలన్!
ఛీ! నాజన్మ మదెందులకూ? మఱి ఛీ! నా జీవిత మెందులకూ? 9

లోకనాథుడగు రామచంద్రు డిటు నాకై సర్వంబును విడిచీ!
కానన మందున వసించుచుండెను గష్టములకు లోనయ్యె గదా!
రాజ్య భోగములు రమ్య సుఖములను రహి త్యజించి పిత్రాజ్ఞలచే!
జటాధారియై నార జీరలను జరించుచుండెను ముని వోలెన్! 10

లోకజనులచే నిందను బొందితి లోకనాథుడగు రాఘవునీ!
అనుగ్రహంబును బొందెద నిప్పుడు నాతని పాదములను బడుచున్!
సీతాదేవిని శరణు వేడెదను మాతా! క్షమింపు మనియంచున్!
లక్ష్మణు నీయని క్షమింపుమనుచును లలిత వీక్షణము గాంచుమనీ! 11

ఈ విధమున విలపించుచు భరతుడు నింపగు నాగిరి ప్రాంతమునన్!
మహాపుణ్యప్రదమును మనోరథము మాధుర్యంబును జిందెడిదిన్!
తరు బూ లతలను గూడుకొనినదీ దగ మందాకిని తీరమునన్
పర్ణశాల నట జూచెను భరతుడు బరమ చిత్రకూటము నంతన్! 12

మెత్తని కుశలను గప్పబడిన యా హత్తిన సుయజ్ఞ వేదివలెన్!
తాళసాల మృదు బర్ణంబులచే దగ యావృతమై యొప్పునదీ!
మహాకార్యములు సాధించునవీ మహాసారములు గలవియునూ!
శత్రువులను నిర్మూలించునవియు శరచాపంబులు నట నుండెన్! 13

ఒరలోనున్నా రెండు ఖడ్గములు నొప్పుగ రెండును డాలులునూ!
గోడల వ్రేలాడుచు నట నుండెను గూర్మి కాంతులను జిమ్ముచునూ!
మృగములచే నెదిరింపరానిదియు మృగరాజుండెడి గుహకువలెన్!
అట్టి పర్ణశాలను నట జూచెను నా భరతుడు నా వన మందున్! 14

ఈశాన్యము వైపునకు జూచునది యింపగు విమలాగ్నులు గలదీ
పవిత్రవేదిని జూచెను భరతుడు బర్ణకుటిని యా భరతుండున్!
క్షణకాలము భరతుండు గాంచి యట క్షాత్ర ధర్మ విదుడగు రామున్!
జటామండలము ధరించి మఱియును చారు నార చీరల తోడన్!
మునివలె నాశీనుండగు రాముని గని తా నిశ్చేష్టుం డయ్యెన్! 15

ఆ రాముడు గృష్ణాజినంబునూ యా ముని చీరలు ధరియించెన్!
ఆతని చుట్టును నతిప్రకాశముగ నగ్ని కాంతులట భాసించెన్!
రాజీవాక్షుడు, మహాబాహువును రమ్య శీలు డా ధర్మజ్ఞున్
మునివలె నాశీనుండగు రాముని గని భరతుడు దుఃఖితు డయ్యెన్! 16

చక్రవర్తి తేజము గలవాడును శాశ్వత బ్రహ్మగ నొప్పుచునూ
సీతా లక్ష్మణు లట యిట నుండీ సేవింపగ మోదంబుననూ!
దర్భలు బఱచిన ధరణీతలమున దగ వీరాసనమును గూడీ!
గూర్చొని యుండిన రాముని జూచెను గూర్మి భరతుడును శిలవోలెన్! 17

శ్రీమంతుండగు భరతు డంతటను శ్రీరాముని దర్శించుచునూ!
పరితాపముచే బరిభ్రమించుచు బరువె త్తెను రాముని కడకున్!
భరతు డంతటను రాముని గాంచి భరింపరానీ వేదనతో
విలపించుచు డగ్గుత్తిక దోడుత కలత బాటునను నిటు లనియెన్! 1:

సభలందున మంత్రులను గూడికొని సరస సేవలందెడి వాడున్!
అరణ్య మృగముల మధ్యనుండి యిట నలరుచుండె విధి నేమందున్?
నావలనను గద యింత వచ్చినది నానా బాధలు రామునకున్!
ఛీ! నా జీవిత మెందులకూ? యిక నే జీవించుట యెందులకూ? 19

పట్టు వస్త్రములు ధరించు రాముడు బలు సుఖముల నుండెడి వాడున్!
అరణ్య మృగముల మధ్య నుండి యిట నలరుచుండె విధి నే మందున్?
మృగాజినములను ధరించి రాముడు మేదినిపై గూర్చుండె నిటుల్!
చిత్రమైన పుష్పముల ధరించెడి శ్రీరాముడు గన యీనాడున్!
జటాభారమును ధరించి రాముడు జనులకు దూరముగా నుండెన్! 20

శాస్త్రోక్తములగు యజ్ఞ యాగములు చారు ధర్మ సంపాదనమున్!
జేయగవలెనో రామచంద్రు డిట జేయుచుండె శ్రమ ధర్మంబున్!
చందనాదులను నుపసేవితమగు నందమైన యా శరీరమున్
మలినముచే సంలగ్నమైనదీ మాధుర్యంబును గోల్పోయెన్! 21

సుఖముల నందిన రామచంద్రు డిట దుఃఖములను గష్టము లందెన్!
హా! నిందలకును నేను జిక్కితిని యక్కట జీవిత మెందులకూ?
ప్రస్విన్నంబగు ముఖపంకజమున బలు బాషల వేదన తోడన్!
అన్న పాదముల బట్టుట కొఱకై యటుల వంగి నేలను వడియెన్! 22

మహాబలుడు నా భరతు డంతటను మానుగ దుఃఖముననను మునిగీ!
'ఆర్యా!' యని యొకసారి బలికెనూ! నటుపై మాటాడక యుండెన్!
యశస్వియగు శ్రీరాముని గాంచి యడ్డుకొనిన కంఠము తోడన్!
'ఓ ఆర్యా!' యని మాత్రము నఱచెను ఒకమాటయు బలుకక పోయెన్! 23

శత్రుఘ్నుండును నేడ్చుచు రాముని చరణకమలములపై బడియెన్!
కరుణతోని శ్రీరాముడు వారిని కౌగలించి కన్నీరొలికెన్! 24

అటు బిమ్మట శ్రీరామ లక్ష్మణులు నాసుమంత్రు గుహుడను వారిన్!
సూర్య చంద్రులట యాకాశంబున కూర్మి బృహస్పతి శుక్రులతోన్!
కలిసినట్లుగా గలిసిరి వారలు గన్నుల బండుగ యనునటులన్!
చిత్రకూటమున దరు బూలతలును జిత్రగతిని జూచెను వారిన్! 25

(అయోధ్యాకాండము 99 సర్గము సమాప్తము)

* * *

## అయోధ్యాకాండము – రెండవ భాగము

(నూఱవ సర్గము)

(శ్రీరామచంద్రుడు భరతుని కుశల మడుగుట—
రాజనీతిని యుపదేశించుట)

నారజీరలను జటాధారియై నయముగ బ్రాంజలి తో డుతనూ!
ధరణీతలమున నున్న భరతునీ దగ గాంచెను శ్రీరాముండున్!
ప్రళయకాల రవి బ్రభలను జిందెడి విలయ ప్రతాపుడు సోదరునీ
వివర్ణ వదనుండై కృశించుటను విల విల లాడుచు రాఘవుడున్!
అతికష్టము గుర్తించి యెటులనో యా భరతుని తన హస్తములన్!
లేవనెత్తి గూర్చుండ బెట్టెనూ భావమునను బహు వేదనతో! 1

రాముడు భరతుని గౌగలించుకొని రమ్య శిరస్సును ముద్దిడుచున్!
అంకమునను గూర్చుండ బెట్టుకొని యడిగె సావధానము తోడన్!
తండ్రీ! యీవిధి యరణ్యమునకును దగ వచ్చితి విపు డెందులకో!
తండ్రి దశరథుడు నెచ్చటి కేగెను తరలి వచ్చుటవు డెందులకూ?
అత డుండగ నీ వరణ్యమునకును నలరి యిటుల రాజాలవుగా! 2

దూరదేశమున నుండి వచ్చినా దుష్ప్రీతికుడవు నగు నిన్నున్!
చాల దినములకు జూచితి భరతా! సంతోషం బాయెను నాకున్!
తండ్రీ నీ విపు డెందు కొచ్చితివి యింద్రభోగమును వర్జించి!
పాదచారివై వన భూములకును సాదరముగ నిటు వచ్చితివి? 4

తండ్రీ! నీ విపు డెందుకొచ్చితివి? తండ్రి దశరథుడు కుశలంబే?
శోకముచే లోకాంతరంబునకు శూరుడ! బోవగ లేదు గదా!
బాలుడ వగుటను శాశ్వతమైనా భవ్య రాజ్య మది భ్రష్టంబై
శత్రురాజులకు జేత జిక్కెనా? మిత్రులందఱును క్షేమంబే? 4

సత్య విక్రముండైన దశరథునకు చక్కని శుశ్రూషను జేసి!
మెప్పు నొందుచుంటివి గద సోదర! మేదిని బరిపాలించుచునూ!

సత్య ప్రతిజ్ఞానంతుడు ధీరుడు సకల ధర్మముల నిలయుండున్
తండ్రి దశరథుడు గుశలమే కదా! నింద్రసముడు, స్థిరబుద్ధియునూ! 6

తండ్రీ! బ్రాహ్మణ విద్వాంసుండగు దగ కులగురువగు వసిష్ఠునీ!
యథా విధిని బూజించు చుంటివా? యీ ధాత్రిని బాలింపుచునూ!
కౌసల్యా దేవియు సుమిత్రయును కైకాదేవియు సుఖము గదా!
వాగమృతమును కర్ణపుటములను వేగము నొలికింపుము భరతా! 7

బహు శ్రుతుడును, నసూయుడు, మఱియును బన్నుగ పురోహితుండైనా!
సుయజ్ఞ నిరతము గౌరవించుచును సురచిర వినయ విధేయతలన్!
సత్కరింపుచును సకల విధంబుల సత్కర్మల గావించుచునూ!
ఎపు డే కర్మల జేయగ వలయునో యపుడా కర్మల జేయుచునూ! 8

తండ్రి! దేవతలను, దల్లులనూ, తండ్రుల, బంధుల, గురువులనూ!
వృద్ధులను, వైద్యులను, బ్రాహ్మణుల వినయమునను బూజింతువుగా!
అర్థశాస్త్రమున విశారదుండగు నల సుధన్వు గురుతర భక్తిన్!
గారవించుచుంటివి గద తండ్రీ! జేరి పూజలను జేయుచునూ! 9

నీతో సమానులును, శూరులునూ నిర్మలమతుల జితేంద్రియులన్!
ఉత్తమ కులమున బుట్టిన వారును చిత్తములను దెలిసిన వారిన్!
అట్టి వారినే నియమించితివా? గట్టిగ మంత్రుల రాజ్యమునన్!
పట్టులేని వారిని నియమించిన యిట్టె వచ్చు బహు కష్టములన్! 10

శాస్త్ర కోవిదులు, మంత్ర ధరులునూ! చక్కని యోచన గలవారున్!
అట్టి వారినే మంత్రులనం దగును మఱి దాతురు నాలోచనలన్!
సుసంవృతంబగు నాలోచనలే సూటిగ దెచ్చును విజయంబుల్!
రాజుల కవి విజయమునకు మూలము రహి నియమింపుము సరివారిన్! 11

నిద్రావశుడవు గాదుగదా! మఱి నిదురింపవు గద నిశి బవళుల్!
వివిధ కార్యముల యోచింతువు గద వేకువ జామున నిర్మలతన్!
తండ్రీ! యొంటిగ యోచింపవు గద! దగ పదిమందిని జేర్చికొనీ!
ఆలోచించుట లేదుగదా మఱి యది దెచ్చును రాజుకు గీడున్! 12

నీ మనసున గల యాలోచనలను నీ మనసున గల యత్నములున్!
నిఖిల జనుల కవి తెలియవుగా మఱి నిలిచి యుండు గద! గూఢముగా!
స్వల్పమైన సాధనములు గలది యనల్ప ఫలంబుల నిచ్చునదియున్!
యట్టి కార్య మాలస్యము జేయక యారంభింతువు గద! వేగన్! 13

ప్రారంభించిన బనులను మఱియును బన్నుగ జేసిన కార్యములున్!
తెలియవు గద! నీశత్రుల కెపుడును తెలియదుగా నీ విక ముందున్!
చేయగ దలపెట్టిన కార్యములను జేయగ దలచిన వ్యూహములన్!
తెలియుట లేదుగదా! శత్రువులకు దెలిసిన గీడగు రాజునకున్! 14

ఇతరులెవ్వరును నూహల యుక్తుల యితరోపాయంబుల చేతన్!
నీ, నీ మంత్రుల యాలోచనలను నిఖిలము దెలియుట లేదుగదా!
వేయిమంది మూర్ఖుల కంటెను మఱి విమల పండితుం డొక్కడునూ!
చాలుననుచు మది గోరుచుంటివా చక్కగ కార్యము సాధింపన్!
సంకట సమయములందు బండితుడు దగు క్షేమంబును నొనరించున్!
మూర్ఖజనులు సంకట సమయములను మొరటుగ వర్తించెదరు దగన్! 15

వేయిమంది పదివేల మొరటులను సాయముగా దరిజేర్చిననూ!
రాజు వారిచే నెట్టి సాయమును రమ్యముగా బొందడు నెపుడున్!
మేధావియు, శూరుడు, సమర్థుడును మేల్మి యమాత్యుం డొక్కండే!
మహనీయంబగు నభ్యుదయంబును మహారాజునకు సమగూర్చున్! 16

ఉత్తములగు వారిని యుత్తమమగు నురుకార్యంబుల జేయుటకున్!
మధ్యములగు వారిని మధ్యమమగు మాలిమి జేయగ కార్యములన్!
అధములైన వారిని నతి తక్కువ నలతి కార్యములు జేయుటకున్!
అటు నియమించితివా? నియమించిన యఖిల కార్యములు నెఱవేరున్! 17

వివిధ పరీక్షల నిలిచిన వారిని వినయమంతులను నగు వారిన్!
వంశాను క్రమ మందు వచ్చినా సంశయముల దీర్చెడి వారిన్!
శుచివంతుల, శ్రేష్ఠుల, నమాత్యులను శూరవరుల వియమించితివా?
శ్రేష్ఠమైన కార్యములను జేయగ శ్రేయస్కరమగు బనులందున్! 18

తండ్రి! నీ రాజ్యమున బ్రజలునూ దగ దండనలను భీతిలగన్!
నీ మంత్రులు దగ నూరకుందురా నిర్దయతను నట జూచుచునూ!
రాజు జేసెడీ యాగడంబులను రహి ఖండింపంగ వలయుజుమా!
అట్లు గానిచో ననర్థకంబగు నా రాజ్యము నస్థిర మగునూ! 19

దుర్దానములను గ్రహించు విప్రుని దురితములను నిరసించినటుల్
కాముకులను మఱి కాంతామణులును కలిగి బరిహసించిన యటులన్!
అవమానించిన యటుల మంత్రులను నవమానించుట లేదుగదా!
సద్గుణములు, వీరత్వము, శీలము సరస గుణంబులు రాజునకున్! 20

సామ దాన భేదములను శూరుడు చక్కగ ద్వేషము గలిపించీ!
అంతరంగికుల యందున భేదము వింతగ గల్పించెడి వానిన్!
అట్టివాని వే ఖండింపగవలె నాలస్యంబును జేయకనూ!
అట్లు గానిచో నశించు రాజ్యము యా రాజ్యమ్మా బరహస్తమగున్! 21

బుద్ధిమంతుడును; ధైర్యవంతుడును శుద్ధవర్తనుడు, శూరుండున్!
ఉత్తమ కులజుడు, సంతోషియునూ యురుగుణవంతుడు దక్షుండున్!
రాజభక్తి గలవానిని రాజును రహి సేనాపతి జేయవలెన్!
అట్టివానిచే సేన సంతటిని గట్టిగ జేతిసితివా నీవున్? 22

యుద్ధ విశారదులును బలవంతులు యుద్ధ కార్యముల నెఱవేర్చి!
వృద్ధులైన యా యుద్ధవీరులను శ్రద్ధగ జూచుచు నుంటివిగా!
ఇవ్వదగిన యాహార భత్యముల సవ్యముగా సైన్యంబునకున్!
రగు సమయంబున జాగు సేయకను దగ నిచ్చుచు నుండగ వలయున్! 23

తగిన సమయమున యందకపోయిన దగ యాహారము వేతనముల్!
భృత్యులు జేతురు నపకారములను బ్రీతిని జూపరు నింతయినా!
ప్రజలందఱు మఱి సహచరులందఱు బరమ ప్రీతి నుండెదరు గదా!
నీ కార్యమునకు నశువు లొదలగా నిలిచెదరా యని సిద్ధముగా? 24

స్వదేశ మందున బుట్టిన వాడును సర్వంబును దెలిసిన వాడున్!
సమయస్ఫూర్తియు, యథోక్త వాదియు సాహితి జ్ఞానము గలవానిన్!

అట్టి దూతలను నియమించితివా గట్టిగ నీ రాజ్యము నందున్!
శత్రు పక్షమున గల పదునెనిమిది తీర్థములను నీ పక్షమునన్!
పదునైదును గల దీర్థము లన్నియు బన్నుగ సమర్థులను దెలిసీ!
ముమ్మరు ముమ్మరు గూఢచారులను మోదంబున నియమించుచునూ!
పర రాజ్యంబుల బహు రహస్యముల బన్నుగ దెలియుచు నున్నావా? 26

రిపు సూదన! యోడింప బడిన యా రిపులను దుర్బలులనుచు మదిన్!
భావింపక తగు జాగరూకతను బరికించుచు నున్నావు గదా!
తండ్రీ! నాస్తికులైన విప్రులను దరికి జేర నీయవు గదరా!
మేమే బండితుల మని యనుకొందురు మిగుల యనర్థము జేసెదరూ! 27

దుష్ట పండితులు శాస్త్రము లుండగ దురర్థముల గల్పించెదరూ!
శుష్కతర్కముల నాశ్రయించెదరు శూన్యమునకు గొని పోయెదరూ! 28

తండ్రీ! వీరులు నగు మన పూర్వులు దగ రక్షించిన యయోధ్యనూ
వేయిగనుల కాపాడుచుంటివా! దగ శ్రేయస్సును గాంచుచునూ!
శత్రువులను నభేద్య మైనదని సత్యమైన నామము గగలదీ!
దృఢద్వారంబులు గజాశ్వ రథములు దీరుగ విలసిల్లెడదియునూ! 29

స్వకర్మ నిరతులు జితేంద్రియులునగు సర్వజనులు నుత్సాహముతో!
బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును బన్నుగ కూడిన నగరమునూ!
ప్రాసాదంబులు, మిద్దెలు మేడలు బండిత జనమును గూడినదీ!
సుఖ సంతోషములును సమృద్ధియును సురుచిరమగు నా యయోధ్యనూ!
కంటికి రెప్పకువలె గాపాడుచు నంటపుగా బర సంపదలన్! 30

విమలమైన మన కోసలదేశము విశాలమైనది యీ ధాత్రిన్
వేలకొలది సరిహద్దు రాళ్ళతో విలసిల్లును మనదేశంబున్!
చక్కగ వసించు జనసందోహము చారు శీలలగు ప్రమదలతో
దేవాలయములు, జలివేంద్రంబులు దివ్య సరసులను గూడినదీ! 31

సంతోషించెడి స్త్రీపురుషులతో సమాజోత్సవములను గూడీ!
పన్నుగ దున్నిన భూములు మఱియును బహు సమృద్ధియును గలదియునూ!

దేవమాతృకలు గానిది మఱియును దీరజనులు వసియించునదీ!
క్రూరమృగంబులు లేనిది మఱియును సర్వభయంబులు లేనిదియున్! 32

గనులచేత సంశోభిత మైనది కలుషాత్ములచే వర్జితమున్!
మనపూర్వులచే రక్షిత మైనది మన దేశము సుఖ సంపదలన్!
తండ్రీ! వర్ధిలుచున్నదిగద! మఱి దగ రక్షించుచు నుంటివిగా!
వ్యవసాయము గోరక్షణ జేసెడి వైశ్యులు ననుకూలంబు గదా!
అవి యాధారము సర్వజనులకును నానందము సుఖమును గలుగున్! 33

రక్షణ యాపద దొలగించుటయును రమ్యమైన సుఖజీవనమున్!
జేయునటుల బాలించుచుంటివా జేయవలయు ధర్మము నీకున్!
మంచిమాటలాడుచు స్త్రీ జనమును నంచితముగ రక్షించుచునూ!
చింతింపక ప్రమదల బలుకులు మఱి యింత రహస్యము దెలుపకనూ! 34

గజవనమును గాపాడుచుంటివా? గజ సమృద్ధియును గలదుగదా!
గజాశ్వములు నున్నవి చాలుననీ కడు దృప్తిని మది పొందవుగా!
ప్రతిదినమును నుదయంబున లేచీ! బన్నుగ యలంకరించుకొనీ!
రాజమార్గమున బోయి ప్రజలకును రమ్య దర్శనం బీయవలెన్! 35

కర్మచారులను ప్రీతి భావమున గాంక్షింపగవలె రాజునకున్
మధ్యేమార్గము నవలంబించుచు మఱి పనులను సాధింపవలెన్!
దుర్గములన్నిట ధన ధాన్యంబులు దోయ సమృద్ధియు గలదు గదా!
యంత్రంబులు శిల్పులు ధనుర్ధరులు నంతట సిద్ధము నుందురుగా!

అదాయము నధికముగా నుండియు నల్పముగా వ్యయ ముండుగదా!
ఆర్జించిన నీ కోశ మంతయును నపాత్రులకు మఱి బోదుగదా!
సురలు, పితృదేవతలు, బ్రాహ్మణులు సురుచిర యభ్యాగతులకునూ!
బంధు మిత్ర వర్గములకు చుఱియును భటులకు, భవ్య సుకార్యములన్!

వ్యయబఱచుచు నుంటివి గద ధనమును వ్యయబరుపక దుష్క్రియలందున్
ఆర్యుడు, బరిశుద్ధుడు, నుత్తముడును నైన పురుషు నారోపణలన్
ప్రశ్నింపక దోషంబు నరయకను ప్రాణము దీయుట లేదుగదా!

చౌర్యము జేసిన దోషిని బట్టుక చౌర్య దోస మది కనబడినన్!
ధనలోభముచే వదిలి వేయుటది దగ నీచముగద! రాజునకున్! 38

బహుశ్రుతునకు నీ యమాత్యులకు మఱి బహు ధనవంతునకును ధాత్రిన్!
కష్టమువచ్చిన దరిద్రునకు యిల కష్టము వచ్చిన సమదృష్టిన్
పక్షపాతమది లేకుండగ మది బన్నుగ జూచుచు నుంటివిగా! 39

లేని దోసమును నారోపించుచు లీలగ తన శాసనములచే
శిక్షించునొ యేరాజు సత్పురుషు శీలవ్రతుని గన్నీళులచే!
పుత్రాశ్వాదులు నశించు రాజుకు భూరి కష్టముల నత దొందున్! 40

వృద్ధుల, బాలుర, పండిత ప్రముఖుల విమల భావమున జూచుచునూ!
దానముచేతను, వాక్కుజేత మఱి మనసు జేత వారందఱినీ!
వశము జేసికొనుటకు బ్రయత్నమును బరగ జేయుచుంటివి గాదా! 41

గురువులు, వృద్ధులు, మునులు, దేవతలు గూరిమి వచ్చిన దేవతలన్
గుడిగోపురములకును జైత్యములకు గుదురుగ భూదేవతలకునూ!
భక్తి నమస్కృతులను జేయుచునూ రక్తి విధేయత నుంటివిగా! 42

అర్థముచే ధర్మంబును గానీ ధర్మముచేతను నర్థంబున్!
సుఖాసక్తి మఱి కామము జేతను సురుచిరముగ ధర్మార్థములన్!
బాధించుటయును లేదుగదా! సఖ! పండితుడవు! నీకును దెలియున్! 43

విజయము సాధించెడి వాడవునూ విమలహృదయ! కాలజ్ఞుడవున్!
ధర్మంబును మఱి యర్థకామముల దగు కాలంబును విభజించీ!
అనుభవించి సేవించుచుంటివా? నటుజేసిన ప్రభునకు మేలౌ! 44

సర్వశాస్త్ర గోవిదులు బ్రాహ్మణులు సర్వప్రజల హితమును మఱియున్!
నీక్షేమంబును గోరుచుండిరా? నీ వశమందున నున్నారా? 45

నాస్తికత్వమును, నసత్యంబునూ, నల్రక్రోధము, నేమరుబాటున్!
దీర్ఘసూత్రతయు సోమరితనమును దీరుగ జూడకపోవుటయున్!
పంచేంద్రియముల వశమైపోవుట బరగ యొకడె యోచించుటయున్!

కార్యసరళిదెలియని వారలతో గలిసి మంతనము సలుపుటయున్!
నిశ్చయించినా కార్యము సేయకనీరసబడి తానుండుటయున్!
ఆలోచన దాచక యుండుటయును నలరి సుకర్మలు జేయమియున్!
ఏకముగా నలువైపు శత్రువుల నేకకాలమున బోరుటయున్!
ఈ పదునాలుగు రాజ దోషములు నిమ్మగ త్యజించుచుంటివిగా!

దశపంచ చతుర్వర్గంబులు మఱి దగ సప్తాష్టపు వర్గములున్!
త్రివర్గమును మఱి త్రివిద్యలును మఱి యింద్రియ విజయము షడ్గుణమున్!
దైవమానుషములును గృత్యంబును వింశతి వర్గము బ్రకృతులున్!
మండలమును యాత్రా విధానమును దండ విధానము ననువానిన్!
సంధి విగ్రహము లను రెండింటిని సారంబును మది గ్రహియించీ!
అనుసరించుచును యథావిధముగా నాచరించుచున్నావు గదా! 48

నీవు జదివినా వేద విద్యలును నీవు జేసెడీ కార్యములున్!
సత్ఫలితంబుల నిచ్చుచున్నవా? సన్మార్గంబును జూపెడినే?
నీ భార్యయు, నీ వినిన శాస్త్రములు నిర్మల సుఖముల నిచ్చినవా? 49

తండ్రీ! నే మది గోరునట్లుగా ధర్మయర్థ కామములందున్
శ్రద్ధాభక్తుల గలిగి యుంటివా సరియగు దారుల బోవుచునూ!
ఆయుర్దాయము యశస్సు నిచ్చెడి యా దారుల బయనింతువుగా! 50

సన్మార్గంబున నడిపించునదీ సన్మంగళములు గూర్చునదీ!
తండ్రి తాత లేదారి నడిచిరొ తగు నా యాచారంబులనూ!
వానిని నీవును ననుసరించుచును నయము బాలించెదవు గదా! 51

తండ్రీ వండిన బదార్థములను దండిగ నీ వొకడవె దినకన్!
బంధుమిత్రులకు దినిపింపగవలె పరుల కనూయయు గలుగకయున్! 52

మహా బుద్ధిశాలియు, విద్వాంసుడు మహారాజు దన రాజ్యంబున్!
ధర్మబుద్ధి బాలించు ధరిత్రిని ధరణీ జనులను గాపాడున్!
తగినరీతి దండన, ధర్మములను ధరణీ తలమును బాలించీ!
మరణానంతరమును స్వర్గమునకు మానుగ బోవును గద తండ్రీ! 53

(అయోధ్యాకాండములోని-100వ సర్గము సమాప్తము)

  

# అయోధ్యకాండము - రెండవ భాగము

## నూట యొకటవ సర్గము

[భరతుడు రాముని రాజ్యము స్వీకరింపుమని కోరుట—రాముడంగీకరింపకుండుట]

లక్ష్మణ సహితుండైన రాముడును లాలితముగ గురు వత్సలుడున్!
భరతుని తోడుత నీ విధి బలికెను బ్రశ్నా పూర్వకముగ నంతన్!
నారజీరలును, జటాజినములను నయముగ ధరించి వచ్చితివీ!
ఏ కారణమున నిట కొచ్చితివో యింపుగ దెలుపుము నే విందున్! 1

కోసలదేశము విడిచి యీ విధము గూరిమి యీ వన భూములకున్
వచ్చిన కారణమేమో దెలుపుము మచ్చికతో నది యంతయునూ!
రాముని మాటలు విని భరతుండును రయమున బ్రాంజలితో రామున్
గౌగలించుకొని గద్గద స్వరమున కరుణ దొలుక నిటులను వలికెన్! 2

మహాబాహువగు దండ్రి దశరథుడు మహాకార్యమును దా జేసీ
పుత్ర శోకమును సహింపజాలక పొలుపుగ స్వర్గమునకు నేగెన్!
నాదు తల్లి ప్రేరేపణ జేతను నయముగ యా దశరథు డంతన్
మన కీర్తిని నశియింపజేసెడీ మహా పాపమును దా జేసెన్! 3

రాజ్య ఫలంబును బొంద నేరకను రమణి కైక విధవగ మారెన్!
శోకముచే గృశియించి నరకమున సోలుచు బడిపోగల దింకన్!
అట్టి దాసుడను ననుగ్రహింపుము నిట్టె యిపుడు సురరాజు వలెన్!
అభిషిక్తుండవు నగుము సోదరా! యఖిల రాజ్యమునకును నిపుడే! 4

ఈ ప్రజలును, నీ తల్లులందఱును నిటకొచ్చిరి నిను గొంపోవన్!
అనుగ్రహింపుము మమ్మందఱునూ నలరి నాదు బ్రార్థన వినుమా!
అనుపూర్వకముగ సంక్రమించినది యన్న! రాజ్య మిది నీది సుమా!
ధర్మరక్షణకు స్వీకరింపుమా! దయగొను నన్నును మిత్రులనూ! 5

శరత్కాల రా త్రియు నిర్మలమగు చారు చంద్రుని బొందినటుల్!
సమస్తమగు భూమండల మంతయు సరసత నిను బొందును గాతన్!
నేనును, సచివులు, ప్రజలందఱునూ నిను ప్రార్థించుచు నున్నామూ!
తమ్ముడ! శిష్యుడ! దాసుండను నే నిమ్ముగ దయ జూడుము నన్నున్! 6

వంశక్రమమున వచ్చు నదియునూ వంశవర్ధనము జేసెడిదిన్!
ప్రకృతి మండలము ప్రార్థన వినుమా! పన్నుగ కాదని ద్రోయకుమా!
ఇటుల బలుకుచును గైకసుతుండును నిలపై కన్నీరొలుకుచుసూ!
రాముని పాదములను శిరస్సుతో రయమున దాకెన్గు నంజలితో! 7

మాటి మాటికిని నిట్టూర్పులతో మదపుటేన్గు వలె నున్నట్టి
భరతుని రాముడు గౌగలించుకొని బరమ ప్రీతి నిటులను పలికెన్
కులీనుడును మఱి తేజశ్శాలియు గూరిమి చరిత్ర వ్రతుడవుగా!
అట్టి నీవు నీ రాజ్యంబునకై యిట్టి బాపమును జేయుదువా! 8

అరిసూదన నీయందు గొంచెమును నారయ దోసము లేదుగదా!
చిన్నతనముచే దెలియక తల్లిని చిన్న మాటలను బలుకకుమా!
పాప రహితుడవు! బుద్ధిమంతుడవు! భరతా! పెద్దలు దగు రీతిన్!
సమర్థులగు భార్యా బుత్రులనూ సరసరీతి జేయగ వచ్చున్!
శాస్త్ర ధర్మమిది పెద్దలు జెప్పిరి శాస్త్రంబుల విడరాదు గదా! 9

భార్యాపుత్రుల విషయంబుననూ ఇన్నుగ శిష్యుల విషయమునన్!
సత్పురుషులు మఱి యెటుల దెలిపిరో సరసరీతి మన మందఱమున్!
దశరథరాజుకు నట్టివారమని విశదముగా దెలియుము భరతా! 10

నారచీరలును, గృష్ణాజినమును నయముగ ధరించునటు జేసి!
అరణ్యమున నివసింప జేయుటకు నభిషిక్తునిగా జేయుటకున్!
తండ్రి, రాజునగు దశరథేంద్రునకు దగు నధికారము గలదు సుమా! 11

ధర్మవిదుడ! మన తండ్రి విషయమున తగునటు లోకులు మెచ్చగనూ!
ఎంత గౌరవము జూపింతుమొ మఱి యంత గౌరవము దల్లికినీ!
చూపగ వలయును తండ్రీ భరతా! శుద్ధ మనస్కుడ వగుము నికన్!

ధర్మశీలురగు నా తలిదండ్రులు దరలుము వనమున కని యనగా
మఱియొక విధమున యెట్లు జేయుదును మర్మము ధర్మము విడిచియు నే! 12

నీవు నయోధ్యను నిలిచి రాజ్యమును నిర్మలమతి పాలింపవలెన్!
నే నరణ్యమున ముని వేషంబున నిర్మలమతి వసియింపవలెన్!
తేజోవంతుడు దశరథ రాజిటు దెలిపెను ప్రజల సమక్షమునన్!
మనల నందఱకు నాజ్ఞాపించుచు మానుగ స్వర్గంబున కేగెన్! 13

ధర్మాత్ముండును లోకగురుండగు దశరథు బలుకుల మన్నించి!
తండ్రి యిచ్చినా యథాభాగమును దగ యుపభోక్తుడవగు మింకన్!
పదునాల్గేడులు వని వశింపగా బన్నుగ భాగము నా కిచ్చెన్ !
అట్టిదాని నే ననుభవించెదను నిట్టి గడిపెదను వన మందున్! 14

(అయోధ్యా కాండమునందు 69 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట రెండవ సర్గము

[రాముని రాజ్యము గ్రహింపుమని భరతుడు పట్టు బట్టుట—
తండ్రి మరణము నెఱింగించుట]

రాముని మాటలు విని భరతుండును రహి విషాదమున నిటు లనియెన్!
ధర్మ విహీనుడనైన నాకు నిక రాజ ధర్మమున బనియేమీ?
మన వంశములో శాశ్వత ధర్మము మానుగ జ్యేష్ఠుడు రాజగునూ!
జ్యేష్ఠ పుత్రుండుండగ కనీయసుడు నిష్టముతో రా జెటులగునూ? 1

అందుచేత వే బయనము కమ్మా! యందమైన మన యయోధ్యకున్!
కులక్షేమమునకు నభిషిక్తుడవై కూరిమి నేలుము భూప్రజలన్!
రాజును గూడ మనుష్యుడే యనుచు రహి భావింపగ వచ్చుజనుల్!
ధర్మ రక్షకుండగు రాజేంద్రుని దగ దేవతగా భావింతున్! 2

కేకయ దేశములో నే నుండగ కీర్తినిలయ! వని జన నీవున్!
సత్పురుషుడు మన తండ్రి దశరథుడు స్వర్గంబున కేగెను రామా!
సీతాలక్ష్మణ సహితుడవై వని జేరగ నీవును వెను వెంటన్!
శోకపీడితుండై మన తండ్రియు నాకమునకు వే బయనించెన్! 3

పురుషశ్రేష్ఠుడ! లెమ్మిక తండ్రికి బొలుపుగ బల దర్పణములనూ!
ఇమ్మా నేనును శత్రుఘ్నుండును నిచ్చితి మపుడే తర్పణముల్!
లక్ష్మణుండు గూడను నివ్వగ వలె లలితరీతి జలదర్పణముల్!
నిర్మలమగు మందాకిని నదిలో విలిచి యొసంగుడు దర్పణముల్! 4

ప్రియ పుత్రుం డిచ్చినది తండ్రికిని పితృలోకమున నక్షయమై!
యుండు ననుచు దెలుపుదురు లోకమున నిండుగ ప్రియపుత్రుడ వీవే!

అందుచేత నీ వపర కర్మలను బొందుగ చేయుము రఘురామా!
చిందింపుము నీ భక్తి వినయములు నందింపుము దండ్రికి భక్తిన్ ! 5

నీ విరహంబున తండ్రి దశరథుడు నిరతము గన్నీ రొలుకుచునూ !
నిను దర్శింవగ మదిని గోరుచును నిను 'రామా!' యని బిలుచుచునూ !
మనసు మరల్పక మదిని దలంచుచు మాటి మాటికిని స్మరింపుచున్!
శోకసంద్రమున మునుగుచు దేలుచు నాకంబునకు బయనించెన్! 6

(అయోధ్యాకాండము 102వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట మూడవ సర్గము

### రామాదుల విలాపము—తండ్రికి జలతర్పణము లిచ్చుట

తండ్రి మరణమను దుఃఖవార్త విని యింద్రసముడు నా రాఘవుడున్!
భరతుని వాక్యము వినుచునె రాముడు బరమ దుఃఖమున మునిగె నహో!
పరంతపుండగు రాము డంతటను భరతుని వాగ్వజ్రము జేతన్!
అరణ్యమందున గొడ్డలి జేతను నటు నఱుకగ తీవ్రధ్వనితో
పుష్పిత వృక్షము నేల గూలినటు బురుషోత్తము డటు బడె నేలన్! 1

కూల ఘాతమున కలతనందినా కుంజరంబు నిద్రించి నటుల్!
మూర్ఛనంది వేలను బడియుండిన మునిజన వరదుడు రాఘవునీ!
చుట్టును మూగిరి సోదరులందఱు సుందరి జనకజయును గూడన్!
జగతీపతియగు శ్రీరామునిపై జల్లిరి చల్లని యుదకములన్! 2

అంతట రాముడు సంజ్ఞను బొందీ కొంత తేరుకొని కన్నీరున్
నొలుకుచు దైన్యముతో విలపించుచు బలుకుట ప్రారంభించె నిటుల్! 3

ధర్మాత్ముడు శ్రీరామచంద్రుడును దండ్రి దశరథుడు శోకముతో!
స్వర్గమేగెనని విని భరతునితో ధర్మసమ్మతిని నిటు వలికెన్! 4

తండ్రి గతించిన పిమ్మట నా కిక తగ నయోధ్యతో బనియేమీ?
దశరథేశ్వరుడు లేని యయోధ్యను దగ నెవ్వరు బరిపాలించున్?
ఏ దశరథుడును నాకై యేడ్చుచు విమ్ముగ మరణించెనొ నేనున్!
శ్రాద్ధకర్మలను జేయక పోతిని శ్రద్ధాభక్తుల దానములన్! 5

అట్టి నా వలన నా రాజేంద్రుకు యెట్టి ప్రయోజనమును గలిగెన్?
ప్రేత కృత్యములు జేయని సుతుపై ప్రీతి యెందుకో నాపైనీ?
తండ్రీ! భరతా! కృతార్థుండవోయ్! తమ్ముడు శత్రుఘ్నుడు గూడన్!

జేయవలసినా ప్రేత కృత్యములు జేసిరి మీరలు నిర్వురునూ!
ప్రధాన పురుషుడు లేని యయోధ్యకు బన్నుగ నే రాజాలను నూ!
వనవాసానంతరమున గూడను జన జాలను సుమ కోసలకున్! 6

వనవాసంబును బూర్తి చేసికొని వచ్చిన నేనును నయోధ్యకున్!
ఉపదేశంబట చేయు వా రెవరు నున్నతంబులగు నీతులతో!
మంచివర్తనము గలవానినిగా నంచితముగ బలికెడు వాడున్!
కర్ణసుఖములగు వాక్యము లింకను గమ్మగ నే వినుదును నచటన్ ! 7

రాముడు భరతునితో నిటు బలికి రమ్యశీల సీతను గాంచీ!
వేదన తోడను గద్గదికముగను విపుల శోకమున నిటు వలికెన్!
సీతా! విను! నీ మామ దశరథుడు జింతను స్వర్గంబున కెగెన్!
తండ్రీ! లక్ష్మణ! తండ్రిలేడు యిక దగ భరతుండును వినిపించెన్! 8

రాముడట్లు పలుకగ లక్ష్మణుడును రహి భరతుడు శత్రుఘ్నుండున్!
కన్నీరొలికిరి సీతయు గూడను గన్నీటను నే లను దడిపెన్!
సోదరులందఱు రామచంద్రునీ సురుచిరముగ యోదార్చుచునూ!
తండ్రికి జలతర్పణము లిమ్మనుచు దగ ప్రార్థించిరి వినయముగా! 9

మామ స్వర్గమున కేగె ననుచు విని మమత గలత పెల్లుబుకగనూ!
కన్నీళ్ళను నిండిన కన్నులతో గనజాలక పోయెన్ భర్తన్!
వేదనతో శోకించు జానకిని సాదరముగ నోదార్చుచునూ!
దుఃఖితుడగు సౌమిత్రిని గాంచీ దురపిల్లుచు రాముడు వలికెన్! 10

లక్ష్మణ జనుమా! గారపిండినీ లలిత నార జీరల దెమ్మా!
స్వర్గస్థుడు మన ప్రియజనకునకు జల తర్పణములు నేయుదమూ!
సీత ముందు నడుచును మఱి నీవును సీతవెనుక నడుచుచు జనుమా!
నీ వెనుకను నే వచ్చెద లక్ష్మణ! నిండుమదిని మందాకినికిన్
మరణ నిమిత్తకమగు నీ స్నానము గమనముదారుణ మగును సుమా! 11

సదా రాజపుత్రులతో నుండెడి సత్య నిరతుడును శాంతుండున్!
విదితాత్ముండును మహామతియునూ విమల స్వభావము గలవాడున్!
అట్టి సుమంత్రుడు రామచంద్రునీ యల దశరథ సుతులందఱినీ!
ఓదార్చుచు స్నానము జేయుటకై యొనరగ జేయగ తర్పణముల్ 12
శివకరమగు మందాకిని నదిలో జేతులు వట్టుక దింపెనహో!

మంచి రేవులును సుందరమైనది యంచిత పుష్పిత కాననముల్!
గల యా మంగళ మందాకిని నది కడకు బోయి శ్రద్ధాభక్తిన్!
నలువురు సోదరులు నదిలో దిగి నయ తర్పణములు జేయుచునూ!
'తండ్రీ! నీకివె జల తర్పణములు దగ తృప్తియు గలుగును గాతన్! 13

దక్షిణాభిముఖుడై శ్రీరాముడు దగ చింతావేదన తోడన్
జల పూరితమగు దోసిలి వట్టీ జల తర్పణము లొసగుచునూ!
'రాజశేఖరా! తండ్రీ! యివిగో రహి నే నిచ్చెడి తర్పణముల్!
పితృలోకమున నున్న నీకు నివి ప్రీతి యక్షయము నగుగాతన్! 14

అటు విమ్మట శ్రీరామచంద్రుడును నలుసోదరులను గూడికొనీ!
తరలివెళ్ళి యావలి తీరమునకు దండ్రికి బిండ ప్రదానంబున్!
రేగుపండ్లతో గారపిండినీ బాగుగ ముద్దలుగా జేసీ
దర్భలు బఱచీ, వాటిపై నునిచి దగ రోదించుచు నిటు లనియెన్! 15

మేము దినెడి యాహారము నీకిదె! మేమర్పించుచు నుంటిమిగా!
సంతసమున తండ్రీ! భుజియింపుము వంతలేక కడుపారగనూ!
ఏ యన్నంబును బురుషుడు దినునో యింపుగ యాతని దేవతలున్!
ఆ యన్నమునే భుజియింతురు గద! నరమర లేకను సంప్రీతిన్! 16

నరశ్రేష్ఠుండగు రాముడు బిమ్మట నయముగ వచ్చిన మార్గమునే
నదీ తటంబును దాటివెళ్ళి యా దగ జేరె నివాసంబునకున్!
రమ్య సానువులు గల మహీధరము రయముగ యెక్కెను రాముండున్!
పర్ణశాల కడకేగి తమ్ములను బన్నుగ కౌగలి జేర్చుకొనెన్! 17

ఆ సోదరులును సీత యేడ్చుటను నా పర్వతమును ధ్వనియించెన్!
సింహంబులు గర్జించి నటులుగా తెలగె ధ్వనులు నా వనమందున్!
తండ్రికి జలతర్పణములు జేయుచు దగ జేసిన రోదన ధ్వనులున్
భరతుని సైనికు లట గూడికొనీ భయపడి పొందిరి వ్యాకులతన్! 18

భరతుడు గలిసెను శ్రీరామునితో కరుణాన్వనములు నవియె సుమా!
తండ్రి మరణమును గూర్చి రోదనలు దగజేయును నుండిరి యనుచున్!
ఆ సైనికులును ననుకొని రచ్చట యారోదన ధ్వనులను వినుచున్! 19

వారందఱు తమ స్థలముల విడిచీ వరుసను వేగము బరువిడుచున్
ఆ రోదనధ్వని వచ్చు వైపుకు ననుసరించి బోయిరి యటకున్!
కొందఱశ్వముల కొందఱు గజముల కొందఱు రథముల మీదుగనూ!
మఱికొందఱు నట కాలినడలను మానుగ బోయిరి శీఘ్రముగన్! 20

కూరిమి రాముడు వనమున కొచ్చుట కొలది కాలమైనను గూడన్!
చాలా కాలమైనటుల దలచిరీ చనిరి జనము రామాశ్రమమున్!
కలిసిన సోదరులను గాంచగనూ గడు శీఘ్రము జనులందఱునూ!
డెక్కల ధ్వని, చక్రాంతంబులధ్వని చెలగ కదిలిరా జనులంతా! 21

గజాశ్వ రథములు నడుచుట చేతను గదిలి పదాతులు నడుచుటచే!
మేఘము గ్రమ్మిన యాకాశమువలె మిగుల ధూళి ధ్వనులును నిండెన్!
ఆ ధ్వనులకు నాయడవి యేనుగులు నాడ యేనుగులతో గూడన్
మద గంధంబును వ్యాప్తి జేయుచును మఱియొక వనమునకును దరలెన్!

ఆ ధ్వనులకు విని వరాహ వృకములు నటగల వానర వ్యాఘ్రములున్!
గోకర్ణంబులు, గవయ మృగములును కోడె ద్రాచులును భయపడియెన్!
చక్రవాకములు నీటికోళ్ళునూ హంసలు, గారండవ పక్షుల్!

కొంగలు, పుంస్కోకిలలు గ్రౌంచములు జెంగున నలుదిక్కుల బాఱెన్!
ఆ ధ్వనులకు భయపడిన పక్షులును నట జేరిన యాకాశ-బున్!
మనుజులతో గ్రిక్కిరిసిన భూమియు మానుగ యాసమయము నందున్!
ఆకాశము భూమియు, నీ రెండును నలరె సమముగా కాంతులతో! 24

పురుషశ్రేష్ఠుడగు రామచంద్రుని పొలుపుగ యా జనులందఱునూ!
స్థండిలంబుపై కూర్చుని యుండగ నిండు మనసుతో గనుగొనిరి!
మంథర సహితముగా గైకేయిని విందించుచు జను లందఱునూ!
రాము సమీపము నేతెంచిరి మఱి రాలుగఱుగ నేడ్చిరి వారల్ 25

ధర్మజ్ఞుండగు రామచంద్రుడును దరుగని దుఃఖమునను మునిగీ
యున్న ప్రజల నందఱను గాంచెనూ! కన్న దల్లులుగ దండ్రులుగా! 26

కొందఱ రాముడు గౌగలించెనూ కొందఱు నా శ్రీరామునకున్
అభినందనముల నాచరించిరీ నారని ప్రీతిని గనుగొనుచున్! 27

అంతట దశరథనందనుండునూ యా బంధువులను మిత్రులనూ!
అర్హతలను దా గౌరవించెనూ! నలరు ప్రీతి వచనంబులతో! 28

(అయోధ్యాకాండము 103 సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట నాల్గవ సర్గము

### రామలక్ష్మణులు తమ తల్లులను గలిసికొనుట

రామదర్శనా కాంక్షాపరుడై రమ్యముగా నా కులగురుపున్!
దశరథు భార్యల ముందు నుంచుకొని తగ పయనించెను నా గిరికిన్!
రాజపత్నులును మందాకిని నది రమణీయత నట గాంచుచునూ!
రామలక్ష్మణులు నుపయోగించెడి రమ్యమైన రేపును గనిరీ!

కౌసల్యాసతి కన్నీ రొలుకుచు గలత నొందినా హృదయముతో
నిటుల వలికె నా సుమిత్ర తోడుచ నితర రాజవనితల తోడన్!
దేశమునుండీ వెడలగొట్టబడి దీనముగా వని వసించుచున్
రామలక్ష్మణులు నుపయోగించెడి రమ్యతీర్థ మిదియేను సుమా! 2

సుమిత్ర! విను! నీసుతుడు లక్ష్మణుడు సురుచిరముగ నా పుత్రునికై
జలముల గొనిపోవును నిచ్చటనే నలసత యింతయు లేకుండన్
నీచకార్యమని భావింపకుమూ నీరు మోయుటది నీచమనీ!
అన్నకొఱకు జేసిన పనులన్నియు నలఘు గుణంబులు శ్రేష్ఠములే! 3

ఇటుపై రాముడు భరతుని ప్రార్థన యింపుగ యభిషిక్తుండగునూ!
నీ కుమారునకు నిట్టి సేవ లిక నిరవధికముగా దప్పునులే!
దక్షిణాగ్రములుగా బఱచిన యా దర్భల రాముడు నిడినట్టి
గారపిండి పిండములను గాంచెను కౌసల్యాసతి యట నేలన్! 4

దుఃఖితయగు నా కౌసల్యాసతి దుఃఖముతో నా రాముండున్
గారపిండి పిండములను దండ్రికి గడుభక్తిని ధర నిడినట్టి
గాంచి వేదనను దశరథు భార్యల గాంచి యీవిధము బలికెనహో!
మాటలు నుడివడ మౌన రోదనను వ్రేటువడిన మృగియును బోలెన్! 5

ఇక్ష్వాకుల వంశమునకు దిలకుడు నిల యేలిన రాజేంద్రుండున్!
రాముడిచ్చినా పిండము గనుడూ! రమ్య యశస్సును గోల్పోవన్!
దేవసమానుడు భుక్త భోగుడును దిశల యశస్సును గలవాడున్!
అట్టి రాజునకు భోజనమా యిది? నటుల దలంపను యుక్తమనీ! 6

మహేంద్ర సదృశుడైన వాడునూ మహాభోగి యగు రాజిపుడున్!
ఇంగుది వృక్షపు డెలకపిండినీ యెటుల దినగలడు సంప్రీతిన్?
బుద్ధిమంతుడగు రాముడు దండ్రికి బొసగ యిచ్చె నింగుది పిండిన్!
ఇంకేమున్నది దుఃఖము జగతిని యింత కంటె చిత్రము లేదూ! 7

తండ్రికి రాముం డిచ్చినట్టి యీ గారపిండి పిండముల గనీ!
వేయి చీలికలు గాకున్నది హృది యేలయింక నే బ్రతికుంటిన్?
ఏ యాహారము బురుషుడు దినునో బొలుపుగ యాతని దేవతలున్
ఆ యాహారము దినెద రనుచునూ యాశ్రుతి వాక్యము నిజ మనుచున్
దలచుచుంటినని దశరదు సతులకు దగ తెలుపుచు బహు శోకించెన్! 8

అవిధి దుఃఖిత యగు గౌసల్యను నా సపత్నులును నోదార్చి
రామాశ్రమమునకు బోయి రందఱును రమణి కౌసల్య గూడికొనీ!
అట జని గాంచిరి యాశ్రమ మందున నాధీరుని రఘుకుల సోమున్!
దివిజ లోకమున నుండి వచ్చినా దేవతగా నుండిన రామున్!

సర్వభోగములు విడిచిన రాముని సన్యాసిగ యుండిన రామున్
గాంచి శోకమున తల్లులందఱును గావించిరి బహు రోదనలన్!
సత్యసంగరుడు బురుషోత్తముడును సముద్ధితుండై రాముండున్
తల్లులందఱికి నమస్కరించెను డగపాదములను ముట్టుచునూ! 10

ఆయత లోచనలైన వారునూ యా కౌసల్యాసతి, దాఱులునూ!
రాముని వీపున నున్న పరాగము రహి దుడిచిరి మృదుహస్తములన్! ||

సౌమిత్రియు నా తల్లులందఱికి సరసభక్తి వినయాంజలితో
రాముని తదుపరి నమస్కరించెను రమణులకును బహు వేదనతో! 11

రమణులందఱును లక్ష్మణు గూడను రాముని వలె దయజూచుచునూ!
ఆదరించిరీ యమృత హస్తముల యాతని శిరమును దువ్వుచునూ!
జానకిగూడను నత్తలందఱికి వినయమునను చరణములంటి!
నమస్కరించెను గన్నీరొలుకుచును నయముగ యెదుటను నిలువబడెన్! 12

దుఃఖార్తయు నగు సీతాదేవిని దుహితవోలె గౌసల్యయునూ!
కౌగలించుకొని కన్నీ రొలుకుచు కరుణవాక్యముల నిటు వలికెన్!
జనకుని గొమరిత దశరథు గోడలు వినయవంతుడగు రాఘవునీ
భార్యకు నీవిధి నిర్జన వనమున బాధలు బడవలసియు వచ్చెన్! 13

ఆతపసంతప్తంబగు బద్మమువలె నటు నలిగిన గలువకు వోలెన్!
దుమ్ముబట్టినా బంగారము వలె నిమ్ముగ గప్పిన మేఘములన్
చంద్రుని వలె నీ ముఖమును జూచిన సాంద్ర వేదనను మునిగెదనూ!
అగ్నివోలె నను దహించుచున్నది యరణికి వలె నా హృదయమునూ! 14

దుఃఖితయై తన తల్లి యీవిధము దురపిల్లుచు బలుకుచు నుండన్!
రాముడంత కులగురువు బాదముల రయమున వందనమును జేసెన్!
అగ్నిసమానుడు దేజోశాలియు నా వసిష్ఠుని పాదములన్!
దేవగురుని పాదములను నింద్రుడు దీనత మ్రొక్కిన యటు మ్రొక్కెన్! 15

కులగురువును రాముడు గూర్చొనగా గూర్మి భరతుడును మంత్రులతో
ప్రధాన పౌరులు, సైనికులును మఱి బన్నుగ ధర్మజ్ఞుల తోడన్!
అగ్రజుడగు నారాముని ప్రక్కన నటగూర్చుండెను వినయమునన్! 16

వీర్యవంతుడగు నా భరతుండును విమలమైన ముని వేషముతో!
శ్రీకాంతులతో జ్వలించు చుండిన శ్రీసీతారాముల ప్రక్కన్!

ప్రజాపతికి నెదురను సురపతివలె బన్నుగ గూర్చుండిన రీతిన్!
అంజలితో శ్రీరాముని ప్రక్కన నటు భరతుండును గూర్చొనియెన్! 17

అన్నపాదముల నమస్కరించుచు జెన్నుగ యట గూర్చుండిన యా
కైకసుతుండేమని పల్కునొ యని గాఢమయిన కౌతూహలమున్!
అటగూడిన జనులకు గలిగెను బహు నంతు బట్టని యాసక్తిన్! 18

సత్యధృతి గల రామచంద్రుడును సహజ ధీరుడగు లక్ష్మణుడున్
ధార్మికుడగు భరతుండును మఱియును దగ బంధువులను మిత్రులనూ!
చుట్టును గూర్చొన యజ్ఞశాలలో చుట్టును నున్న సదస్యులతో
త్రేతాగ్నుల వలె ప్రకాశించిరి తేజ మలర నా ముగ్గురునూ!

అయోధ్యాకాండమందలి 104 సర్గము సమాప్తము

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట యైదవ సర్గము

భరతుని రాముని రాజ్యము స్వీకరింపుమని కోరుట—జీవి మనిత్యమని భరతునకు రాముడు వేదాంతమును ఉపదేశించుట.

పురుషసింహులగు నా నలువురునూ విరియుచు దుఃఖము మిత్రులతో
రాత్రి గడిచినది యతికష్టముగా రమ్యప్రభాతము నేతెంచెన్!
అంతట సోదరులందఱు, శ్రేష్ఠులు చింతదీర మందాకినిలో!
స్నాన జపాదులు బూర్తి జేసికొని చనిరి రాము కడకును వారున్!

వారందఱు మౌనముగా నుండిరి పలుకలేదు మఱి యెవ్వరునూ!
భరతుడు మాత్రము బలికె నీ విధిని బన్నుగ శ్రీరాముని తోడన్!
తల్లి మాట మన్నించి యిచ్చితివి తగ రాజ్యంబును నా కపుడున్!
ఇచ్చుచుంటి రామా! నీ కిప్పుడు నింపుగ యేలుము! నీ ధరణిన్!

ప్రావృట్కాలపు జలవేగముచే బన్నుగ తెగినా కట్టవలెన్
నీవే నిలుపగ వలె నీ రాజ్యము నిలుపలేరు మఱి యెవ్వరునూ!
గుఱ్ఱపు నడకను ఖరమునకును వలె గూరిమి తార్క్ష్యుని గమనమునూ!
పక్షియెటుల బయవింపజాలదో పన్నుగ నీ గమనంబును నే
అనుసరింపజాలను శ్రీరామా! యనుకరించి నిలువగజాలన్! 3

ఇతరులు నెవనిని యాశ్రయింతురో యతని జీవితము జీవితమూ!
ఎవ డితరులను యాశ్రయించునో జీవన మది దుర్జీవనమూ!
ఒకానొకరు నాటిన వృక్షంబది యోహో! యన బాగుగ పెరిగీ
ఫల పుష్పంబుల నీయక పోయిన బన్నుగ నాతడు జింతించున్!
ఆనందబును గలుగగజాలదు నాశయంబు ఫలియింపమిచే! 4

అటులే నీవును బ్రభువుగ నుండీ నలరి మమ్ము బాలింపనిచో
నినుబెంచిన శ్రమ వ్యర్థంబగు సుమ! నిఖిలేశ్వరుడగు దశరథుకున్!
కావున మమ్మును బరిపాలింపుము కమనీయంబుగ రాజ్యమునన్! 5

రామా! రాజ్యము నభిషిక్తుడవై రవికి వోలె దేజమునందీ!
సర్వజనులు మఱి సర్వశ్రేణులును సకలము నానందింతురుగా!
కుంజరంబులును ధ్వనుల జేయుచును గుదురుగ నీతోడుత వచ్చున్!
అంతఃపుర స్త్రీలందఱు మనసున నానందంబును బొందుదురూ! 6

భరతుడు రాముని బ్రార్థించుట విని బన్నుగ యయోధ్య వాసులునూ!
'బాగున్నది!' 'బాగున్నది!' యనుచును బహు మెచ్చిరి భరతుని మదిలో!
కృతాత్ముండునూ, నాత్మ వంతుడును కీర్తివంతు డా రాఘవుడున్!
విలపించెడి యా భరతుని గనుగొని నలరి యీ విధము నోదార్చెన్! 7

ఏ పురుషునకును స్వేచ్ఛ లేదు సుమ! నించుక తన యిష్టపు రీతిన్!
పనులు జేయ సామర్థ్యము లేదూ! బన్నుగ స్వాతంత్ర్యము తోడన్!
దైవంబతనిని యిటు నటు లాగును దగ బొమ్మల నాడించునటుల్! 8

ఎంత బ్రోవుజేసిన ధనమంతయు నంత మిగులకను నశియించున్!
ఉన్నతి నందిన ప్రతి యొక్కరునూ బన్నుగ పతనము లను బొందున్!
పరస్పరంబగు సంబంధంబులు బడిపోవును విచ్ఛినములై
పుట్టిన వాడిల మరణించును సూ! యెట్టి వారలకు నిలలోనన్! 9

పక్వమైన ఫలములకు ధరిత్రిని బడిపోవుట భయ మెటుగలదో!
పుట్టిన నరునికి మరణము కంటే భూరి భయంబొకటియు లేదూ!
దృఢస్తంభంబుల గట్టిన భవనము బడిపోవును జీర్ణించినదై
జరా మృత్యువుల వశులై నరులును సరగున నశియించెదరు నిలన్! 10

గడిచిన రాత్రియు దిరిగి రాదుసుచు కమ్మని యమునా యంబువులున్
నిండిన సంద్రము లోనికి బోయీ యుండగ నది మఱలను రాదూ!
గడచిపోయినా యహోరాత్రములు గడగి గ్రీష్మమున రవి ప్రభలున్!
జలముల నన్నిటి చీల్చి వేయునటు జెలగి బీల్చు నాయువునంతన్! 11
నిలిచిన నడిచిన నీ యాయుస్సును నెమ్మదిగా దరుగుట గనుమా!
నిన్ను గూర్చి యోచింపుము మదిలో బన్నుగ యితరాలోచనలన్

మానవుడెచటికి బోయిన గూడను మఱి మృత్యువు గూడను బోవున్!
మృత్యువుతో గూర్చుండును లేచును మృత్యువు తోడను బయనించున్! 12

గాత్రమునందున ముడుతలు బడినవి కాంతి నశించెను వెండ్రుకలన్!
జీర్ణించిన పురుషుడు నే విధమున జేరు మఱల సామర్థ్యమునన్!
ఆదిత్యుడు నుదయింపగ మనుజులు సలరుచు నుందురు మోదమునన్!
అస్తమింపగనె సంతసించెదరు నటు విశ్రాంతిని జెందగనూ!
జీవిత క్షయమును మాత్రము దెలియరు భావిని యోజించుట లేదూ! 13

క్రొత్త ఋతువు గాంచుచు మానవులును క్రొత్త జివురు బూలొచ్చెననీ!
సంతోషింతురు మానవు లందఱు వింతగ చూతురు బ్రకృతినీ!
ఋతువు మారుచుండగ ప్రకృతిలో రూఢిగ ప్రాణుల యాయువుషూ!
క్షీణించెడి గతి తెలియరుగా మఱి క్షణక్షణము నాయువు దరుగన్! 14

కాష్ఠము గాష్ఠము మహాసంద్రమున గలిసియుండి పయనము జేయున్!
కొంత సేపునకు విడిపోవును నవి చెంతకు రావవి యెప్పుడునూ!
అటులే భార్యలు బుత్రులు గూడను నా బంధువులును సంపదలున్!
కొంతకాలమునకు విడిపోవుదురూ సుంత ప్రీతి మఱి లేకుండన్!
విడిపోవుట మఱి తప్పదు దప్పదు నీక్షితి యందున నందఱునూ! 15

ఏ ప్రాణియు తన స్వేచ్ఛా రీతిని నిలవర్తింపగ జాలదుగా!
మరణించిన వానికి గానీ మఱి మరణించని వానిని గూర్చి!
శోకించెడివానికి నా విషయము శోధించెడి శక్తియులేదూ! 16

బాటసారులటు బోవుచుండగా బయనించెడి ప్రతి యొక్కడునూ!
మీ వెనుకను నే వచ్చుచుంటినని మీరిన కంఠమునను బలుకున్!
పూర్వీకు లే మార్గమున నడిచిరో బొలుపుగ నడిచెద రందఱునూ!
ఆ మార్గంబున నడిచెడి వానికి సంశోకము లెందుకు వచ్చున్? 17

జలప్రవాహము వలె వేగముగా జరిగి పోవుచుండును వయసున్!
వెనుకకు మఱలను బోవుచు నుండును విను వీధుల మేఘమువోలెన్!

సుఖకరమగు ధర్మమున నిలువవలె శూరుడైన రాజెల్లపుడున్!
ప్రజలందఱు సుఖవంతులగుదురూ బన్నుగ రాజిటు జేయుటచేన్!

పుష్కలమగు దక్షిణ లిచ్చుచును భూరియజ్ఞములు జేయుటచే
తండ్రి దశరథుడు స్వర్గము నేగెను నింద్రుడు బహు సన్మానింపన్!
పోష్య వర్గమును బోషించుటచే బొలుపుగ ప్రజలను బాలింపన్!
ధర్మరీతి ధనమును బొందుటచే తండ్రి స్వర్గమున కేగె సుమా! 19

మంగళ కరములునగు కార్యంబులు మానుగ దా జేయుటచేతన్!
క్రతువు లనేకము జేయుట చేతను మతిమంతుడు నాకము నేగెన్!
అనేక విధముల క్రతువుల జేసీ యఖిల దేవతల బూజిలచీ!
పుష్కలముగ భోగములను నందీ బొలుపుగ స్వర్గంబున కేగెన్! 20

ఉత్తమ భోగములంది మఱియునూ యుత్తమ బురుషుల మన్ననలన్!
అంది తండ్రి స్వర్గమున కేగెనూ జిందంబుగ దుఃఖము బనియేలా?
మానుష దేహము విడిచి దశరథుడు మహా వృద్ధి బొందెను గాదా!
దివ్యలోకమున విహరించెడి యా దివ్య దేహమును బొందెనుగా! 21

బుద్ధిమంతుడును, శాస్త్రజ్ఞుండును బుదమి జేడయిన దశరథుడున్
నీవు నేను దుఃఖింపరాదుగా నిఖిలము దెలిసిన వారముగా!
ధీరులైన ధీమంతు లెపుడునూ దీనత నొందరు దుఃఖమునన్!
శోకము, రోదన విలాపంబులును సూరిజనులు విడువగ వలయున్! 22

తండ్రీ! భరతా! స్వస్థుడ వగుమా! తగ శోకింపకు వేదననూ!
తండ్రి యాజ్ఞ బాలింపు! మయోధ్యను దగ బాలింపు భూప్రజలన్!
తండ్రీ! భరతా! తండ్రి యాజ్ఞ నే దప్పరాదు నీవును గూడన్!
తండ్రి జెప్పినా దానిని భక్తిసి దగు విధమున బాలింపవలెన్! 23

అతడు మనకును దండ్రి గదా మఱి నార్మబంధువును నతడుగదా!
అందుజేత నే తండ్రి యానతిని వందనముల చే గైకొందున్!
వనమున నే నివసించుట ద్వారా యనయము బాలింతును నాజ్ఞన్! 24

పరలోకంబున సుఖమును గోరెడి పరమ పురుషుడును ధార్మికుడై
క్రూరత్వంబును సుంతలేక మఱి గురు శుశ్రూషను జేయవలెన్!
తండ్రియైన దశరథ రాజేంద్రుని ధర్మ చరిత్రను దెలిసికొనీ!
నీవుగూడ నీ యాత్మ ధర్మమును నిర్వర్తింపుము దగురీతిన్! 25

మహాత్ముడును ప్రభువైన రాముడును మానుగ యిటులను భరతునితో
తండ్రి యాజ్ఞలను బరిపాలింపుము దగు నుత్తమమగు మాటలనూ!
మహార్థమును బలుకుచును విరమించెను మాటలు రాకను భరతుండున్!
మౌనమూనె! యట జనులందఱునూ మదిలో వేదన బొందగనూ! 26

(అయోధ్యాకాండములోని 105వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము- రెండవ భాగము

## మూట యాఱవ సర్గము

భరతుడు మఱల రాముడు అయోధ్యకు వచ్చి రాజ్యమును గ్రహింపుమని కోరుట

అర్థవంతమగు బలుకులు బలికి నా రాముండును భరతునితో!
విన్నకుండగా నా భరతుండును నన్న రామునికి నిటులనియెన్! 1

దుఃఖము వలనను బాధగాని మఱి సుఖముచేత సంతోషంబున్!
బొందవుగా! సరి నీతో నెవ్వరు బొందుగ యీ లోకమునందున్!
వృద్ధులందఱును గౌరవించెదరు శ్రద్ధగ వారల జేరెదవూ!
సంశయముల నన్నిటి నడిగెదవూ! సాదు సేవలను జేయుచునూ! 2

మరణించిన యీ మనుజుని యందును మఱి జీవించిన మానవునీ!
విషయము నందున యెట్లుండునొ మఱి విశదము దోడుత సమదృష్టిన్!
అట్లే యుందువు సజ్జన దుర్జన సరస రాగ ద్వేషాదులతో!
నుండక నిశ్చల బుద్ధి నుండెదవు నిండుగ నిష్కల్మష బుద్ధిన్!
అట్టి నీకు నేది యీ లోకములో నాత్మ దుఃఖమును గలిగించున్! 3

మహారాజ! వస్తువుల యందు మఱి మానుగ జను లందఱిలోనన్!
తారతమ్యమును గుర్తెఱుగుదువూ ధర్మజ్ఞుడవును శాస్త్రములన్!
అట్టి నీవు నా బాధను బొందుట యభిలషణీయము గాదుగదా!
తిరిగి రమ్ము కోసలకు ధరిత్రిని బరిపాలింపుము భూ ప్రజలన్! 4

మహాత్మ! శ్రీరఘురామా వినుమా! మానుగ నా యీ వచనములన్!
దేవసముండవు! సత్యవ్రతుడవు దేవగురుని సమ బుద్ధివియున్!
సర్వజ్ఞుండవు, సర్వదర్శివియు సమ దృష్టియు గలవాడవునూ!
బుద్ధిమంతుడవు! నీ విటులాడుట యొద్దిక కాదుగదా! చూడన్! 5

ఇట్టి గుణంబులు గలవాడవునూ నింపుగ చావును బుట్టుకయున్!
ఎఱిగినవాడవు! నిట్టి దుఃఖమున యిల శోకించుట యుక్తంబా?

ప్రవాసమున నే నున్న సమయమున పాపకార్య మది జరిగినదీ!
తల్లిజేసినా కార్యంబున నను దగ శిక్షించుట న్యాయంబా?
అనుగ్రహింపుము! నంజలి యిదిగో! అన్నా! దోసము సహియింపూ! 6

ధర్మ పాశమున బంధితుండనై ధర్మంబునకును భయబడుచున్!
పాప కార్యమును జేసిన తల్లిని బన్నుగ వధియించుట లేదూ!
పవిత్ర వంశమునందు బుట్టినా పవిత్ర కర్మలు జేసిన యా
దశరథేశ్వరుని కుమారుండనై ధర్మము దెలిసిన వాడ జామీ! 7

అధర్మ కార్యము నెట్లు జేయుదును? నా తల్లిని వధియింతు నెటుల్?
గురుడు కర్మశీలుడు, వృద్ధుండును గూర్మి దశరథుడు మరణించెన్!
ఈ కారణమున తండ్రిని సభలో నిమ్ముగ నిందించుట లేదూ?
అతడు జేసినా యకార్యంబులను కథగా పేర్కొన లేనిచటన్! 8

ధర్మజ్ఞుండగు నాడెవ్వడునూ ధర్మంబును దుంగను ద్రొక్కి!
స్త్రీకి బ్రియము జేకూర్చుట కొఱకై చిత్తమునందున చంచలుడై!
ధర్మార్థములకు విరుద్ధమైనా ధర్మంబునకును జలమొదిలీ!
ఇట్టి పాప కార్యమును జేసెకద! యిట్టి యాపదలు సమకూడెన్! 9

వినాశకాలమునందు బ్రాణులకు విపరీతంబగు బుద్ధులునూ!
అను లోకోక్తియు సత్యంబాయెను నా దశరథుడును నటుజేసెన్!
కోపంబున యజ్ఞానము వలనో గూడిన ధర్మాతిక్రమణన్!
వారు జేసినా యపకార్యములను వాసిగ వెనుకకు ద్రిప్పవలెన్! 10

తండ్రి జేసినా యుత్తమ కార్యము దనయుడు నభినందింప వలెన్!
అట్టి వాడె నూ! పుత్రుడు జగతిని నట్లు కానిచో శత్రువగున్!
నధర్మ కార్యము నభినందించిన యాతడు బుత్రుడు గాదు సుమా! 11

అందువలన నీవట్టి సుపుత్రుడ వగుము రామ! యీ లోకమునన్!
అందఱు నిందించిరి మన తండ్రిని నాతడు జేసిన పాపములన్!
నన్ను బొందకుండును నా పాపము నయముగవే రక్షింపు మికన్!

కైకేయిని మఱి నన్ను తండ్రినీ! గల మిత్రులనూ బంధువులన్
పౌర జానపదులను రక్షింపుము బన్నుగ సమస్త రాజ్యంబున్! 12

అరణ్య మెచ్చట? క్షాత్ర ధర్మ మెట? యీ జట లెచ్చట? పాలనమున్!
ఈ కృశకర్మల నాచరింపకుము! నీ క్షితి రాజులు సవ్వెదరూ!
రాజ్యమునం దభిషిక్తుడగుటయే రహీ క్షత్రియునకు ధర్మంబున్!
దానిచే నతడు ప్రజల నందఱిని దగ పంపాలించును ధాత్రిన్! 13

ప్రత్యక్షంబగు ఫలముల నిచ్చెడి పరగ రాజధర్మము విడచీ!
సంశయాస్పదము నలక్షణంబును! యనిశ్చితము గాలాంతమునన్!
ఫలమునిచ్చెడిది తాపస ధర్మము బన్నుగ క్షత్రియు డెవడైనా!
యాశ్రయించునా? యనుగమించునా? యన్నిటి కాదని మునివృత్తిన్! 14

క్లేశమువలనను గలిగిన ధర్మము నాశ్రయింపగను దలచినచో!
ధర్మరీతి భావించు క్లేశమును దగురీతిని బొందుము రామా!
ఆశ్రమములలో గృహస్థాశ్రమము నత్యుత్తమమని చెప్పుదురూ!
అట్టి యాశ్రమము నేల విడిచెదవు నడవుల దిరుగుచు మునివృత్తిన్? 15

విద్యచేత మఱి స్థానము జేతను వివిధ గుణములను బుట్టుకచే
చిన్నవాడనుగ! నీవుండగనే సింహాసన మెటు నెక్కుదునూ?
బాలుండను నే బుద్ధిచేతనూ బన్నుగ గుణముల స్థానముచే
తక్కువవాడును నీవు లేనిచో దగ జీవింపగ గోరను నే!

తండ్రిగారిచే సంక్రమించినా దగ నిష్కంటక రాజ్యంబున్!
ధర్మరీతి బంధువులను గూడక ధర పాలింపుము భద్రముగన్!
అమాత్యాది ప్రకృతులు, వసిష్ఠుడు నా రుత్విజులును నిచ్చటనే
వేదమంత్రముల నభిషేకింతురు విమల రాజ్యమున కంతటికిన్!

సర్వలోకముల జయించినట్టి శచీప్రియునకు సురరాజువలెన్!
అభిషిక్తుడవై మేమందఱమును నలరుచు నీ వెంటను రాగా!
అయోధ్యపురమును పాలించుటకై నరుగుము! జయజయ ధ్వానములన్! 18

దేవ పితౄ రుషి రుణముల దీర్చుచు దేవ! శత్రువుల నణచుచునూ!
మిత్రుల కోరికలను దీర్చుచునూ! మిక్కిలి నేలుము! నను గూడన్!
నీవభిషిక్తున వగుటచేతనే నీ మంత్రులు సంతసమందీ
ఆటపాటలను నయోధ్య నగరిని నలరింతురు గావుత! నెపుడున్!

భయపడి నీశత్రువు లందఱునూ పాఱిపోవుదురు దిక్కులకున్!
నాతల్లికి యిల గలిగిన శాపము నయముగ దొలగింపుము ప్రీతిన్!
తండ్రి దశరథుడు జేసిన పాపము దగ తొలగింపుము సంప్రీతిన్!
శిరమువంచి ప్రార్థించు చుంటినీ శ్రీమహేశ్వరుడు ప్రాణులపై!
దయజూపిన విధమున బాంధవులను దయజూడుము శ్రీరఘురామా!

నా ప్రార్థనలను గాదని బలుకుచు నయముగ వని నీ వేగినచో
నేమగూడ నీ యరణ్యములకును నీతో బాటుగ వచ్చెదనూ!
ఆవిధి శోకము చేత భరతుడును నటుల బలుక శ్రీరాముండున్
తండ్రివచనముల నిలిచెను రాముడు దగ యయోధ్యకును రా ననియెన్!

రాముని యందున ధైర్యము గాంచీ రహి దుఃఖించిరి వేదనతో!
వేదనతో బాటుగ వారందఱు విమలమైన సంతోషంబున్!
అయోధ్య నగరికి రానని బలుకగ అందఱు బొందిరి దుఃఖమునూ!
స్థిరప్రతిజ్ఞగల రాముని గాంచీ విరియించిరి సంతోషంబున్! 23

ఆవిధి బలికెడి భరతుని గాంచీ యా రుత్విజులును, నా ప్రజలున్.
మూర్ఛవంది కన్నీళ్ళను దరిగిన ముదితలు తల్లులు స్త్రీజనముల్!
భరతుని సుందర భ్రాతృభక్తిగని పరవశులై కీర్తించుచునూ!
సవినయంబుగా రామచంద్రునీ సరసరీతి ప్రార్థించు రటన్! 24

(అయోధ్యాకాండములోని 106వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము - రెండవ భాగము

## నూట ఏడవ సర్గము

[శ్రీరాముడు భరతుని యోదార్చి యయోధ్యకు వెళ్లుమని యాదేశించుట]

అంతట యభిసత్కృతుడగు రాముడు నా బంధుజనుల మధ్యమునన్!
అవిధి మాటాడెడి భరతునితో నాత్మీయతతో నిట్లనియెన్!
దశరథునకు గైకేయి యందునను దగ జన్మించిన పుత్రుడవూ!
చెప్పినదంతయు యుక్తమైనదీ చెప్పెద నా మాటలు వినుమా! 1

సీతల్లిని బెండ్లాడు సమయమున నిర్మలమతిసీ దశరథుడున్!
ఆమెసుతునికే రాజ్యమిత్తునని యామె తండ్రికిని మాటిచ్చెన్!
పలికిన పలుకును నిలుపుకొనియెనూ బన్నుగ యా రాజేంద్రుడునూ!
తండ్రి వాక్యముల నిజము సేయుమా! తగ నీవును నీ సమయమునన్! 2

దేవాసుర సంగ్రామ సమయమున ధీరత జేసిన సేవలకున్!
కైకకు వరములనిచ్చె బ్రార్థివుడు గడు ప్రేమను దా జూపుచునూ! 3

యశస్వినియు వరవర్ణిని కైకయు యశోవంతుడగు దశరథుచే
సత్య ప్రతిజ్ఞను జేయగ జేసీ సతి యడిగెను దన వరములనూ!
నీకు రాజ్యమును నాకు వనంబును నివసింపగ వరముల గోరెన్!
రాజుగూడ నా వరముల నిచ్చెను రహి తన మాటను నిలుపుకొనన్! 4

పదునాల్గేడులు వని వసియించపగ బన్నుగ నాజ్ఞాపించెను రాజున్
వరములలో నిది యొక్కటి భరతా! వలనొప్పగ రెండిటి యందున్!
తండ్రి బలికినా సత్యవచనమున దగ నే నిలిచితి స్థిరముగనూ!
నే సీతా లక్ష్మణ సహితుడనై నిర్జన వనమున కొచ్చితినీ! 3

రాజేంద్రా! మఱి నీవును గూడను రాజు జెప్పినా విధముగనూ!
అభిషిక్తుడవై తండ్రి వాక్యమును నలరి సత్యమును జేయవలెన్!
ఋణవిముక్తుగా జేయుము దండ్రిని వినయముగా నా పలుకు వినీ !
ధర్మజ్ఞుండగు దండ్రిని తల్లిని తగ సంతసమును జేయవలెన్! 6

గయాక్షేత్రమున యాగము జేయుచు గయుడీ విధమున బలికెననీ!
తండ్రీ! పెద్దలు దెలిపినటులుగా దగ నినుచుంటిమి నిజ మదియున్!
పుత్రుడు దండ్రిని సంరక్షించును 'పుత్' యను నరకములో నుండీ!
పితృదేవతల గాపాడుటచే 'పుత్రుడు' నను బేరొచ్చినదీ! 7

బహుశ్రుతులును గుణవంతులు నిలలో బహుపుత్రులనూ గోరవలెన్!
ఒక్కడైన యాగయాక్షేత్రమును నొప్పుగ గని మఱి వచ్చుగదా!
రాజఋషులు నగు వారందఱునూ రహి నిశ్చయమును జేసిరిగా!
రాజనందనా! నీవును దండ్రిని రక్షింపుము నరకము నుండీ! 8

శత్రుఘ్నునితో ఋత్విక్కులతో జనుము గోసలకు వేగముగన్!
రంజింపగ చేయుము బ్రజలందఱ రాజ్యము నేలుము సుస్థిరతన్!
నేనుగూడ నాలస్యము జేయక యాసీతా సౌమిత్రులతో!
దండక వనమును బ్రవేశించెదను మెండుగ భీకరమైనదియున్! 9

భరతకుమారా! నీవును స్వయముగ ప్రభుడవు గమ్మా! ప్రజలకునూ!
నేనుగూడ మఱి ప్రభువు నయ్యెదను వనిలో మృగముల కన్నిటికిన్!
సంతోషంబున నయోధ్య కేగుము! చారు సుందరంబగు ఋరికిన్!
సంతోషంబున నేనును బోదును వింత రక్కసుల దండకకున్! 10

భరతకుమారా! దినకర ప్రభలను బారద్రోలు నట్టిదియు మఱిన్
నీ శిరస్సుపై శ్వేతచత్ర మది నిలిచి నీడ నిచ్చును గాతన్!
నేనుగూడ బహు సుఖవంతుడనై కానన ద్రుమముల ఛాయలనూ!
ఆశ్రయించెదను నా లక్ష్మణుతో నా వైదేహిని గూడికొనీ! 11

కుశలమతియును శత్రుఘ్నుండును గూరిమి నీకును దోడుండున్!
సౌమిత్రియు నాప్రధాన మిత్రుడు సకల జనులకును నిది తెలియున్!
శ్రేష్ఠ పుత్రులము మనము నల్వురము జేతము దండ్రిని సత్యవ్రతున్!
జనకుని సత్యప్రతిజ్ఞను నిలిపిన చారు శీలురుగ గుర్తింపన్! 12

(అయోధ్యా కాండమునందు 107వ సర్గము సమాప్తము)

★ ★ ★

## అయోధ్యకాండము రెండవభాగము

### నూట యెనిమిదవ సర్గము

--జాబాలి నాస్తికమత మవలంబించి రామునికి నచ్చజెప్పుట--

ధర్మజ్ఞుండగు రాము డంతటను దగనోదార్చుచు భరతునకున్!
తెలుపుచుండ జాబాలి బ్రాహ్మణుడు దెలుపగ దొడ్చెను రామునితో!
రామా! చాలును! నార్యబుద్ధివియు రహి ప్రాకృతునికి వలె బలుకన్!
దగునా యిట్టివి యాలోచనలును దారతమ్యమును లేకుండన్! 1

ఒకడే పుట్టును; నొకడే జచ్చును నొకడే యెవడైనను గూడన్!
ఎవనికి నెవ్వడు బంధువు! నెవ్వడు నేమిపొందు నితరుల జేతన్!
తల్లియనుచు మఱి తండ్రి యనుచునూ తగని ప్రేమ జూపును నరుడున్!
అట్టినరుడు నున్మత్తుడు గద మఱి యిట్టి యోచనలు గలవాడున్!
ఎవడు నెవ్వనికి నాస్తిగదా మఱి యెవ్వని కెవ్వడు లేడుగదా! 2

గ్రామాంతరమును బోవు మానవుడు గడగి వసించును నొకచోటన్!
తెల్లవారగనె స్థానము విడిచీ తిరుగ బోవును బయనంబై!
తల్లి దండ్రి గృహమును సంపదలును దగ నివాస స్థలమును బోలెన్!
అట్టివాని యందున సజ్జనులును నింపుగ దలపరు నాసక్తిన్! 3

పితృ రాజ్యమును బరిత్యజించీ విషమంబును బహుకంటకమున్!
దుఃఖకరంబగు జెడు మార్గంబును దోసిలొగ్గి గ్రహియింపకుమా!
ఐశ్వర్యమునగు నయోధ్య కేగుము! నభిషిక్తుండవు నగు మింకన్!
ఏకవేణి ధరియించిన స్త్రీవలె రాక నిరీక్షించుచు నుండెన్! 4

రాజభోగతులను ననుభవించుచును రాజకుమారా! స్వర్గములో!
విహరించెడి సురరాజుకు బోలెను విహరింపుము పురి యయోధ్యలోన్!
దశరథుండు నీ కేమియుగాదూ! దశరథునకు నీ వేమియునూ!
రాజెవ్వరొ! మఱి నీ వెవ్వరవో రంజిల జేయుము నా పలుకుల్! 5

తండ్రి ప్రాణికీ బీజము మాత్రము దల్లి ఋతుమతిగ యైనపుడున్!
శుక్లశోణితము గలియగా నపుడు సుందర జీవియు జన్మించున్!

దశరథేంద్రుడెట కేగ వలయునో దగబోయెను మఱి యచ్చటకున్!
మానవప్రవృత్తి యిట్లే యుండును మఱి నీకీ శోకము లేలా?

అర్థ ధర్మపరులను వే గాంచీ యమిత దుఃఖమును బొందుదునూ!
కామపరుల గూరిచి యోచింపను కమ్మని భోగము లందుదురూ!
ఏలయనగ యీ యర్థధర్మలూ యీలోకంబున దుఃఖమునూ!
అనుభవించి మఱి మరణము తదుపరి యనుభవించెదరు దుఃఖమునూ!

అష్టక శ్రాద్ధము, బ్రత్యాబ్దికమని నలరి జేయుచుందురు జనులన్!
అన్నమెంత వ్యర్థంబగు చున్నదొ యరసి జూడుమా యోచించీ!
చచ్చిన నాడెటు మఱలి రాగలడు మచ్చికతో నెటులను దినుమా? 8

ఒకడు దినిన భోజన పదార్థములు నొకని దేహమున బోయినచో!
విదేశంబులకు బోయిన వానికి విమల శ్రాద్ధములు దగజేయన్!
మార్గమందు నాహారము నగు గద! మఱి యాతండును దిననేలన్?
బూటకములు నీ మాటలన్నియును బూటకములు నీ చేతలునూ! 9

యజ్ఞము జేయుము! దానము నిమ్మా! యన్నియు దానము జేయవలెన్!
దీక్షవహింపుము! దపస్సు జేయుము! దివ్యత్వము వచ్చును నీకున్!
అని చెప్పెడి యా గ్రంథములన్నియు నల మేధావులు వ్రాసినవీ!
దాన వశీకరణోపాయంబులు ధర్మముతేదూ! యింతైనా! 10

రామా! దలపుము! పరము నాస్తియని రహి భావింపుము నీ బుద్ధిన్!
ప్రత్యక్షంబగు వానిని దలవుము! బ్రబలమైన సాక్ష్యంబులతో!
పరోక్షపగు వానిని దలపకుమా! పన్నుగ నీహృదయము నందున్! 11

లోకములో గల యుదాహరణములు లోలత నెన్నియు జెప్పితినీ!
భరతుం డదె యంజలిని ఘటించీ బ్రతిమాలుచు నుండెను గనుమా!
నేజెప్పిన యాలోచనలన్నియు నిజమని మది నిశ్చిత బుద్ధిన్!
అభిషిక్తుడవై కోసలదేశము నలరుచు బాలింపుము వింకన్! 12

108వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యాకాండము-రెండవ భాగము

## నూట తొమ్మిదవ సర్గము

[జాబాలి నాస్తికమతమును ఖండించి రాముడు ఆస్తిక మతమును స్థాపించుట]

సత్యాత్ముండగు రాముండటను జాబాలీ వచనముల వినీ!
శక్తివినయముల స్వబుద్ధితోడుత బన్నుగ వలికెను నీరీతిన్!
ప్రియముగోరి మాటాడిన వన్నియు ప్రియములు, హితములు ననిపించున్
కాని యవన్నియు హితములు గానివి కడు నప్రియములు బరికింపన్! 1

నిర్మర్యాదుడు, బాపాచారుడు నిర్మల చరిత్ర దూరుడునూ,
అట్టి మానవుడు సత్పురుషులతో యెట్టి గౌరవము నంద డిలన్!
ఎవడు కులీనుడు, ఎవ్వడు గాడో! యెవడు వీరుడెవ్వడు గాడో!
ఎవడు శుచియొ! మఱి యెవ్వడశుచియునో నింపుగ నడవడి యే తెలుపున్!

ఆర్యుని వలె పైపైకి గన్పడుచు ననార్యునికి వలె వర్తింపన్!
శుచివంతునిగా బైకి గన్పడుచు శుచిహీనునిగా వర్తింపన్!
లక్షణవంతునిగా గన్పడుచును లక్షణ శూన్యునిగా నుండన్!
శీలవంతునిగ పైకి నుండి దుశ్శీలవంతునిగ వర్తింపన్! 3

శుభమును విడిచియు ధర్మ మనుచునూ శూన్య సంకరము గలిగించీ!
సత్క్రియలను శాస్త్రంబులు విడిచీ సాధు ధర్మముల నటు వదిలీ!
అధర్మంబులను బొందినటులయిన నఖిల జనులు దూషింతురుగా!
దుర్వృత్తుండను లోకదూషణుడ దురభి మాననగు నన్నికనూ!
కార్యాకార్య విచక్షణు లెవ్వరు గౌరవింపగను జాలరుగా!

హీనప్రతిజ్ఞుడనై యీ విధముగ హీనుడనై వర్తించినచో
ఎవనిని నుపదేశింపగలుగుదును నెటుల బోవుదును స్వర్గమునూ! 5

నే నిటు వర్తించిన జనులందఱు నీతి విడిచి స్వేచ్ఛాపరులై!
చెడు జీవితమున బడిపోవుదురూ చెడువర్తనలకు లోనగుచున్!

రాజులు నేవిధి వర్తించుదురో ప్రజలును బోదురు నాదారిన్!
అందుచేతనే రాజులుండవలె జింనుచు శీలము గుణములునూ! 6

సనాతనంబగు రాజధర్మ మిది సత్యరూప మైనట్టిదియున్!
క్రూరత్వమునకు దావులేదు మఱి కూరిమి సత్యప్రధానంబున్!
లోకము సత్యము మీద నిలిచినది స్వీకరింతు నా సత్యమునూ!
సత్యముమించిన యుత్తమ ధర్మము సరియగు నది మఱి లేదు కదా! 7

ఈ లోకంబున నెంచి జూడగా నింపుగ సత్యము నీశ్వరుడూ!
లక్ష్మి యెల్లపుడు నాశ్రయించునూ లాలితముగ యాసత్యమునే!
సర్వధర్మములకు నిది మూలము సత్యము! సత్యము! సత్యంబే!
సత్యమునకు మించిన ధర్మం బిల సరియగునది మఱి లేదుగదా! 8

మునులు, దేవతలు బరమ ధర్మమని మోదముతో నా సత్యమునే!
అంగీకారము దెలిపి రందఱును నాయింద్రుడు మఱి యగ్నియునూ!
సత్యవాది యీ లోకమునందున యుత్తమ స్థానము నొందునుగా! 9

సర్పంబును గని భయపడునట్లుగ సరిజూతురు నన్నృతవాదిన్!
సత్యమె యుత్తమ ధర్మమనియునూ సత్యమె యుత్తమ నాకమునున్
మూలకారణం బని పలుకుదురూ మునులు, ఋషులు మఱి దేవతలున్! 10

దానము, యాగము, హోమము మఱియును దపస్సు వేదము లన్నియునూ
సత్యము మీదనె యున్నవి నరుడును సత్యము నారాధింపవలెన్!
ఒకడు రాజ్యమును బరిపాలించును నొకడు వంశ వృద్ధిని దెచ్చున్
ఒకడు స్వర్గమున గౌరవింపబడు నొకడు బడును నరకమునందున్!
సత్యాసత్యంబులను వచ్చునూ సలలితముగ నీ ఫలితములున్! 1

సత్యవ్రతుండను, సత్యప్రతిజ్ఞుడ సత్యముపై శపథము జేసీ!
సత్యమైన నాతండ్రి యానతిని రిత్త జేయుదును జపలుడనై!
సత్యమనెడి యా ధర్మసేతువును సరసన లోభము లోనగుచున్
మోహంబున భేదింపను దమసున చేదింపను నజ్ఞానమునన్! 1:

అసత్య వాదియు, జపలుం డిచ్చిన హవ్యకవ్యముల పూజలునూ!
దేవతలును, మఱి పితృదేవతలు ధీరత నంటరు ముట్టరనీ!
పెద్దలచే నే వింటిని పూర్వము శుద్ధులైన బరిపూర్ణులచే!
నేను స్వయముగా సత్యధర్మమును బ్రత్యగాత్మగా భావింతున్!
సత్పురుషులు జేసిన కార్యములను సత్యంబులుగా దలతు మదిన్! 13

క్షుద్రులు, క్రూరులు, దురాశపరులును దురితాత్ములు సేవించునదీ!
స్వల్ప ధర్మసహితంబగునట్టీ క్షాత్ర ధర్మమును వదిలెదనూ! 14

పాపంబులు మానసికము కాయికము వాచకంబు అవి ముప్విధముల్
పలువిధంబులగు బాపకర్మములు బన్నుగ చేయును లోకమునన్!
మనసునందు నిర్ధారణ జేసీ మఱి జేయును కాయము చేతన్
నాలుకతో బలుకును నసత్యమును బలుభాషల తన స్వార్థమునన్! 15

భూమి, కీర్తి, లక్ష్మి యశస్సులను బొలుపుగ కోరును సత్యవతున్!
స్వర్గంబున కేగినను వానినే సరసరీతి వీక్షించునుగా!
అందువలననే సత్యధర్మముల ననుసరింపగా వలయు భువిన్! 16

బ్రాహ్మణోత్తమా! జాబాలీ విను! బన్నుగ నీ హృది భావములన్!
శ్రేష్ఠములని భావించి తెలిపినది యిష్టమైన యుక్తుల తోడన్!
మంగళకరమిది! జేయుమనుచు నను మానుగ చెప్పిన దంతయునూ!
స్వీకరించుటకు నిష్టపడను నే చెడ్డదనుచు మది దలచెదనూ! 17

వనవాసము నే జేసెద ననుచును వినయ బ్రతిజ్ఞను జేసియునూ!
తండ్రిమాట కాదనుచు భరతునీ తగు మాటల నెటు దలదాల్తున్?
ప్రతిజ్ఞ జేసిన సమయమునందున సతి కైకేయీ గల దచటన్!
సంతోషించెను నామెగూడ మఱి వింతగాదు; మఱి యిది నిజమూ! 18

శుచినై, మితభోజనము జేయుచును శుద్ధ కంద మూలంబులతో
ఫలపుష్పంబుల బితృదేవులకు బన్నుగ నిచ్చుచు తర్పణలన్!

పంచేంద్రియముల వశమందుంచీ పరగ కపటమును లేకుండన్
కార్యాకార్య విచక్షణ గలిగీ కడు శద్ధాయుక్తుండునునై
ఈ విధమున వనవాసము జేయుదు నీ విధి జీవన యాత్రయునూ!

కర్మభూమినీ పొందిన నరుడిల కర్మలు శుభములు జేయవలెన్!
అగ్నివాయు శశి కర్మల చేతను నా యా పధముల నందిరిగా!
క్రతువులు నూరును జేయుటజేతను గలిగెను స్వర్గము నింద్రునకున్!
ఉగ్ర దపస్సుల జేసియె ఋషులును నున్నత పధములకును జనిరీ!

ఉగ్రతేజమును గల యారాముడు యుక్తులతో గూడిన దానిన్!
ఆజాబాలీ హేతువాదమును నాలకించి యపహాస్యముతో
సహింపజాలక ఖండించుచునూ సరసరీతి యిటులను బలికెన్!

సత్యము, ధర్మము, బరాక్రమంబును సరస భూతదయ, ప్రియవాకున్
దేవ బ్రాహ్మణ యతిథి పూజయును దివికి మార్గమిది; సత్పురుషుల్
చెప్పిన దానిని విప్రులు దెలిసీ శీలము దప్పక యాదారిన్!
సకల ధర్మముల నాచరించుచును సత్పధముల వర్తించుచునూ!
ఉత్తమ లోకము లంద గోరుచును నురు సత్క్రియలను జేయుచునూ!
అట్టి మార్గమున నే బయనింతును నెట్టి యాపదలు వచ్చిననూ!

బ్రాహ్మణోత్తమా! జాబాలీ విను! బన్నుగ నీ జెప్పినరీతిన్!
అనుసరింపజాలను నీ మార్గము యనుగమింపజాలను సుమ్మా!

చెడు మార్గంబుల బ్రవర్తించుచును జెడు బుద్ధులుగలవాడవునూ!
ఇట్టి యోచనల సంచరించెడీ యిమ్ముగ నాస్తికుడవు నీవున్
ధర్మ మార్గమున నుండి తొలగినా కర్మల జేయని వాడవునూ!
చేరదీసె నా తండ్రి యట్టి నిను నిరసించెద నా దశరధునీ!

నాస్తికుండు చోరుండని తెలియుము నయముగ వినుమా! జాబాలీ!
శంకాపాత్రుడు సర్వప్రజలకును బొంకము లేనీ వాదతడున్!
పండితుం డెపుడు స్నేహము జేయడు నిండుగ నాస్తికు దోడుతనూ!

ధర్మరతులు సత్పురుష సమేతులు దాన గుణముగల త్యాగధనుల్!
తేజోవంతు లహింసా వాదులు ధీరోదాత్తులు నగు మునులే
లోకములో బూజింప దగుదరూ లోకజనుల యాదర పాత్రుల్! 26

ధీరోదాత్తుడు, మహాత్ముండునగు ధీనిధి యారాముని తోడన్
హితమైనది మఱి యాస్తిక్యంబును నలరు సత్యమును బ్రాహ్మణుడున్!
అనునయ పూర్వకముగ జాబాలీ నలరుచు మృదువుగ నిటులనియెన్! 27

నాస్తికుడను నే గాను సుమా మఱి నాస్తిక వచనములను గూడన్!
బలుకుట లేదూ! రఘురామా! నే బరలోకము లేదన లేదూ!
ఆస్తికు దగుదును కాలముబట్టి నరయుదు నా యా మనుజులనూ!
నాస్తికునికివలె మాటాడుదునూ! నయముగ మఱియొక సమయమునన్! 28

నాస్తిక వాక్యము బలుకుసమయ మిట నయముగ వచ్చెను గావుననే
అట్టివాక్యముల నేను బలికితిని నరయగ ప్రజలందఱను నిటన్
నిన్నయోధ్యకును మరలించుటకును నీ సమ్మతమును బొందుటకై
ఈ విధముగ నే మాట లాడితిని నింపుగ నీ కొఱకే యటులన్! 29

(అయోధ్యాకాండమునందలి 109వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - రెండవ భాగము

## నూట పదవ సర్గము

వసిష్ఠుడు సృష్టి పరంపరను, ఇక్ష్వాకు వంశ పరంపరను తెలిపి రాముని రాజ్యమును స్వీకరింపుమని కోరుట

క్రుద్ధుడైన వానినిగా రాముని గూరిమి దెలిసియు కులగురువున్!
వసిష్ఠ డిటులను పలికె రామునితో వాసిగ సుమధుర వచనములన్!
ఆయా లోకంబులకు జనులును! నరయగ బోవుచు వచ్చుటయున్!
జాబాలికి యది యంతయు దెలియును సర్వ సమృద్ధుడు శాస్త్రములన్!

నిన్నయోధ్యకును మఱలించుటకై సన్నిహితముగా నటు వలికెన్!
లోకనాథ! వినుమా! నా పలుకులు లోకోత్పత్తి విధానంబున్!

సర్వము సలిలము జలమయ మంతయు సరగున ధర సృజియింపబడెన్!
అటు పిమ్మట దేవతలు జనించిరి నా పిమ్మట నా బ్రహ్మయునూ!
వరాహ రూపము ధరించి బ్రహ్మయు వాసిగ ధరిత్రి రక్షించెన్!
కృతాత్ములగు దన పుత్రుల తోడను గూరిమి సృజించె లోకమునూ!

శాశ్వతుండు నిత్యుడు నవ్యయుడును నా బ్రహ్మయు యాకాశమునన్!
జనించె నాతనికిని మరీచియును జనించె నతనికి గశ్యపుడున్!
కశ్యపునకు సూర్యుండు జనించెను నతనికి మనువును జన్మించెన్!
మనువు కుమారుడు నిక్ష్వాకునకును మానుగ ధర నంతయు నిచ్చెన్!

ఆ యిక్ష్వాకుడు ప్రథమ పార్థివుడు యా కోసల రాజ్యంబునకున్!
ఆ యిక్ష్వాకునకును జన్మించెను నలరుచు కుక్షి కుమారుడుగా!
ఆ కుక్షికి జన్మించె వికుక్షియు యతనికి జనించె బాణుండున్!
ఆ బాణునకు జనించె కీర్తిమతి యనరణ్యుండును జన్మించెన్!

ఆ యనరణ్యుని పరిపాలనలో ననావృష్టి దుర్భిక్షములున్!
అరసి జూచినా యగుపింపవుగా నా కోసల దేశము నందున్!

ఆ యనరణ్యునకును జన్మించెను నా పృథువును నాతనికి మఱిన్!
త్రిశంకువను నొక పుత్రుడు బుట్టెను తేజోవంతుడు వీరుండున్!
సశరీరంబున స్వర్గము నేగెను సత్యవాక్య పరిపాలనచే! 6

త్రిశంకువునకును దున్దుమారుడును నాతనికిని యవనాశ్వుండున్!
జన్మించిరి యవనాశ్వునకును మఱి జననమొందె మాంధాతయునూ!
మాంధాతకు మఱి సుసంధి బుట్టెను సుసంధికిని ధ్రువ సంధియునూ!
ప్రసేనజిత్తను వారలు బుట్టిరి యా ధ్రువసంధి కుమారుండే
అనక్రవిక్రమ పరాక్రమవంతుడు నా భరతుండును జన్మించెన్! 7

ఆ భరతునకును నశితుడు బుట్టెను నా యశితునితో హైహయులున్
కాలజంఘులుగు, శశి బిందువులును గడు విరోధులుగ యుద్ధమునన్!
శత్రువులందఱు ముట్టడింపగా సర్వ రాజ్యమును గోల్పోయెన్!
అందమైన పర్వతమున నశితుడు నాశ్రయించె నట మునివృత్తిన్! 8

అసితుని భార్యలు గర్భవతులుగా నలరచు నుండిరి వారలలో
ఒకతె బెట్టె మఱి విషమును సవతికి నానరగ గర్భము ఛేదనకై! 9

భృగు వంశమునకు జెందిన మునియును భూరి తపోసంపన్నుడునూ!
చ్యవనుడునను ఋషి హిమాలయములో నివసించుచునుండెను శాంతిన్
అశితుని భార్యయు నగు కాళిందిని యా ముని కడకేగగ నతడున్
ఆ బ్రాహ్మణుడును నిట్లని పలికెను నా కాళిందిని సతితోడన్! 10

మహాత్ముడును మఱి లోక ప్రసిద్ధుడు మహాధార్మికుడు శీలుండున్
వంశోద్ధారకు డుద్భవ మొందును వనిత నీదు గర్భము నందున్! 11

ఆ కాళిందియు సంతస మొందీ యంజలి ఘటించి యా మునికిన్!
గృహమునకును నేతెంచి కనియెనూ కూరిమితో నొక పసిదానిన్!

పద్మపత్ర సమ నేత్రంబులతో పద్మగర్భసమ కాంతులతో
సగరుడు బుట్టెను చ్యవనుని దీవెన చల్లగ మారెను గరళంబున్!
గరళముచే జన్మించెను గావున సగరుడయ్యె నా బాలకుడున్! 12

యజ్ఞము జేసెను సగరుండును మఱి యజ్ఞాశ్వంబును వెదుకుచునూ!
సముద్రమును ద్రవ్వించెను నాతడు దగ తన బుత్రులచే ధాత్రిన్! 13

ఆ సగరునకును జనన మొందెనూ యసమంజాను దను పుత్రుండున్!
పాప కర్మలను జేయుటచే సుతు బరిత్యజించెను సగరుండున్!
నసమంజానుకు నంశుమంతుడును నశుమంతునకు దిలీపుడున్!
ఆ దిలీపునకు భగీరథుండును నలరి బుట్టె బ్రజ కీర్తింపన్! 14

భగీరధునకును కుకుత్థ్సు బుట్టెను కుకుత్థ్సు డనియెడి నామముచే
కాకుత్థ్సువులను బేరువచ్చినది కడగి యయోధ్యా రాజులకున్!
కుకుత్థ్సునకు రఘు వను కుమారుడును కమ్మని యాతని పాలనచే
రాఘవు లనియెడి పేరు వచ్చినది రమ్యముగా నా రాజులకున్! 15

రఘువు కుమారుడు తేజోవంతుడు రమ్యముగా నీ ధరయందున్!
పురుషాదకుడని సౌదాసుడనీ కల్మషపాదుడు నని యంచున్!
ప్రసిద్ధి కెందెను నాతని పుత్రుడు శంఖణుండు దన జనకునితో
యుద్ధమునందున నశించిపోయెను యుద్ధముజేసి ససైన్యముతో! 16

శంఖణునికి జనియించెను సుందర సుదర్శనుండను గొమరుండున్!
ఆ సుదర్శనునకును జన్మించెను అగ్నివర్ణుడను బుత్రుండున్!
ఆతని పుత్రుడు శీఘ్రగుడును మఱి యతనికి జన్మించెను మరుపున్! 17

ఆతని కుమారుడు ప్రశుశ్రువుండును నతనికి తేజోవంతుండున్
అంబరీషుదను సుతుడు జనించెను నతనికి నహుషుండును బుట్టెన్
ఆతనికి ధార్మికుడగు నాభాగుడు నతనికి నజుడును సువ్రతుడున్

ఇరువురు బుట్టిరి యాయిరువురిలో నింపుగ యజుని కుమారుండే!
ఆ దశరథరాజేంద్రుడు వినుమా! యా దశరథునకును బుత్రుడవూ! 18

రామా! నీవును జ్యేష్ఠ బుత్రుడవు రమ్యముగా నీ రాజ్యముపై
అధికారము గలవాడవు సుమ్మా అంచుచేత నీ రాజ్యమునూ
గ్రహించి ప్రజలను బరిపాలింపుము గమ్మని తీయని కార్యములన్!
చల్లగ రాజ్యము నేలుము రామా! యెల్ల సుఖములను గూర్చుచునూ 19

ఇక్ష్వాకులలో జ్యేష్ఠపుత్రుడే నింపుగ రాజ్యము నేలు సుమా!
జ్యేష్ఠపుత్రుడే యభిషిక్తుండగు చిన్నవాడు రాజును గాదూ! 21

మహాయశా! ఓ రామా! వినుమా మానుగ రఘువంశీయులలో!
అతి ప్రాచీనంబగు కులధర్మము నలరి విఘాతము సేయకుమా!
విశాలమగు నీ మేదిని యంతయు విమలముగను బాలింపు మికన్
తండ్రి వోలె బ్రజ బరిపాలింపుము ధర్మము నాలుగు బాదములన్! 22

(అయోధ్యాకాండమునందలి 110 సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము—రెండవ భాగము

## నూటపదునొకండవ సర్గము

[భరతుడు ప్రాయోపవేశమునకు సిద్ధపడుట-రాముడు భరతునకు నచ్చజెప్పి అయోధ్యకు బొమ్మనుట]

రాజ పురోహితుడైన వసిష్ఠుడు రామునితో నటు బలుకుచునూ!
మఱల బలికె నిటు ధర్మయుక్తమగు మాటల మఱియొక విషయమునూ!
'బన్మించిన ప్రతి బురుషునకుందురు జనవర! గురుడును దలిదండ్రుల్!
మువ్వురు గురువులు నుందుదు ధాత్రిని సద్గురువులుగా దలపుమదిన్! 1

అ తండ్రియు బుట్టించును బురుషుని యాచార్యుడు జ్ఞానము నిచ్చున్!
అందువలన నా యాచార్యుండును నలరుచు గురువగు చున్నాడున్!
పరంతపా! నీ తండ్రికి నీకును బన్నుగ నే నాచార్యుడనూ!
సరిగ నేను దెలిపిన విధి నడిచిన జనెదపు సత్పురుషుల దారిన్! 2

ఈ పరిషత్తులు, ద్విజులును, శ్రేణులు నింపుగ నీ వారందఱునూ!
వీరి ప్రార్థనల గాదన బోకుము! వీరిధర్మ బరిపాలనతోన్!
సంతృప్తిని గావింపుము ప్రజలను సఖులను దల్లుల గురువులనూ!
అతిక్రమించిన వాడవు కావూ యా సత్పురుషుల మార్గమునూ! 3

ధర్మశీల బహు వృద్ధురాలునగు దల్లికి సేవలు జేయవలెన్!
అటుల జేయుచును యామె దెలిపినా యా మాటలు మన్నించినచో!
అతిక్రమించిన యటులగాదు నూ యా సత్పురుషుల మార్గమునూ! 4

సత్య పరాక్రమ! రామచంద్ర విను! సమ్మతమగు భరతుని బలుకుల్!
నిండు హృదయమున యంగీకారము దండిగ మది మన్నించినచో!
అతిక్రమించిన యటులగాదు నూ! యా సత్పురుషుల మార్గమునూ! 5

కుల గురువగు నా వసిష్ఠదేవుడు గూరిమి దెలిపిన మాటలనూ!
విని రాముడు దన వినయ వచనముల విమల స్వరమునను నిటులనియెన్!
పుత్రుని విషయంబున తలితండ్రులు బొలుపుగ సేవలు సేయుదురో!
ప్రత్యుపకారము జేయ నశక్యము బ్రతివాడును ఋణపడి యుండున్!

యథాశక్తి నాహారము నిచ్చుచు యథారీతి సేవలు జేసీ!
నిద్రబుచ్చుటయు, నిత్య స్నానమును నిర్మల మతి జేయించుటయున్!
ఆ తలిదండ్రుల రుణభారంబును నమరుతైన దీర్పగ లేరూ! 7

తండ్రియైన యాదశరథ రాజును దగ జన్మను నిచ్చెను నాకున్;
అతని యెదుట నే జేసిన ప్రతినయు యది మిధ్యయు గారాదు గదా!
రాముని మాటలు విని భరతుండును రయమున దుఃఖమునను మునిగీ!
ప్రక్కనున్న యా సుమంత్రుతో సనె ప్రవిదుల వాక్కుల తోడుతనూ! 7

సారధి సుమంత్ర! స్థండిలంబుపై చక్కగ బలుపుము దర్భలనూ!
అడ్డగించి నే నిట బరుండెదను యన్న యనుగ్రహ మగు దాకన్!
ధనహీనుండగు విప్రుని వలె నే దగ యాహారమూ గైకొనకన్!
తిరిగివచ్చు వఱకును శ్రీరాముడు దీరుగ శయనించెద నిపటన్! 8

రాముని యానను జూచు సుమంత్రుని రమ్య బోకదల గమనించీ
భరతుడు స్వయముగ కుశలను దెచ్చెను బన్నుగ నేలను బఱచె నహో!
రాజరుషియు, దేజోవంతుండును రాముడు బలికెను భరతున్నితో
ఏమి తప్పిదము జేసితి భరతా! యిటు బరుండెదవు నడ్డముగా! 9

ఏక పార్శ్వమున బరుండవచ్చును నితరుల నడ్డగ విప్రులకున్!
విధింప లేదుగ క్షత్రియులకు నిది విమల హృదయ! విరమింపు మిదీ!
దారుణమగు నీ వ్రతమును వీడీ ధాత్రిని శ్రేష్ఠంబైనదియున్!
అయోధ్య నగరికి బొమ్ము వేగమున నలరుచు బ్రజలను బాలింపన్! 10

అంతట భరతుండు నచట కూర్చొనియె యచ్చటి ప్రజలకు నిటులనియెన్!
ఏమిది మౌనము? నేమియు దెలుపరు? నన్నగారితో నంతయునూ!
అని బ్రశ్నింపగ కైక కుమారుడు నలరుచు బలికిరి పౌరులునూ!
రాముని గూరిచి బాగ నెఱుగుదుము రాముడు పలికెను యుక్తముగా! 11

తండ్రి మాటపై నిలిచెను రాముడు దగ సత్యముపై నిలిచె నహో!
మఱలింపగ మే మశక్తులము సుమ! చెఱుప లేమతని శీలంబున్!
వారి మాట విని రాముడంతటను భరతునితోడను నిటు లనియెన్!
ధర్మదృష్టిగల మిత్రుల మాటల దగ వినుమని మఱి యిటు వలికెన్!

నా మాటలు మఱి వీరి మాటలును నయముగ వినుమా ఓ భరతా!
ఉదకంబును మఱి నన్ను స్పృశింపుము నుదయించిన సూర్యుని గనుమా!
ఆటుపిమ్మట నా భరతుడు లేచి యాచమనంబును జేసియునూ!
యిటుల పలికె నా ప్రజాళి యెదుటను నిమ్ముగ దగ్గద గంతముతో! 13

విద్వాంసులు, మంత్రులు శ్రేణులునూ విమల వచనముల వినెదరుగా!
అడుగలేదు నా తండ్రిని రాజ్యము నడుగలేదు నే నెన్నడునూ!
రాజ్య మొప్పునటు చేయ మనుచు నే రమణి కైక నడుగగలేదూ!
ధర్మజ్ఞుడు రాముడు గాననలకు దగ బోవను గోరగలేదూ! 14

తండ్రిమాట చెల్లింప దలచుచో దగ నే నుండెద వనములలో!
పదునాల్గేడులు వనమున గడిపెద బన్నుగ ఫల మూలంబులతో!

ధర్మాత్ముడు శ్రీరాము డంతటను దన తమ్ముని దృఢ వాక్యములన్!
విని విస్మితుడై పలికె నిట్టులను జానపదుల పౌరుల తోడన్!

జీవముతో నుండిన రాజేంద్రుడు చేసిన క్రయ విక్రయమందున్!
మఱి నేనును భరతుండును గానీ మార్చ వీలులేనివియు గదా!
నాకు బదులుగా మఱియొక వ్యక్తిని నయముగ కానకు బంపుటయా?
న్యాయ మేమియును గనలే మిచ్చట నా సమ్మతమును గాదు నిదీ!
కైకేయీ రాజ్యమును గోరెనూ కైక గోరుటది యుక్తంబే!
తండ్రి చేసినా మంచి పనియునూ దగ యుక్తంబని భావింతున్! 16

బాగుగ తెలియును భరతుని విషయము బహుగుణాఢ్యుడును శాంతుండున్
సమస్తమును మంగళమగు గావుత శాంతి సుఖంబులు నగుగాతన్!
వనమునుండి నే తిరిగివచ్చి మఱి వినయశీలుడగు భరతునితో!
కలిసి నేను నీ భూమండలమును విలసిల్లగ పరిపాలింతున్! 17

కైక గోరె యా దశరథరాజును కమ్మని గోర్కెల రెండింటిన్!
రాజు బలికినటు వనవాసంబును రమ్యముగా చేయుచునుంటిన్!
నీవును వేగముగ నభిషిక్తుడవై నిలుపుము నాతని మాటలనూ!
అసత్యదోషము గలుగకుండగా నయోధ్య నేలుము రాజువుగా! 18

(అయోధ్యాకాండము 111వ సర్గము సమాప్తము)

★ ★ ★

## నూట బంద్రెండవ సర్గము

### (భరతుడు రాముని పాదములపైబడి ప్రార్థించుట రాముడు బాదుకలచ్చి పోయిరమ్మనుట)

అచట జేరినా మహర్షులందఱు నా మహాత్ములగు సోదరులన్!
ఆ సమాగమము జూచి మెచ్చును నాశ్చర్యంబును బొంది రటన్!
అంతర్హితమగు ముని గణంబులను నా సిద్ధులు మఱి పరమ ఋషుల్
మహాతేజులగు రాము భరతులను మానుగ కీర్తించిరి మదిలో! 1

ధర్మజ్ఞులునూ ధర్మ విక్రములు దగ యీ యిద్దరి పుత్రులనూ
కనిన దశరథుడు నెంత ధన్యుడో కలకాలము నిలుచును యశమన్!
వీరి మాటలను వినెడి మనకునూ వీరిపైని మక్కువ గలిగెన్!
భ్రాతృభక్తి యన నిటులుండవలెన్ బన్నుగ భరతునికి వోలెన్! 2

అటు పిమ్మట నా ఋషులందఱునూ నా రావణ వధ గోరుచునూ!
రమ్యముగా నా ఋషులు బలికిరీ రంజిల నా భరతుని తోడన్! 3

మంచి కులంబున బుట్టిన వాడవు మహాప్రాజ్ఞుడవు ఓ భరతా!
తండ్రిపైన గౌరవ ముండినచో దగ జేయుము రాముని యాజ్ఞన్!
తండ్రి ఋణంబును దీర్పవలయునని దగ రాముడు వని యుండగనూ!
కోరుచుంటిమీ! యినవంశోత్తమ! కూరిమి నీవును రాజ్యంబున్!
పరిపాలింపుము బదునాల్గేడులు బాలింపుడు దశరథు నాజ్ఞన్! 4

దశరథుండు కైకేయి ఋణంబును దగ దీర్చుట జేతనె గాదా!
స్వర్గ సుఖంబులు బడయ గలిగెనూ! సరసముగా మీ రటువలెనే!
పితృఋణంబును దీర్చి వేయుడని ప్రీతిని గంధర్వులును మునుల్!
ఇంతమాత్రమే తెలిపి పోయిరీ వింతగ తమ తమ నెలవులకున్! 5

శుభదర్శనుడగు రామచంద్రుడును శుభకరమగు నా మాటలనూ!
విని హ్లాదిత సంహృష్ట వదనుడై యీ ఋషి మునులను బూజించెన్!

భరతుడు మాత్రము తప్తగాత్రుండై ప్రాంజలితో శ్రీరామునితో
గద్గద స్వరమున బలికె నీ విధిని కమనీయాక్షర మాలికగా! 6

రాజ ధర్మమును, కుల ధర్మంబును రహి కాపాడుము గాకుత్స్థా!
నా ప్రార్థనలను తల్లి యాచనను నయముగ మన్నింపుము రామా!
సమర్థుండ నే గాను రాఘవా! సంరక్షింపగ కోసలనూ!
పౌర జానపద సంఘమునంతను సరసముగా జూడగజాలన్! 7

బంధు మిత్రులును, హితాభిలాషులు బన్నుగ సైనికు లందఱునూ!
కర్షకుండు మేఘంబును గనినటు గాక్షింతురు నీ రాకడనూ!
మహా ప్రాజ్ఞ! యిక స్వీకరింపుమా! మహా రాజ్యమును నిలుప ధరన్!
ఈ ధరిత్రి నంతను బాలింపను నింపుగ నీవె సమర్థుడవూ! 8

ప్రియ వచనుండగు భరతు డంతటను ప్రియ సోదరుడగు రామునితో
ఈ విధముగ ప్రార్థించుచు నంజలి నింపుగ పడి పాదంబులపై
అంతట రాముడు నా భరతుని వే చింత దీర్చుచును నిటు లనియెన్!
తన యంకంబున గూర్చొన జేసియు దల దువ్వుచు దన హస్తమునన్! 9

తండ్రీ! యుత్తమ గురు శిక్షణచే దగు బుద్ధుల సీ వందితివీ!
రాజ్య పాలనము జేయ గలుగుదువు రమ్యముగా మెచ్చగ బుధులున్!
బుద్ధిమంతులగు మంత్రుల తోడను భూరి బలులునగు మిత్రులతో!
ఆలోచింపుము గలిసి వారితో నరసి యెట్టి ఘన కార్యంబున్!
వారలతోడనె చేయింపుము మఱి వడి వడి బరిశీలించుచునూ! 10

చంద్రుని నుండీ చంద్రకాంతులవి యింద్రజాలముగ పోవచ్చున్!
హిమవత్పర్వత మందు మంచువులు క్రమముగ లేకయు బోవచ్చున్!
సముద్ర జలములు నింకిపోయినను సహజ వాయువును మాసిననూ!
తండ్రి మాట నే నతిక్రమింపను ఖండితముగ నా మాట సుమా! 12

తండ్రీ! భరతా! నీదు తల్లియును దగ మానసున గల కోరికతో
ఆశవలననో, తనయుని కొఱకై యంతయు జేసెను నీ కొఱకై!
ఆమె చేసినది యంతయు దలచీ యలత జెందకుము మది యందున్!
మాతృమూర్తిగా మన్నన సేయుము మానుగ గాంచుము ననురక్తిన్! 12

ఆదిత్యుని దేజస్సుగలాడును నా శశి కాంతులు గలవాడున్!
అట్టి రాఘవుని బలుకులు వినుచును నా భరతుడు నిటులను వలికెన్!
హేమభూషితము లగు పాదుక లివి విమలమగు నీ పాదములన్!
నుంపుము నే దలదాల్చి కొనెదనూ యుంచెద సింహాసనముననూ!
ఈ పాదుకలే లోకమంతయును నింపుగ రక్షించుచు నుండెన్! 13

పురుషోత్తముడును దేజోనిధి యగు బొలుపుగ యా శ్రీరాఘవుడున్!
పాదుకలను బాదములను దొడిగీ బన్నుగ నిచ్చెను భరతునకున్! 14

పాదుకలను మఱి నమస్కరించుచు భరతుడు పలికెను రామునితో!
'పరంతపా! నా మాటలు వినుమా! బన్నుగ నీకై జూచుచునూ
జటలను ధరించి నార జీరలను జరించుచుందును నీ వలెనే
రాజ్య భారమది నీ పాదుకలను రహి నుంచుచు నే బాలింతున్! 15

వీక్షించుచు నుండెద నీ రాకను విమలమైన పురి వెలుపలనే!
వసింతు బదునాల్గేడు లిటులనే బన్నుగ గడిపెద జీవితమూ!
పదునాల్గేడులు గడిచిన పిమ్మట బన్నుగ నీ వగుపింపనిచో!
అగ్ని బ్రవేశింతును రామా యిక! నాలసింపకను మఱుదినమున్! 16

అటులే యనుచును నా రాముండును నంగీకారంబును దెలిపి!
ఆదర పూర్వకమున యా భరతుని యలరుచు గౌగిలిలో జేర్చి
ఆ శత్రుఘ్నుని గూడ గౌగిలిసి యటు బాలించుచు భరతునితో
ఇటుల వలికె శ్రీరామచంద్రుడును నింపుగ సుమధుర వాక్యములన్! 17

తండ్రీ! భరతా! నా పలుకులనూ తగ విని నిజములు సేయవలెన్!
తల్లియైన కైకేయిని భక్తిని దగ జూడుము వినయము తోడన్!

ఇంతయైన కోపమును జూపకుము నింత జేసెనని దలచుచునూ!
ఒట్టు బెట్టి నే దెలుపుచుంటినీ యొనరగ నాపై, సీత పయిన్! 18

అటు బలుకుచు నా రామచంద్రుడును నలరి బాష్పములు రాల్చుచునూ!
ఆ భరతునకును నానతి యిచ్చెను నయోధ్య నగరికి బోవుటకున్!
ప్రతాపవంతుడు ధర్మ విదుండును బన్నుగ యా భరతుండు మఱిన్!
అలంకరించిన యా పాదుకలను నలరుచు బూవుల బూజించీ!
ప్రదక్షిణంబును జేసి రాములకు నా పాదుకలను వే వెంటన్!
ఉత్తమమగు నొక గజము శిరసునను నుంచెను భక్తియు బొంగారన్! 19

మంచు కొండ వలె స్వధర్మంబునూ మానుగ నిలిచిన రాఘవుడున్!
అచటకు వచ్చిన గురువుల మంత్రుల నా యా జనముల నందఱినీ
భరతుని మఱి శత్రుఘ్నుని గూడను బంపివేసి నభివందలన్! 20

దుఃఖార్తులునగు దల్లులందఱును దుఃఖముచే మాటలు రాకన్!
వీడుకోలు వాక్యముల దెలుపకను వేదనతో మౌనము దాల్చన్!
అపుడు రాముడే తల్లుల నందఱ యటుల మ్రొక్కి శోకముతోడన్
పర్ణశాలలోనికి దా బోయెను బటపట రాల్చుచు భాష్పములన్!

(అయోధ్యాకాండములోని-112వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట పదమూడవ సర్గము

భరతుడు భరద్వాజ మునిని గలిసికొని అయోధ్యకు మఱలి వచ్చుట

అంతట భరతుడు రామపాదుకల సంతసమున శిరమున దాల్చి!
శత్రుఘ్నునితో గూడినవాడై సరగున యరదము దా నెక్కెన్!
అతని ముందు గులగురువు వసిష్ఠుడు నా జాబాలియు మంత్రులునూ!
వామదేవుడును సమస్త ద్విజులును వరుసను బోయిరి బయనింపన్!

వారందఱు నట చిత్రకూట గిరి యొప్పగ ప్రదక్షిణము దోడన్!
తూర్పు దిక్కునకు నభిముఖు లై రీ తీరము మందాకిని వై పున్
సుందరమగు బ్రకృతిని గాంచుచును శోభల గాంచుచు ధాతువులన్
ఆ పర్వత పార్శ్వమున భరతుడును నలరుచు బోయెను సైన్యముతో! 2

అంతట భరతుడు గాంచె నచ్చటను నా గిరి సమీప ప్రాంతమునన్!
భరద్వాజముని యాశ్రమంబునూ భవ్యాశ్రమ ధూమ ధ్వజముల్!
బుద్ధిమంతుడగు భరతు డంతటను బోయెను ముని కుటజంబునకున్
భరద్వాజముని పాదంబులకును భరతుడు మ్రొక్కెను రథము దిగీ! 3

అతని జూచి యా భరద్వాజుడును నలరుచు భరతుని బ్రశ్నించెన్!
పోయిన కార్యము సఫలమైనదా? పౌలుపుగ రాముని గలిసితివా ?
ప్రశ్నింపగ ముని భ్రాతృవత్సలుడు భరతుడు వలికెను నీరీతిన్! 4

రాజువు నీ వని రాజ్యము నీదని రమ్యముగా బాలింపుమనీ!
దృఢ విక్రముడగు రామచంద్రునీ గాఢముగా వినుతించితిమీ!
కులగురువైన వసిష్ఠుడు, నేనును కూరిమితో యాచించితిమీ!
కుల పురోహితుని తోడను బలికెను గూరిమి రాముం డిట్టులనూ! ౯

తండ్రి జేసినా ప్రతిజ్ఞ నేనును దగపాలించెద స్థిరముగమా!
పదునాల్గేడులు వనమున నుండెద భవ్య దీక్ష ముని వేషమునన్!
ఈవిధి పలికెను మంద మందముగు నింపుగ మధురాక్షరములతో
రాక్యజ్ఞుండగు వసిష్ఠ దేవుడు వాక్య కుశలుడగు రామునితో! 6

'మహాప్రాజ్ఞ! బంగారు బాదుకల మహాప్రసాదముగా నిమ్మా!
అయోధ్య ప్రజలకు నవి సమగూర్చును నఖిల యోగ క్షేమంబులనూ!' 7

గురుదేవుని మాటలు విని రాముడు గూర్మితోని ప్రాన్ముఖుడునునై!
పాదములందున ధరించి రాముడు బన్నుగ మఱలను నా కిచ్చెన్!
రాజ్యము నడుపుదు నీ పాదుకలను రాజాసనమున యందుంచీ!
మహాత్ముడగు శ్రీరాముని యానతి మంగళ కరమగు నయోధ్యకున్!
పోవుచుంటి పాదుకలు దీసికొని పోలుపుగ రాజ్యము జేయుటకున్! 8

మంగళకరమగు మాటలు విని యా మహితాత్ముడు నగు భరతునిచే
భరద్వాజుడును శుభకర వాక్యము భరతుని తోడను బలికె నిటుల్!
శీల వృత్తమున సచ్చరిత్రుడవు స్థిర బుద్ధివి గురు భక్తుడవున్
నీరు పల్లమున నిలిచినట్లుగా నీలో నిలిచెను సద్గుణముల్! 9

ధర్మజ్ఞుడవును ధర్మవత్సలత ధర్మాత్ముడవగు నిట్టిసుతున్
గనిన దశరథుడు నెంత ధన్యుడో! కథలు గావు! నిది నిజము సుమా!
మరణించిననూ దశరథేశ్వరుడు మరణింపని వాడేను సుమా!
శాశ్వతముగ తండ్రిని బ్రతికించిన సత్పురుషుండగు దనయుడవూ! 10

మహాత్ముడగు నా భరద్వాజ ముని మాటలు విని యాభరతుండున్!
అంజలి పట్టుచు నమస్కరించెను ననుమతి గోరెను బోవుటకై!
శ్రీమంతుడగు నా భరతుండును శీర్షముతో నా ముని వరుకున్
నమస్కరించుచు మంత్రుల దోడుత నయముగ బోయెను దన పురికిన్! 11

విశాలమగు నా సేన యంతయును వెంబడించె నా భరతునితో!
గజాశ్వములతో వాహనములతో గదలెను నయోధ్య పురి వైపున్!
అటుబిమ్మట వారలు దాటిరిగా నా యమునానది తీర్థమునూ!
శుభ జలములుగల భాగీరథినీ చూచిరి వారలు స్పందింపన్! 12

ససైన్యంబుతో బరివారముతో సరగున యా గంగను దాటి
శృంగిబేరి భరతుడు దర్శించెను సంగతిగా గుహు నట నొదిలి!
ఆ పురినుండీ బయలుదేరి మఱి నాభరతుండును సైన్యముతో
అయోధ్యపురమున కరుదెంచెనుగా సంతము లేనీ వేదనతో! 13

తండ్రిలేని, సోదరుడును లేనీ తగ నయోధ్యపురి గాంచుచునూ!
శోకతప్తుడై సారధి తోడుత శూరుడు భరతుడు నిటు లనియెన్! 14

సారధి వినుమా! యయోధ్య నగరము సకల శోభలును నశియించెన్ !
నిరాకారమై నిరానందమై నిర్జన వని వలె గనిపించున్!
దైన్యమంతయును గూడు గట్టుకొని దారిద్ర్యంబున నున్నయటుల్
శుభకర నాదములును నశించినవి సుందర చైతన్యము మానెన్! 15

(అయోధ్యాకాండములోని-113వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట పదునాల్గవ సర్గము

భరతుడు ఆయోధ్య దురవస్థను గాంచుట — అంతఃపురము ప్రవేశించి దుఃఖితుడగుట

మహాయశుండగు నా భరతుండును మహా ధ్వనియుగల యరదమునన్!
పయనించుచు నా యయోధ్యపురిలో ప్రవేశించె శీఘ్రము నతడున్ ! 1

పిల్లుల జేతను గూడ్లగూబలును బిలబిల లాడుచు నున్నదియున్!
నరసంచారము లేనిదియును మఱి గజ సంచారము లేనిదియున్!
అప్రకాశమై చీకటి రాత్రిగ యావరింపబడి యున్నదియున్
అట్టి యయోధ్యను ప్రవేశించెనూ! యా భరతుండును నరదముపై! 2

ప్రజ్వలిత ప్రభ శ్రీలతోడుతను ప్రభలడిందుచును నున్నదియున్!
క్రూరగ్రహంబుల పీడన చేతను గ్రృశించుచును నట నున్నదియున్!
రాహు శత్రువగు ఇంద్రుని సతియగు రమణి రోహిణికి వలె నున్నా
అట్టి యయోద్యను ప్రవేశించెనూ యా భరతుండను నరదముపై! 3

ఆలోప్షణంబగు క్షుబ్ధ సలిలయగు నావిరి గ్రక్కుచు నున్నదియున్!
ఎండలనే బహు దంపింపబడినా నుండిన పక్షులు గలదియునూ!
మీన ఝుంబులు గ్రాహంబులు మఱి మిగుల యణగిబడి యున్నదియున్!
ఎండిపోయినా పర్వత నదివలె యుండె యయోధ్యా నగరంబున్!
అట్టి యయోధ్యను ప్రవేశించెను యాభరతుండును నరదముపై! 4

ప్రారంభంబున జైకి నెగురుచును బంగారము వలె మెఱయుచునూ!
హవిస్సు వేయగ చల్లబడినదై యా కాంతుల వే దగ్గినదియున్!
నాశము బొందిన యధ్వరాగ్నివలె యా యయోధ్యయును నటులుండెన్!
అట్టి యయోధ్యను ప్రవేశించెనూ యా భరతుండును నరదముపై!

మహాయుద్ధమందున కవచములును మహాయుధములు నశించిసదీ!
రథాశ్వ గజములు బదాతి దళములు రహి ధాత్రిని బడి యున్నదియున్

ఉత్తమ వీరులు నశించిపోయిన యున్న సైన్యముగ యయోధ్యయున్
భయంకరముగా గనబడుచుండెను బన్నుగ యా రామానుజుకున్! 6

ధ్వనితో నురుగుల తోడను లేచిన యురుతర సముద్ర తరంగమున్!
ప్రశాంత మారుత వాయువు చేతను బడలి చెదిరినటు దరంగమున్
అట్టి తరంగమురీతి నుండెనూ యా నగరము ధ్వని లేకుండన్!
ఇట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 7

యాగ సమాప్తంబైన బిమ్మటను యాజ్ఞికులందఱు బోయినదీ!
యాగ వస్తువులు నుపకరణంబులు నంతట లుప్తంబైనదియున్!
గత రవమైనా యజ్ఞ వేదివలె కాంతి హీనమై పురి యుండెన్
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 8

వృషభముచే బరిత్యక్తమైన యా వృషభముపై బహునాసక్తిన్
తృణములు మేయక యార్ద్రహృదయమై యటునిటు జూచుచునున్నదియున్
గోష్ఠము మధ్యన యున్నయట్టి యా గోవువోలె నాపురియుండెన్
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 9

పద్మరాగములు మణుల జేతనూ! బ్రకాశించు నవరత్నములన్!
విడువబడిన ముత్యాల దండవలె గడు నీరవమును గలిగినదీ!
కాంతిహీనమై కళలు దగ్గినా ఏంతజీకటుల నున్నపురిన్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 10

చేసిన బుణ్యము నశియించుటచే నాస్థానమును జలించియునూ!
కాంతితగ్గినా నక్షత్రముగా గగనమునుండీ జారినదీ
వింతగ ధరిత్రిబడినటులుండెను సుంతలేక గత కాంతిప్రభల్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 11

వసంతాంతమున ద్రుతదావాగ్నిని వన్నెల పూవులచే నిండీ!
మత్తభ్రమరములచే నిండిన యా మాలతి లత యెటు నేలవడున్!
వనలతవలె యామయోధ్య పురియును వాడి పోయినటు గన్పించున్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యాభరతుండును నరదముపై! 12

ఆ యయోధ్యలో గార్యాలయములు నన్నియు సంక్షిప్తంబులుగా
క్రయవిక్రయములు శూన్యము లయినా కాంతులు దగ్గిన యాపురియున్!
అలమేఘము శశిదారల గప్పిన నాకాశమువలె బురియుండెన్
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 13

ఉత్తమ బానీయములు క్షీణమై చిత్తుగ బడినా పాత్రలచేన్!
సంస్కారం బింతయు లేకయును నసంస్కారంబై యున్నదియున్!
పానాధ్యక్షుడు మరణించిన యా పానశాల వలె పురియుండెన్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ! యా భరతుండును నరదముపై! 14

భూమితలము బల్లమునకు పోగా బోరలుదు బాత్రలు నటునిటుగా!
త్రాగుటకింతయు జలములు లేకను తటపట బొరలిన భాండములున్!
విరిగిపడిన చలివేందల వలెనూ విమలత దరిగిన పురియుండెన్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 15

విశాలమైనది వ్యాపించినదీ విలక్షణంబగు నారియుమా!
బలవంతుల బాణముచే దెగివడి బలము దప్పి నేలను వడినా
శరాసనంబున నారికి వలెనూ శ్రావ్యత దప్పిన పురియుండెన్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 17

యుద్ధ శూరుడగు రౌతు దటాలున యుద్ధాశ్వము దా నెక్కియునూ!
యుద్ధ రంగమునకును పోగా నది యుద్ధరంగమున మరణింపన్
చంపబడిన యాయాశ్వు గుఱ్ఱముగ చంచలముగ నాపురియుండెన్!
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ యా భరతుండును నరదముపై! 17

శుష్కతోయములు గలదియు మట్టియును శూన్య దటంబులు గలదియునూ!
మత్స్య కూర్మములతో నిండినదీ మానుగ కలువలు లేనిదియున్!
అట్టి దిగుడుబావికి వలె నుండెను యా యయోధ్యపురి యటులుండెన్
అట్టి యయోధ్యను బ్రవేశించెనూ! యా భరతుండును నరదముపై! 18

చంధనాగురులు బూయకయును మఱి యందమైన భూషణములనూ!
అలరి ధరింపక యమిత దుఃఖమున నటమట జెందుచు వేదనతో!

నున్న పురుషుని శరీరంబువలె నుండెను నాపురి శోభయునూ!
అట్టి యయోధ్యను ప్రవేశించెనూ యా భరతుండును నరదము పై! 19

ప్రావృట్కాలమ్మునందు భాస్కరుడు పన్నుగ నాకాశమున్నందున్!
నల్లని జీమూతములు గప్పబడి మెల్లగ జారిన కాలమునన్!
ప్రచ్ఛన్నంబగు కాంతిగ నుండెను ప్రభలు దప్పినా దినమునలెన్!
అట్టి యయోధ్యడును ప్రవేశించెనూ! యా భరతుండున్ను నరదము పై! 20

శ్రీమంతుండగు దశరథాత్మజుడు శీలవంతుడగు భరతుండున్!
రథమునందు గూర్చిండినవాడై రథము నడుపు నా సారథితో
నిటుల వలికె బహు వేదనతోడను చటులమైన యాశ్చర్యమునన్! 21

కారణమేమో యయోధ్య నగిరిని కమ్మని గీతా వాద్యధ్వనుల్!
పూర్వమువలె వినిపించుట లేదూ! సర్వము నున్నది మౌనముగా!
మదగంధంబును మాల్య గంధమును మఱి యగరుపుల సుగంధంబున్
పరిమళించుటయు లేదు గదా! యీ పట్టణమున్నది శూన్యముగా! 22

రాముడు వని కేగుటచే నిప్పుడు రమ్య వాహన ధ్వని లేదూ!
గజాశ్వరథముల ధ్వనులు శూన్యమై కడు మృదంగ ధ్వనులును లేవూ!
తరుణవయస్కులు బహు దుఃఖితులై దగ చందనమును నగరువులున్!
పుష్పమాలలను ధరింపకుండగ స్ఫూర్తి దప్పియుండిరి కలతన్! 23

రామశోకమున బీడితమై పురి రమ్య శోభలను గోల్పోయెన్!
పుష్పమాలలను విలాస యాత్రలు బూర్తిగ మానిరి నగర ప్రజల్
ఈ పురి శోభయు వెడలిపోయినది నింపుగ రామునితో వనికిన్!
కృష్ణపక్ష రాత్రికివలె నగరము గృశించినటు గన్పడుచుండెన్!
ధారావర్షము గురియు రాత్రివలె ధరిత్రియుండెను శోభిలకన్! 24

ఎపుదు వచ్చునో రాముడు నగరికి నింపును గూర్చునో ప్రజాళికిన్?
గీష్మమందు నంబుదమునకు వలె హర్షము గూర్చునొ యీపురికిన్?
సుందరమగు వేషములు ధరించియు శూరులవలె నడిచెడి యువకుల్
విశాల మార్గములందు నయోధ్యను వెదికిన కనబడుటయు లేదూ! 25

భరతు డిటుల నా సారథి దోడుత పలు విధముల మాటాడుచునూ!
తం(డి గృహంబునకును దా బోయెను దం(డి యున్నటుల (భమజెందీ!
దశరథేం(దు డట లేకపోవుటను దతిగెను శోభలు శూన్యంబై
సింహములేనీ గుహవలె నుండెను శ్రీలు దప్పినా గృహమువలెన్! 26

ఆత్మవంతుడగు నా భరతుండును నట జని గనె బహువేదనతో
అభాస్కరంబగు దినమును వోలెను నా దేవతలును విడిచినదీ!
కాంతిదప్పినా శూన్యగృహంబును వింతగ చూచెను గన్నీటన్!
ఆయంతఃపుర మంతయు జూచెను నడలుచు దం(డిని దలచుచునూ!

(అయోధ్యాకాండములోని 114వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట పదినైదవ సర్గము

[భరతుడు రాముని పాదుకలకు పట్టాభిషేకము నొనరించుట]

దృఢవ్రతుడగు నా భరతు డంతటను దీనత దల్లుల బురిజేర్చి!
శోకముతో నా గురువులతోడను శూరుడు భరతుడు నిటు లనియెన్!
పోవుచుంటి నే నందిగ్రామము బొలుపుగ వీడ్కొలుల తోడన్!
గ్రుమ్మరింతు నట దుఃఖము సంతను గూరిమి రాముని విరహంబున్! 1

దశరథరాజును స్వర్గము నేగెను దగ రాఘవుడును వని కేగెన్!
అన్నకొఱకు నే నెదురు జూచెదను నాతడె రాజుగదా మనకున్!
మహాత్ముడగు నాభరతుని మాటలు మంగళ కరముగ చెవినొగ్గి!
వసిష్ఠుండు మఱి మంత్రులందఱును విశదముగా బలికిరి నిటులన్! 2

భ్రాతృవత్సలత బలికిన పలుకులు భరతా! వలుకగ నీకె దగన్!
శ్లాఘనీయములు సర్వ జనులకును సర్వత యాదరణీయంబుల్!
బంధులుబ్ధుడవు, సోదర ప్రేమయు బన్నుగ గలవాడవు నీవున్
పెద్దల మార్గము ననుసరింపగా నిద్ధరిత్రి కాదను నెవడూ? 3

యథాభిలాషితముగ బలికిన మఱి యా మంత్రుల వచనముల వినీ!
భరతుడు సారథితో నిటు వలికెను నరదము సిద్ధము జేయుమనీ!
శ్రీమంతుండగు భరతు డంతటను జిత్తము సంతసమున బొంగన్!
తల్లులందఱకు నమస్కరించెను దగ భక్తి శ్రద్ధలతోడన్!
శత్రుఘ్నునితో గూడినవాడై సరగున నెక్కెను నరదంబున్! 4

భరతుడు శత్రుఘ్నుడు సంతసమున బన్నుగ శీఘ్రము రథమెక్కి!
మంత్రులతోడను గురువుల తోడను మానుగ నందీ పల్లియకున్!
గురువులైన యా వసిష్ఠాదులును గూరిమి వచ్చిన బ్రాహ్మణులున్!
తూర్పు దిక్కునకు నభిముఖులైరీ దొరముగా గ్రామంబునకున్! 5

భరతుడు బోవగ నందిగ్రామము బన్నుగ యయోధ్య బౌరులునూ!
గజాశ్వరథముల పదాతి దళములు గడువేడ్కను బోయిరి వెంటన్!
పిలువకుండగనె పోయిరందఱును ప్రేమ యనిన యటులుండవలెన్! 6

భాతృ వత్సలుండైన భరతుడును భద్రముగా నా పాదుకలన్!
శిరసునందునను భక్తి నుంచుకొని సరగున బోయెను బల్లియకున్! 7

అంతట భరతుడు బల్లియకును జని సరదంబును దిగి వేగముగా!
గురువులతోడను నిట్లని వలికెను గూర్మిని మధురాక్షరములతో! 8

నా సోదరుడగు రాఘవు డిచ్చెను న్యాసముగా నీ రాజ్యంబున్!
హేమ భూషితంబైన పాదుకల నేమముగా నా కివ్వబడెన్!
ఈపాదుకలే యోగక్షేమముల నింపుగ జూచును రాజ్యంబున్! 9

పిమ్మట భరతుడు నుత్తమ న్యాసము బ్రీతి పాదుకల శిరస్సునన్!
నుంచి వలికె ప్రకృతి మండలమును నంచితముగ దుఃఖము తోడన్!
ఛత్రము వట్టుడు బ్రకృతి మండలము సరసత రాముని పదములకున్!
అన్నగారి పాదుకలను గాంచుట నంతట ధర్మము స్థాపించున్!
నామీదను గల యట్టి ప్రేమచే నా కిచ్చెను నీ న్యాసమునూ!
వచ్చువఱకు రాముడు నిచ్చటికిని స్వచ్ఛముగా బాలించెదనూ!
రాముడు వచ్చిన బిదప స్వయముగా రాముని పాదములకు దొడిగి
సపాదుకములగు రాముని పదములు సరసముగా జూచెద నపుడున్! 10

రాజ్యభార మిపు డుంపబడినదీ రహి నా భుజ స్కంధంబులపై!
రాముడు రాగా రాజ్యమిచ్చి మఱి రహి శుశ్రూషను జేసెదనూ!
ఉత్తమ న్యాసముగా నుంచిన యీ యురుతర రాజ్యము, బాదుకలన్!
సమర్పించి రామునకు మఱల నే సర్వ బాపరహితుడ నౌదున్! 11

అభిషిక్తుండగు రాముని జూచీ యానందింతురు సర్వప్రజల్!
నాలుగు రెట్లానందము నొందుదు రాజ్యము బొందిన స్థితికంటెన్!
సకలప్రజలు నన్నభినందింతురు శాశ్వత కీర్తియు మఱి కలుగున్! 12

మహా కీర్తి శాలియునగు భరతుడు మానుగ దీనత దుఃఖితుడై!
విలపించుచు నా నందిగ్రామమున విదితులైన మంత్రుల గూడీ!
రాజ్యము జేసెను రమ్యముగా నా రాముని ప్రతినిధిగా నుండీ! 13

నారజీరలను జటల ధరించియు రమ్యమైన ముని వేషముతో!
భాతృవత్సలుడు, ప్రభువును నైనా భరతుడు నంది గ్రామమునా!
సేనా సహితముగా నివసించెను శ్రీకరముగ రాజ్యము నేలెన్! 14

భ్రాతృవత్సలుడు భరతు డంతటను భ్రాతృ నాజ్ఞ బాలించుచునూ!
తన ప్రతిజ్ఞను నిర్వర్తించుచు దగ శ్రీరాముని బాదుకలన్
అభిషేకంబును జేసి యన్నకై యాతని రాకను గాంచుచునూ!
నందిగ్రామమునందు వసించెను నందఱు నాతని కీర్తింపన్! 15

సకల రాజ కార్యములను దెలుపుచు సర్వము విదితము జేయుచునూ
ఆ పాదుకలకు దాను స్వయముగా నలరుచు బ్రతినిధిగా నుండెన్
ఛత్ర చామరములను బట్టుచునూ భ్రాతుని వలె దా నట నుండెన్! 16

శ్రీమంతుండగు భరతు డంతటను శీల వ్రతుండగు రాఘవునీ
పాదుకలకు నభిషేకము జేసీ! బంటు వోలె నత డట నుండెన్!
ఏ కార్యము నట వచ్చిన గూడను నే ఉపాయనము నెదురైనా!
ముందుగ దెలుపును రామబాదుకల కందగ జేయును గార్యములన్!
ఈ విధముగ నా రాజ్యముజేసెను నింపుగ ప్రజలును హర్షింపన్! 17

అయోధ్యాకాండములోని-115వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యాకాండము – రెండవ భాగము

## (నూట పదునాఱవ సర్గము)

[వృద్ధ కులపతితో పలువురు ఋషులు రాక్షసులకు భయపడి చిత్రకూటమును వీడి మఱియొక ప్రదేశమునకు బోవుట]

భరతు డయోధ్యకు బోయిన పిమ్మట పన్నుగ రాముడు యథాస్థితిన్!
చిత్రకూటమందుండగ మునులను చిత్రముగా భయపడిన యటుల్!
ఆ ప్రదేశమును విడిచి వెడలగా నభిలషించు చున్నట్టులనూ!
శ్రీరాముడు గుర్తించెను మనసున చిత్తము గలతను బొందగనూ! 1

ఆశ్రయించుకొని యున్న వారలే యాశ్రమ వాసులు నా మునులున్!
ఔత్సుక్యముతో నున్న వారలుగ యా రాముడు వారిని జూచెన్! 2

శంకిత నేత్రంబులను జూచుచును శంకిత స్వభావముల తోడన్!
కనుబొమ్మల విరుపులతో గూడుక కానరాని యనుమానములన్!
గొణుగు కొనుచునూ సంజ్ఞల తోడుత కూరిమి తొలగిన మాటలతో!
కనుగొనె రాముడు మునుల ప్రవర్తన కలత బొందె రాముని మనసున్! 3

మునుల సంగతులు జూచి రాముడును ననుమానించెను మనసుననూ!
అవమానంబే మైన జరిగెనో యాపదవచ్చెను తమ వలనన్!
అనుచు గులపతికి నమస్కరించుచు వినయాంజలితో నిటు లనియెన్! 4

భగవంతుడ! యీ మును లందఱిలో నగుబడుచున్నది వికృతియున్!
ఇంతవఱకు నే నడచిన నడతను నింత వికారము లేదుగదా!
తమ్ముడైన లక్ష్మణుని ప్రవర్తన నిమ్ముగ వికృతి లేదు గదా!
చేయరాని పని చేయలేదు గద! చేసిన దెలుపుడు శీఘ్రముగా! 5

నాకును మీకును సేవలు జేయును నయముగ జానకి విషయమునన్
ప్రమదాఖ్యుచితము బనులు సేయదో బన్నుగ దెలుపుడు మునివర్యా!

వృద్ధుండును మఱి తపోవృద్ధుడును వృద్ధ కులపతియు వణకుచునూ!
భూతదయాపరుడైన రాముతో భీతచిత్తుడై నిటు లనియెన్! 6

మంగళకరమగు స్వభావంబునూ మంగళముల యందాసక్తిన్!
గలిగిన జానకియం దెటు గలుగును కర్మ ధర్మ హీనంబులునూ!
విశేషించి యా మునుల విషయమున విమల గౌరవము జూపించున్!
త్వన్నిమిత్తమున మునులకు ఋషులకు దగ రాక్షస భయ మొచ్చిపడెన్!
ఆ కారణమున భయమును జెందుచు నతి రహస్యమున బలుకుటయున్! 7

తండ్రీ! యిచ్చట రావణు దమ్ముడు దగ ఖరుడను రక్షసు డొకడున్!
జనస్థానమున మునుల నందఱిని జంపెను మునిజన ఘాతకుడున్!
క్రూరుడు పురుషాదకుడు గర్వియును క్రూరపాప యవలిప్తుండున్!
అట్టి రాక్షసుడు నిన్ను జూచి మది యిట్టె క్రోధమున నున్నాడున్! 8

ఎప్పుడు నీవును నిట కొచ్చితివో నప్పటి నుండియు రాక్షసులున్
మునుల ఋషుల బాధించుచుండిరీ మూర్ఖులు గన్నులు గనరాకన్!
భీభత్సములును, గ్రూరమైనవీ భీతిని గలుగగ జేయునవీ!
వికృత రూపముల వికారములతో వింతధ్వనుల భయవెట్టుచునూ!
కనిపించుచు నుండిరి రామా! యిట కనులు జెదర యా రక్కసులున్! 10

దుష్టులైన రాక్షసులు కొందరిట శిష్టులైన మును లందఱిపై
అపవిత్రములను జల్లుచు వారల నడనగ జేయుచు నున్నారూ!
అల్పబుద్ధిగల యా రాక్షసులును యాశ్రమముల లోపల దాగీ!
మునులను జంపుచు నుండిరి రామా! మోదము జెందుచు నుండిరిగా! 11

హోమము జరుగుచు నుండగ వారలు హోమపాత్రలను బడద్రోచీ!
అగ్నులందు నుదకములను జల్లుచు బెగ్గటిలగ మా కలశములన్!
పారవేయు చున్నారు దూరముగ బ్రద్దలు జేయుచు నుండిరిగా! 12

ఈ దురాత్మకులు బెట్టు బాధలను నిట బడలేకను ఋషి మునులున్!
ఆశ్రయించినా యాశ్రమంబులను నలరి విడిచి వేఱొకచోటన్!
నివసింపగ బోదము రమ్మనుచును నిలిచి యడుగు చుండిరి వారల్! 13

దుష్టరాక్షసులు మునుల విషయమున కష్టములను జేయుటె కాదూ!
శారీరకమగు హింసలు సహితము సరగున జేయుచు నుండిరిగా!
ఈ యాశ్రమమును విడిచి బోయెదము నింపుగ మఱియొక స్థలమునకున్! 14

ఇచటికి సమీపమునను నున్నదీ యింపుగ చిత్ర వనం బొకటీ!
కంద మూలములు ఫల పుష్పంబులు సుందరమగు ప్రకృతి యందున్!
పూర్వాశ్రమమును నాశ్రయించెదను బొలుపుగ మునిగణములతోడన్! 14

తండ్రీ! నీ యందును రక్కసుడును ఖండితముగ చెడు సేయుసుమా!
ఇష్టమైనచో మాతో రమ్మిక యింపుగాదు; నిట నివసింపన్!
ఎంత సమర్థుడవైనను గూడను కాంతాసహితుడ వీవు గదా!
ఎంత జాగ్రతగ నుండిన గూడను కొంత సందియము గలుగుసుమా!
ఇట నివసించుట బహుళ ప్రమాదము నింపుగ మాతో రమ్మటకున్! 15

ఈ విధి కులపతి పలికి రామునితో నిమ్ముగ యాశ్రమమును నొదిలీ!
వెడలిపోవ సిద్ధము బడుచుండగ వెడల వలదనుచు రాఘవుడున్!
ఎన్ని జెప్పినను వినక మునులునూ! చెన్నుగ విడిచిరి యాశ్రమమున్! 16

ఆ కులపతియును రాముని మిక్కిలి యభినందించుచు వీడ్కొలిపి!
ముని గణములతో గలిసి వెడలెనూ! ముదమున పూర్వాశ్రమమునకున్!
రాముడు గూడను మునుల దోడుతను రమ్యముగా నడచుచుబోయీ!
వీడుగొలిపి, యంజలి ఘటించుచును విని వారలు జెప్పిన వాసిన్!
అనుమతి నొందీ తిరిగి వచ్చెనూ యలరి పర్ణశాలకు మఱలన్! 17

ప్రభువగు రాముడు నిరాశ జెందగ భద్రముగా నటనే యుండెన్!
రుషి ధర్మంబును నాచరించు గద! ఋషులే శ్రీరాముని గాంచీ!
రుషి ధర్మంబును నాచరించెదరు ననుసరించెదరు నా త్రోవన్! 18

(అయోధ్యాకాండము 116వ సర్గము సమాప్తము)

★ ★ ★

## అయోధ్యకాండము - రెండవ భాగము

### నూట పదునేడవ సర్గము

[శ్రీరామాదులు అత్రి మహాముని యాశ్రమమునకేగుట-అనసూయ సీతను సత్కరించుట]

తాపసులందఱు బోయిన పిమ్మట తగ రాముడు యోచన జేసి!
బహు కారణముల యట నుండుటయును భద్రము గాదని భావించెన్!
భరతుని, దల్లుల, పౌరులందఱిని బన్నుగ నిచ్చట జూచితిని!
వారల స్మృతియే యహర్నిశలునూ వరుసగ వచ్చుచు నుండె మదిన్! 1

ఈ సమీపమున భరతుడు సేనను నింపుగ నిలుపుటచే నిచటన్!
అశ్వగజంబుల మల మూత్రములను నంతట దుర్గంధం బయ్యెన్!
అందు వలన మఱి యింకొక చోటికి బందముగా బోవుద మనుచున్!
రాముడు మదిలో యోచన జేసి రహి సీతా సౌమిత్రులతో!
చిత్రకూట పర్వతమును విడిచి చిత్ర ప్రకృతిని బయనించెన్! 2

మహా యశుండగు శ్రీరాఘవుడును మానుగ పయనము గావించి!
అత్రి మహాముని యాశ్రమంబునకు నలరి జేరె సత్వరిత గతిన్!
ఆశ్రమంబునను గల యా మునికిని నలరి నమస్కృతు లొనరించెన్!
ఆ ముని గూడను రాముని జూచెను నాదరించె పుత్రుని వోలెన్!

అత్రి మహాముని యా రామునకును యథా విధిని యాతిథ్యముతో
ఆదరించె యా సీతను, లక్ష్మణు సాదరముగ శుభ వాక్యములన్!
సర్వభూత హితుడును, ధర్మజ్ఞుడు సర్వజ్ఞుడు నగు నత్రిముని!
అటువచ్చిన కడు వృద్ధురాలు సతి యనసూయను నటకును బిలిచి!
ఆమె ముందఱను రామాదులనూ నాదరంబుగను నోదార్చెన్! 4

అంతట మునియును సతితో బలికెను నా సీతను గైకొమ్మనుచున్!
తపశ్శాలియును మహాభాగయును ధర్మచారిణియును ననసూయన్!

రామునకును బరిచయమును జేయుచు రమ్య వచనముల నిటు పలికెన్!
ఆ యనసూయయు లోనికి బోయెను నా జానకినీ రమ్మనుచున్! 5

దశవర్షంబులు గాటకంబునను దద్దరిల్లు నా సమయమునన్!
కందమూల ఫలముల సృజియించెను గంగను బ్రవహింపగ జేసెన్!
దశసహస్ర వర్షంబులు దపమును దా జేసెను గడు నియమములన్!
ఎన్నో వ్రతములు నోములు జేసెను నింపుగ సురలును సంతసిలన్! 6

సురలకు సాయము జేయుట కొఱకై సురుచిరముగ విఘ్నములనూ!
తొలగ జేసి మఱి పది దినంబులును దోరముగా జేసెను రాత్రిన్!
నీకు దల్లివంటిది సుమ రామా! నిర్మల మతి యా యనసూయా!
నేను గూడ గౌరవమున జూతును నీకు బూజనీయయు గూడన్!

తన కార్యంబులచే ననసూయగ తగ ఖ్యాతిని బొందెను రామా!
సర్వ ప్రాణులకు వందనీయ మఱి శాంత స్వభావము గలదియునూ!
యశశ్వనియు మఱి వృద్ధురాలుగా నామె కడకు జని జానకియున్!
ఆశీస్సులనూ పొందుగాత! యని యత్రి మహాముని పలుకంగన్! 8

ఆ ముని మాటలు విని శ్రీరాముడు 'సటులే!' యనుచును బలుకుచునూ!
ధర్మజ్ఞయునగు సీతాసతికిని దగ నీ రీతిని వాక్రుచ్చెన్!
వింటివి గద! జానకి మునిమాటలు గంటివి గద! యా ముని పత్నిన్!
అనసూయా దేవిని దర్శింపుము నలరి శ్రేయములు బ్రాప్తించున్! 9

హితమును గోరుచు రాముడు పలికిన యే తద్వచనములను వినుచున్!
ధర్మజ్ఞయునగు మైథిలి యంతట తపస్వినియు నగు సతిజేరి!
ప్రదక్షిణంబును జేసి యంజలిని పాదకమలముల స్పృశియించెన్! 10

శిథిలమైనదీ, ముడుతలు పడినది వృద్ధురాలు మఱి వణకునదీ!
తెల్లపడిన మూర్ధజములు గలదియు పల్లవించినా మది కలదీ!
అధికమైన వాయువుగల తోటల యటు నిటు నూగెడి కదళివలెన్!
అట్టి భాగ్యవతి మహా పతివ్రత యనసూయా దేవిని గాంచి! 11

తొందరపాటును లేక జానకియు జిందుచు భక్తిని వినయమునన్!
తన పేరును జెప్పుచును మ్రొక్కెనూ దగ యేకాగ్రత చిత్తమునన్!
అనిన్దిత యనగు నా తపస్వినికి నా రాముని సతి యటు మ్రొక్కె!
అంజలితో నారోగ్యము గూరిచి యామెను బ్రశ్నించెను వేగన్!

అంతట నా యనసూయా దేవియు స్వాంతమందు సంతస మందీ!
మహా భాగ్యవతి యగు నా సీతను మానుగ యోదార్చుచు ననియెన్!
'భాగ్యవశంబున ధర్మదేవతను బాలించుచు నున్నావుగదా!
భామిని విను! నీ భాగ్యవశంబున బంధుజనంబును మానసమునా!
ఐశ్వర్యంబును వదిలి వచ్చితివి యలరుచు భర్తను గూడికొని!
వనమునందు జనుచున్న భర్తతో వినయముగా జనుచుంటి వహో! 13

వనిలో నున్నను, బురిలో నున్నను వాసిగ ప్రమదకు భర్తగదా!
పాపాత్ముడు బుణ్యాత్ముడైననూ బన్నుగ యాతని గూడికొని
అనుసరించి యుండెదరో వారికి నమరును నుత్తమ లోకములన్! 14

ఆర్యవర్తనముగల యా ప్రమదకు అనార్య వర్తన గలవాడున్!
స్వేచ్ఛాచారము గలవాడైనను జీవలకు ధన శూన్యుండైనా!
పతియె సతికి గతి పరమ దైవతము బతిని మించినది లేదు ధరన్! 15

నే నెంతయు యోచించిన గూడను నిఖిలము బరిశీలించిననూ!
భర్తను మించిన బంధువు నెచటను బన్నుగ కన్పించుట లేదూ!
తపసు వంటి వా డాతడు తరుణీ! తరగని సౌఖ్యము నతడిచ్చున్! 1

కామమునకు వశమైన మనస్సున గడగి పతుల శాసించుచునూ!
దుష్టస్త్రీలు నట మంచి చెడ్డలను భూరాలోచన లేకయునూ!
వర్తింతురుగడ! లోకము నందున వసుధను నపయశమును బొందన్! 17

మైథిలి వినుమా! యట్టి ప్రమదలును నకార్య వశులై యీ వసుధన్
అపకీర్తిని బొందుచు, ధర్మంబును నాచరింపరుగ మానమునన్! 18

సద్గుణములచే గూడి లోకమున సత్యాసత్యములను గనుచున్!
మంచిచెడ్డలను బరికించుచునూ! మానుగ నీ తగు వనిత లీలన్!
అనేక పుణ్యంబులు ధర్మంబులు నలరుచు జేసిన వారి వలెన్!
విహరింతురు స్వర్గమున జానకీ! వేల వేల వత్సరములునూ! 19

పతిదేవుని నీ వనుసరించుచును బతివ్రతల యాచారంబుల్!
బాటించుచు సహధర్మచారిణిగ బాటింపుము ధర్మము నెపుడున్!
కీర్తి యశస్సులు బొందగలవు నూ! నార్తిని బొందవు నే నాడున్! 20

(అయోధ్యాకాండములోని 117వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట పదునెనిమిదవ సర్గము

[అనసూయ సీతకు ప్రీతి బహుమానము లిచ్చుట — అనసూయ ప్రశ్నింపగా సీత తన స్వయంవర వృత్తాంతమును దెలుపుట]

అసూయలేనీ యా జానకియును ననసూయా సతి పలుకు వినీ!
ఆమాటల శ్లాఘించుచు మైథిలి యలరుచు మెలమెల్లన వలికెన్! 1

పూజ్యురాలవగు నీ విటు బలుకుట వొంకము! నాశ్చర్యము గాదూ!
సతికి భర్త పూజ్యుండను విషయము సరసరీతి నే నెఱుగుదునూ!
పూజ్యురాల! విను నా హృదయేశుడు బొందుగ చరిత్రహీనుడునూ!
ఐనను నే పూజింపవలయుగా నతిభక్తి విధేయత తోడన్! 2

గుణములచే శ్లాఘింప గలాడును కూరిమి దయామయుండు మఱిన్
స్థిరమగు ప్రేమయు గలవాడును మఱి జితేంద్రియుడు ధర్మాత్ముడునూ!
తల్లివోలె మఱి జనకుని వోలెను దగ నిష్ఠుండును నగువాడున్!
అట్టి భర్త విషయంబున వేరే జెప్పగ వలయున వివరించీ! 3

బల్లిదుండు శ్రీరామచంద్రు డా తల్లి కౌసలను నెటుగాంచున్
ఇతర రాజ కాంతల నటు జూచును నింపుగ తన తల్లులకు వలెన్!
నృపవత్సలుడును ధర్మ విదుండును ధర్మజ్ఞుడు శ్రీరాముండున్!
రాజౌక పరి గాంచిన స్త్రీ జనమును రమ్యముగా దల్లుల వలెనూ!
భావించును మఱి గారవించునూ భక్తి వినయములు సంధిలగన్! 4

భయావహంబగు నిర్జన వనమును బయనమైన యా సమయమునన్!
అత్తగారి యుపదేశము నామది యలరి యున్నదీ స్థిరముగనూ!
వివాహ సమయమునందు నగ్నికడ విమలమైన యుపదేశంబున్!
తల్లిజెప్పినా మాటలు నా మది వెల్లి విరియు నెల్లప్పుడునూ! 5

ధర్మచారిణీ! ఓ యనసూయా! ధార్మికమగు నా వచనములన్!
నవీకృతంబులు జేయుచున్నవి నాలో నుండిన భావములన్!
పతి శుశ్రూషయె స్త్రీకి దపంబది బరగ లేదుగా మఱియొకటి! 6

పతి శుశ్రూషను సావిత్రీ సతి బన్నుగ స్వర్గంబున కేగెన్!
అట్టి ప్రవృత్తియు గలిగిన నీవును గట్టిగ బోదువు దివమునకున్!
వరిష్ఠయగు నారోహిణి సతియును వాసిగ చంద్రుని గనకుండన్!
ముహూర్తకాలము నైన యుండదూ మోదమునను నాకాశములో! 7

ఉత్తమ స్త్రీలెందఱొ భువి భర్తల సాత్త్విక సేవను జేసి మఱిన్!
తాము జేసినా పుణ్యకర్మలకు దగువిధి యుత్తమ లోకములన్!
పూజింపగ బడుచుండిరి మాతా! పుణ్యసతులు దమ భర్తలతోన్! 8

సీత మాటలను విని యనసూయము జిందుచు సంతోషంబు మదిన్!
సీత శిరంబును ముద్దుబెట్టుకొనె సీతకు సంతోషము గలుగన్!
మధుర మధురముగ బలికె నిట్టులకు మధురాక్షరములు బొరలంగన్! 9

శుచిస్మితే! విను! సీతా! తెలిపెద సురుచిరముగ నా వాక్యములన్!
అనేక నియమములచే నే బొందితి ననంతమగు దపసును గలదూ!
అట్టి తపోబలములచేతను నే యిష్ట కోరికల నిచ్చెదనూ!
ఏమి కావలయునో కోరుము నిదె యిచ్చెద నీమది వాంఛలనూ! 10

సీతా! నీ మాటలు యుక్తముగను చిత్త మనోహరమగు నవియున్!
సంతోషించితి! కోరుకొనుము! నే సరగున నిచ్చెద కోరికలన్!
అత్రిమహాముని భార్య పలుకువిని యా సీతయు నాశ్చర్యముననన్!
చిఱునవ్వులు జిందుచు దా వలికెను జిత్తము హర్షము బొంగారన్! 11

ఇదియే చాలును! నీ ప్రశంసలును నింపుగ వరముల నిచ్చినటుల్!
తపోబలముతో గూడిన యామెను దగ నమస్కృతులు జేయుచుహూ!
ధర్మజ్ఞయు నగు నా యనసూయము దగ జానకి మాటలు వినియున్!
ఇంకను సంతోషంబును బొందుచు నింపుగ నీ విధమున బలికెన్! 12

సీతా! నీ విషయంబున గలిగిన ప్రీతి సఫలమును జేయుదునూ!
విదేహ రాజకుమారీ సీతా! విమల కానుకల గైకొనుమా!
వస్త్రాభరణంబులు మాల్యంబును అంగ రాగమను లేపములన్!
ఇచ్చుచుంటినీ స్వీకరింపుమా! మెచ్చుకొనగ జను లందఱునూ
అనుకూలముగా నుండు నెల్లపుడు నతి శోభను గలిగించుచునూ!
దివ్యమైన యీ యంగరాగమును దీరుగ మేనిని బూసికొనీ! 3

విష్ణు నెటుల శోభింపజేయునో లక్ష్మి యటుల నీవును గూడన్!
నీ భర్తను శోభింప జేయునూ! నిరతము నీ యనులేపములన్! 14

అత్రి మహాముని సతియిచ్చిన యా యంగరాగమును వస్త్రములున్!
భూషణంబులను మాల్యంబుల మఱి పొలుపుగ మైపూతలనన్ని
ప్రీతిదానముగ గైకొనె సీతయు ప్రీతి నమస్కృతులను జేసెన్! 15

దృఢవ్రతయగు ననసూయా దేవియు గాఢమైన మది కోరికచే
ఉదాసీనమై యున్న జానకిని యల్లాసముతో నిటు లనియెన్!
స్వయంవరంబున బొందినాడటగ! సార్వభౌముడగు! రాఘవుడున్!
ఆ వృత్తాంతము సవిస్తరముగా నఖిలము వినగోరుచు నుంటిన్
యథానుభూతముగా వివరింపుము తథాను భూతిగ వైదేహీ! 15ఎ

ఆ యనసూయము నటుల వలుకగా నా పలుకులు విని జానకియున్!
ఆ కథ యంతయు దెలిపె ముని సతికి యానందము మది బొంగారన్!
మిథిలకు నధిపతి ధర్మ విదుండును మేదిని బాలించుచు నుండెన్!
అతని పేరు జనకుండు ప్రజలనూ సుతులుగ జూచుచు సంప్రీతిన్!
న్యాయముగా ధర బరిపాలించును న్యాయము దప్పడు యెన్నండున్!
సకల ధర్మ విదుదును వేదజ్ఞుడు సాధు పురుష డా భూపతియున్! 17

నాగలి వట్టీ యజ్ఞ భూమినీ నయముగ దున్నుచునుండగనూ!
భూమిని బ్రద్దలు జేసి పైకి నే బొలుపుగ వచ్చితి నట మాతా!

ఆ జనకునకు గుమార్తె నయితినీ యటుపై నాతడు నను జూచీ!
పిడికిళ్ళను నోషధి బీజములను బ్రీతిగ జల్లెడి కార్యమునన్!
మగ్నుడైన యాజవకుడు గాంచెను లగ్నంబైన పరాగముతో!
నన్ను గాంచి యాశ్చర్యము నందెను జిన్ని కూన నగు ననునెత్తీ! 18

సంతులేని యా జనకరా జటుల స్వయముగ నను జేతుల నెత్తీ!
అంకంబున గూర్చుండ బెట్టుకొని పొంకముగా నా సుత యనుచున్!
నాపై స్నేహము గ్రుమ్మరించెనూ! నయముగ నిజ సుత యన్నటులన్!
'అమానుషము సుమ! నీ చిఱుబాలిక యంకమునంధున జేర్చు మికన్!

ధర్మము జేతను నీ సుత సుమ్మా! ధరణిని కీర్తిని బొందెదవూ!!
ఆకసమందున యాపలుకులు విని యా మిథిలాపతి జనకుండున్!
జేరతీసె నను వాత్సల్యంబున జేసికొనెను దన బుత్రికగన్!
నాటినుండి యా భూపతి గూడను నయముగ యభివృద్ధియు బొందెన్!
ఇష్టమైన వస్తువును నిచ్చినటు నింపుగ నా భూపాలుడునూ!

పట్టము రాణికి నను నర్పించెను పట్టపు రాణియ నను మిగులన్!
మాతృప్రేమతో నాదరించె నను మంజులమగు స్నేహంబుననూ!
వివాహ సమయము దాపు కొచ్చెనని వికలత నందెను భూపతియున్!
విత్తనాశుడగు దరిద్రునకు వలె చిత్తము నందున జింతించెన్! 21

దేవరాజు సముడైనను గూడను దిక్కుల కధిపతియును నైనన్
కన్య తండ్రి బొందును లోకువయును గడు దిరస్కృతియును బొందున్!
సమానులైనా వారలనుండీ సరిలేనీ వారల నుండీ!
కన్య తండ్రి బొందును లోకువయును గన్యను గనుటయె తప్పేమో! 22

ఆ దిరస్కృతియు దగ్గఱ గలదని యాభూపతియును గ్రహియించెన్!
చింతా సంద్రమునందు మునిగెనూ! స్వాంతమందు శాంతము లేకన్!
తెప్పలేని మనుజుని వలె భూపతి తీరము జేరక పోయెనుగా! 23

అయోనిజను నను దెలిసిన జనకుడు ననురూపుండగు వరు నెదుకన్!
ఎంత శ్రమించిన దొరుకక పోయెను జింతను బొందుచు యోచించెన్!
నిరంతరము నాలోచన జేయగ నెమ్మది గలిగెను భావమునన్!
స్వయంవరము జేయగ కుమార్తెకును స్వాంతమునందున భావించెన్! 24

పూర్వమందు నొక యజ్ఞమునందున బొలుపుగ వరుణుడు జనకునకున్!
శ్రేష్ఠమైన యొక ధనుస్సు నిచ్చెను శివధనుస్సుగా నొప్పెడిదీ!
అక్షయ దూణీరంబులు గల రెండంబుల బొదులును దగ నిచ్చెన్! 25

మిక్కిలి బరువగు నా ధమస్సునూ మేదిని గల నరు లెవ్వరునూ!
ఎంత ప్రయత్నము జేసిననూ మఱి యింత కదల్పగ జాలరుగా!
రాజులు సహితము దాని వంచుటకు రహి సమర్థులును గారు కదా! 26

సత్యవాది యగు నా జనకుండును సరిరాజుల నందఱ బిలిచీ
రాజులతో నా ధనుస్సు గూరిచి రమ్యముగా నిటులను వలికెన్!
'ఏ భూపతి యీధనుస్సు నెత్తి నింపుగ నారిని సంధించున్!
ఆతని కిచ్చెద సీతను భార్యగ యలరి వివాహము జేయుదునూ!
సందియ మింతయు లేదుసుమా! ఓ జక్కని నరేంద్ర సుతులారా!' 27

గిరి సన్నిభయగు ధనుస్సు గాంచీ దరిజేరిరి ధనువెత్తగనూ!
కదల్పజాలక నమస్కరించీ కదిలిరి యెచ్చటి వారచటన్!
సుదీర్ఘకాలము గడిచిన పిమ్మట సుందరమగు నొక కాలమునన్
సత్యపరాక్రముడైన రాముడును సరసత లక్ష్మణుతో గూడీ!
విశ్వామిత్రుని వెంట వచ్చెనూ! విమల యజ్ఞమును గాంచుటకై! 28

ధర్మాత్ముండగు విశ్వామిత్రుడు తండ్రి జేసినా సత్కృతులన్!
అందుకొనుచు నా తండ్రికి దెలిపెను జిందుచు సంతోషంబుననూ!
రఘువంశంబున జనన మొందినా రమ్య మహాద్యుతి గలవాడున్!
రామలక్ష్మణుల గూర్చి తెలిపెనూ! రమ్యముగా నా జనకునకున్! 29

'దశరథ పుత్రులు రామలక్ష్మణులు ధనుర్దర్శనా కాంక్షితులున్
దైవికమగు నా ధనుస్సు జూపుము! దర్శనీయమును నగు దానిన్! 30

విశ్వామిత్రుని మాటలు విని యా విమల వ్రతుడు మా తండ్రియునూ
తెప్పించెను నా ధనుస్సు సభకును దీరుగ నందఱు గనుగొనగన్!
వీర్యవంతుడును మహాబలుండును వినయశీలుడగు రాముడునూ!
రెప్పపాటునను ధనుస్సు నొంచీ! రివ్వన నారిని నెక్కించెన్! 31

నారిని బూరింపగ నా రాముడు గడువేగమునను నా ధనువున్!
మధ్యకు రెండుగ భగ్నమైనదీ మహా భీషణంబగు ధ్వనితోన్
పిడుగు బడుచు నున్నట్లు యుండెనట భీతిలి రందఱు వరుసగనూ! 32

సత్యప్రతిజ్ఞుండగు నా జనకుడు సత్యవ్రతుండగు రామునకున్!
తనయనైన నను నిచ్చుట కొఱకై దగ జలకలశము దెప్పించెన్!
అయోధ్యాధి పతియును దన తండ్రియు నా దశరథు నాజ్ఞయులేకన్!
జనకుడు నిచ్చెడి కన్యాదానము సమ్మతి దెలుపక యుండె నటన్! 33

పిమ్మట నాజనకుండు దశరథుని ప్రీతిని నట రావించి మఱిన్!
అతని సమ్మతిని వివాహ మాయెను నందఱు సంతసమును బొందన్!
విదితాత్ముండగు రాముని కిచ్చెను విమలమతీ! సీతను నన్నున్!
సతీపతుల మిట యుంటిమి జననీ! సత్కృతులందుచు మీ చేతన్! 34

సాధు స్వభావయు, ప్రియదర్శిని యగు సతి నా యనుజను నూర్మిళనూ!
లక్ష్మణుకిచ్చి జనకుడు స్వయముగ సాక్షిగ పెండ్లియు దా జేసెన్! 35

అట్టి స్వయంవరమందు జనకుడును నా రామునకును నను నిచ్చెన్!
వివాహమైనది వేదవిధిని మఱి విమలములగు నగ్నుల యెదుటన్!
వీర వరాగ్రముడైన రామునీ విమల పథములను నడుచుచునూ!
ధర్మముచే ననురక్తురాలనై దగ యుంటిని యర్థాంగినినై! 36

(అయోధ్యా కాండమునందు 108వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - రెండవ భాగము

## నూట పందొమ్మిదియవ సర్గము

అనసూయ యొసంగిన వస్త్రాభరణములను ధరించి సీత రాముని
కు వచ్చుట- ప్రాతఃకాలమున రామాదులు మఱియొకచోటికి బోవుట

జ్ఞయు యనసూయా దేవియు దగ పవిత్రమగు గాథవినీ!
శిరస్సును యాఘ్రాణించెను శీలవతిని గౌగిలి జేర్చెన్! 1

క్షర పదములతో జక్కగ వ్యక్తబఱచితివి మధురముగా
సంవరం బెటు జరిగినదో మఱి స్వయముగ వింటివి సర్వమునూ!
రభాషిణీ! నీ కథ జేతను మానుగ సంతస మందితినీ! 2

 దాపునకు జేర్చి భానుడును రమ్యముగా బడమట జేరెన్!
క దూర ప్రాంతములకు బోయిన దోరముగా నా పక్షులుమా!
 గూడులకును జేరుచున్నవి తన్మయమున నిద్రించుటకై
షలవి వినిపించెడిని జానకీ! వని యంతయు గోలాహలమున్! 3

నులుగూడ స్నానంబులుజేసీ మోదముతో జల కలశములన్!
సినట్టి యా నార చీరలను దగ హస్తములను ధరియించీ!
పులుగా జనుదెంచుచుండి రదె నింపుగ జదువుదు సూక్తములన్! 4

యంకాలపు నగ్ని హోమములు సరసత జేయగ ఋషిమునులున్!
పోత శరీర వర్ణముబోలిన కప్మని సుగంధ ధూమములున్!
వనోద్ధతమై యెగురుచున్నవీ బన్నుగ దిశలకు వడివడిగా! 5

ల్పపర్ణ తరువులు గూడను నిట నతి దట్టముగా గన్పించెన్!
 ప్రదేశముప కనుమఱుగైనవి నిమ్ముగ దిశలును దిక్కులునూ!
కటితెరలవి వ్యాపించినవీ జెఱుపుచు ప్రకృతి యందములన్!
త్రి సంచరించెడి మృగంబులును రమ్యముగా నలుదెసలందున్!
ంచరించుచున్నవి గను సీతా! సహజ ప్రకృతిని వికృతినీ!
ఈ తపోవనము మృగములు మాత్రము నింపుగ యజ్ఞ సువేదికలన్!
వులయందున శయనించుటకై బోవుచున్నవీ సంప్రీతిన్! 6

తారలచే సమలంకృతమైనా తరుణి! రాత్రి ప్రారంభమయెన్!
వెన్నెల దుప్పటితో నదె చంద్రుడు జెన్నుగ కనబడె గగనమునన్!
మధురవచనముల సంతోషించితి! మాధుర్యములగు నీ కథలన్!
రాముని యొద్దకు బొమ్మిక జానకి రామ! యనుమతిని యిచ్చితినీ! 7

మైధిలి నే నిచ్చిన బహుమతులను మానుగ నా ప్రత్యక్షమునన్!
అలంకరించుక నలరుము సీతా! నా రాఘవుడును గనుగొనగన్!
దివ్యాభరణములను ధరించియును దిక్కులు దేజమునను దొలుకన్!
నాకు ప్రీతి గలిగింపు కుమారీ! నా కానందము గలుగంగన్! 8

దేవకన్యతో సమానురాలగు దివ్యతేజ యగు జానకియున్!
మునిసతి తెలిపిన తీరును దానును మురిపెముగా నవి ధరియించీ!
శిరస్సుచేతను నమస్కరించెను జిఱునవ్వులతో గూడికొనీ!
రాముని కభిముఖురాలై పోయెను ర[illegible]ణీయంబుగ జానకియున్! 9

భూషితురాలగు సీతను జూచెను బొలుపగు యాభరణంబులతో
అనసూయసతి ప్రీతి దానమున యానందించెను రాఘవుడున్!
ప్రేమపూర్వకము ముని సతి యిచ్చిన ప్రియమగు వస్త్రాభరణములన్!
పుష్పమాల్యమును నంగ రాగమును బొలుపుగ జూపెను రామునకున్! 10

మానవులకు మఱి సుదుర్లభంబగు మహిమాన్విత సత్కారములున్
సీతకు జరుగుట సంతసించిరి శ్రీరాఘవుడును లక్ష్మణుడున్! 11

అందమైన ముఖమును గల రాముడు జందముగా మునులిచ్చిన యా
యాతిథ్యంబును స్వీకరించి మఱి యారాత్రిని యచటను గడపెన్!
తెలతెలవారగ స్నానము జేసీ తీరుగ యగ్నిని బూజించీ
రామలక్ష్మణులు ననుజ్ఞ గోరిరి రమ్యముగా నా ఋషిమునులన్! 12

ధర్మాచరణము నున్న మునులునూ దగ రాఘవు లక్ష్మణు తోడన్!
మార్గమంతయును రాక్షస మయమని మఱి మఱి జెప్పిరి రామునకున్!
రామా విను! ఈ మహారణ్యమున రహి నరభక్షకు లైనట్టి
వివిధరూపములు గల రాక్షసు లిట వేలసంఖ్యలను గలరు సుమా!

రుధిరము ద్రాగెడి ఘోరమృగంబులు నధికముగా గల వంతటనూ!
ఏమరుపాటేమాత్రము దగదూ! యినవంశోత్తమ యిచ్చటనూ! 13

ఈ యరణ్య మందెవ్వడు గానీ యెట్టి దాపసుండైన నిటన్!
ఉచ్ఛిష్టుడుగా నున్నను మఱియును నేమరుబాటుగ నుండినను!
అట్టివాని జెఱపట్టి రాక్షసులు నిట్టె తిందు రానందముగా
బహు జాగ్రతగా బయనము జేయుము భార్యసీత లక్ష్మణు తోడన్! 14

ఫల పుష్పంబులు దెచ్చుట కొఱకును బన్నుగ వనిలోనికి బోవన్!
మునులందఱు నీ దారిని బోదురు మోదముగను నీ మార్గమునన్!
నీవును బొమ్మీ మార్గంబున నే నిఖిలము ననుకూలము నుండున్!
అని జెప్పిరి యామునులందఱు మఱి యాశీర్వచనముతో బ్రీతిన్! 15

సీతా లక్ష్మణ సమేతుడైనా శ్రీరాముండును వెనువెంటన్!
ఉత్తమ తపస్సు గల యా మునులకు గురుతర భక్తి వినేయతలన్!
నమస్కరించెను నత్రి మునికినీ నయముగ యా యనసూయకునూ!
స్వస్త్యయనంబుల స్వీకరించెనూ స్వీయ ధనుస్సును ధరియించీ!
సీతాలక్ష్మణ సమేతుడై మఱి శ్రీ పిలసిల్లగ రాఘవుడున్!
భాను డభ్రమండలము జేరినటు బ్రవేశించె నా వనియందున్! 16

(అయోధ్యాకాండమునందలి 119 సర్గము సమాప్తము)



# రచయిత నూతన గ్రంథములు

డైరెక్టర్ ఆఫ్ హైద్రాబాదు వారిచే
ది 25-10-99న జారీచేయబడిన సైటేషన్ నెంబర్ల జాబితాలోని

## మా స్వంత పుస్తకములు :

| | | |
|---|---|---|
| 1. మంచుముత్యాలు | 771 సాతె 700 13754 | రు. 12-00 |
| 2. శ్రీరామకథా సుధాలహరి బాలకాండము | 970 సాతె 800 158 | రు. 25-00 |
| 3. శ్రీ భగవద్గీత | 276 సాతె 200 101 | రు. 20-00 |
| 4. శ్రుతిలయలు | 1272 సాతె 800 455 | రు. 12-00 |

## 1999-2000లో నూతన ప్రచురణలు :

| | |
|---|---|
| 1. కలబోసిన ముత్యాలు (1000 ఆటవెలది గీతపద్యాలు) | రు. 20-00 |
| 2. ఆనంద యాత్ర (లలిత గీతాలు) | రు. 20-00 |
| 3. విరహగీతం " | రు. 20-00 |
| 4. ఆనంద గ్రంథి " | రు. 20-00 |
| 5. ప్రభాత గీతాలు (హరిపూజ) (తిరుప్పావై గీతములకు స్వేచ్ఛానువాదము) | రు. 20-00 |
| 6. హంసధ్వని (లలిత గీతాలు) | రు. 20-00 |
| 7. శ్రీరామకథా సుధాలహరి (చతురస్ర గీతికలు) అయోధ్యాకాండము (మొదటి భాగము 240 పే.) | రు. 30-00 |
| 8. అయోధ్యాకాండము (రెండవ భాగము 260 పే.) | రు. 30-00 |

## వెలువడనున్న గ్రంథములు :

శ్రీరామచంద్ర సుధాలహరి (చతురస్ర గీతికలు)

| | |
|---|---|
| 1. అరణ్యకాండము (350 పే.) " | రు. 40-00 |
| 2. కిష్కింధకాండము (350 పే.) " | రు. 40-00 |